# భారతి



ఏప్రెల్
1954
*
వెల రు. 1

# భారతి

సాహిత్య
మాస పత్రిక

సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రణాలయము
మద్రాసు.

సంపుటము 31 సంచిక 4
ఏప్రెల్, 1954.
విడిప్రతి వెల ఒకరూపాయి

# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1954

— ౦ —











# లైఫ్ బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిములనుండి మిమ్ములను కాపాడును







ఇండియాలో తయారుచేయబడినది

L. 246-X52 TL




"సంబుద్ధి"
చిత్రకారుడు : శ్రీ దశిక రామలింగేశ్వరరావు



జయ
చైత్రము

# భారతి

సంపుటము 31
సంచిక 4

# శుభోదయము

శ్రీ గజ్జెపల్లి సత్యనారాయణ

నా కవితా శుభోదయమునాటికి మా తెనుగిండ్లు మాఘ్య శీ
లాకర బాలికాకర కళాశ్రిత మోహన రంగవల్లికా
శ్రీ కలితంబులై సుమపరీమళితారుణ తోరణాల శో
భాకృతి స్వాగతంబిడు జయావహనవ్య వసంతలక్ష్మికిన్.

నా కవితా శుభోదయమునాటికి గ్రొత్త తెనుంగు రాజ్యల
క్ష్మీకర పద్మసౌరభ సమీర మనంత మనోజ్ఞమై బుధా
ళీకలరావ రమ్యరవళిన్ హావళించి స్వతంత్ర భావనా
లోక విలోలమై మొగులులో గలియున్నవ సాంద్రరాగమై.

నా కవితా శుభోదయమునాటికి తెన్గు ప్రబంధమర్ధ వి
ద్యాకమనీయనీతము, మహాజనతా రచితానుబంధ లీ
లాకృతమున్, నవోజ్జ్వల రసాత్మక మాత్మయశస్సరిత్కథా
నీకము శర్మదంబయి మనీషి మనోజ్ఞములన్ ధ్వనించెడిన్.

రస చర్చ

# శంకుకుని అనుమితి వాదము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

రసప్రతీతి సాక్షాదపరోక్షానుభూతి కాదని శంకుకుని వాదము.

విభావాదులద్వారా రసరూపమున పరిణమించు స్థాయి తెలియబడుటచే విభావాదుల నవగమకములనవలెను. అవగమకములగు విభావాదులు లేనిచో స్థాయిని తెలిసికొనజాలము. ఎచ్చటెచ్చట నిప్పుకలదో అచటనే ధూమము కనబడుట మన యనుభవమున కలదు. దూరమున పొగ కన్పించగా అచట నిప్పు కలదని మన కానుమానిక జ్ఞానము కల్గుచున్నది. పొగ కన్పించనిచో నిప్పు కలదను జ్ఞానము(అనుమాన ప్రమాణముద్వారా)సిద్ధించలేదు. అగ్ని కలదని సాధించుటకు ధూమప్రత్యక్షము కారణమగుచున్నది. ఇట్లే విభావాదుల జ్ఞానముతో స్థాయిభావము కలదని సాధించవలెననిన, విభావాదులు స్థాయిభావావగతికి హేతువులగును. విభావాది ప్రత్యక్షజ్ఞానమునుండి పరోక్షమున గల స్థాయిని సాధించుటయే కావ్య నాట్యావలోకనమున కన్పించుటచే రసజ్ఞానము అనుమానప్రమాణముద్వారా సిద్ధమగుచున్నదని శంకుకు డనినాడు.

విభావాదులచే స్వయముగా ఉత్పన్నము చేయబడుచు, అనుభావములచే సూచించబడుచు, సంచారి భావములచే పోషింపబడుచు, వీటి సంయోగవశమున స్థాయిభావము రసమగుచున్నది. రసీభావ ప్రక్రియలో స్థాయిభావమునకు ప్రధానస్థానము కలదు. కాని భరతుడు స్థాయిభావలక్షణమును చెప్పక మొట్టమొదటనే రసమునుగూర్చి పల్కుచున్నాడు. అట్టిచో శంకుకుడిచ్చట స్థాయిపరామర్శ చేయుట తగదని కొందరనినారు. కాని రసములను వర్ణించు సందర్భమున "ఉత్సాహో నామోత్తమప్రకృతిరుత్సాహాత్మకః"అని భరతుడు పలికినాడు. ఇట్లే హాస హాస్యముల సందర్భమునగూడ కలదు. దీనినిబట్టి రసములు, స్థాయిభావములు అభిన్నార్థకములని స్పష్టమగుచున్నది' ఇందువలన శంకుకుడు స్థాయిభావములనుగూర్చి పలుకదొడగినాడు. రసజ్ఞానమునకు హేతుభూతములగుటచే విభావములను రసలక్షణమున విస్తరించి చెప్పి, భావానువాదమున స్వల్పముగా భరతుడు చెప్పినాడు.

విభావాద్యుపచితమైనది స్థాయియని, తదుపచితావస్థారూపము రసమని లొల్లటాదుల వాదము. కాని ఈవాదము నంగీకరించినచో మందతము, మందతర, మంద, మాధ్యస్థ్యాదికమగు అనంతరూపములు గల స్థాయిభావము రాగలదు. ఇట్లే రసమునకుగూడ తీవ్ర, తీవ్రతర, తీవ్రతమాద్యసంఖ్యా రూపములు రాగలవు. పరిపుష్టమైనస్థాయియే రసమని లొల్లట, దండి, రుద్రటాదులతో పల్కినచో స్మితాది షడ్రూపములతోనున్న హాస్యరసము సిద్ధించజాలదు. ఈ ఆరు రూపములకు ప్రత్యేక ప్రత్యేకముగ ఆరుస్థాయి భావములు రావలసి వచ్చును. కాని ఇది భరతునకు సమ్మతము కాదు. పైగా ఉత్తరోత్తర ప్రకర్ష తారతమ్యవశమున అభిలాషాది దశావస్థారూపముగా శృంగారమును భరతుడు వివరించినాడు. పూర్వావస్థప్రకృష్టము కాగా కల్గునది పరావస్థ. ఈ పరప్రకర్షాధిగమమే రసనిష్పత్తి యనినచో శృంగారమున కన్పించు పదియవస్థలను పదిరసము లనవలసి వచ్చును. ఇది శాస్త్రవిరుద్ధము, అయుక్తికమునగుటచే, వర్తమానమున గల స్థాయిభావము పోనుపోను పరిపుష్టమై రసముగా పరిణమించునని చెప్పరాదని శంకుకుని భావము.

ప్రాగవస్థాభావమగు స్థాయి క్రమక్రమముగా విభావాద్యుపచితమై రసమగుచున్నదని పల్కినపుడింకొకదోషము కలదు. ఇష్టజనవియోగాది విభావముల ద్వారా ఉత్పన్నమగు మహత్తరమైనశోకము క్రమక్రమముగా ఉపశమించుట మన అనుభవమున కన్పించుచున్నది. శోకము రసవిలక్షణమైన స్థాయిభావమగుచు, పరిపుష్టమై రసమగుచున్నయెడల, క్రమక్రమముగా ఉపశమించు శోకము కరుణరసముగా పరిణమించలేదు. స్వస్వకారణవశమున ఉద్భూతములగు రతిక్రోధోత్సాహములుకూడ కాలవశమున సేవామర్షస్థైర్యములను కోల్పోవుచున్నవి. ఈ స్థాయిభావములు రసములుగా

పోషింపబడుటకుబదులు, రసములే స్థాయిభావములుగా క్షీణించుట కలదు. కావున స్థాయి భావపూర్వకత్వము రసమునకు చెప్పరాదని, రసపూర్వకత్వమే స్థాయిభావాదులకు గలదని భరతు డనినాడు.

రసావస్థను నటుడు ప్రదర్శించుచున్నాడు. ఈ అభినయము నవలోకించి, రూపకమున గల పాత్రల మనోవృత్తులను అనుప్రమాణము ద్వారా తెలిసికొను చున్నాము. విభావాది హేతుజ్ఞానము లేనిదే స్థాయి భావమును గ్రహించ లేము. విభావము లనబడు హేతువులు, కార్యభూతములగు అనుభావములు, సహచారి రూపములగు సంచారి భావములు అనునవి స్వాభావికములు గాగాక, ప్రయత్నార్జితములుగా నటుని అభినయమున గలవు. కాని వీటిని కృత్రిమము లని మనము భావించుట లేదు. అనుమీయమాన విలక్షణముగా రత్యాది స్థాయిభావములు నటునియందు సంభావ్యమానము లగుచున్నవి. కాని నటునియందు ఏవం విధస్థాయిభావ మత్యంతము అవిద్యమానమే యగును. నటుడు కావ్యగత పాత్రలను అనుకరించువాడు. స్థాయిభావము తత్తత్పాత్రలయందు గలదు, కాని నటునియందు గాదు. కావ్యగత పాత్రలకు నటునకు గమ్యగమక సంబంధము కలదు. విభావముల ద్వారా రసజ్ఞాన మానుమానికముగా సిద్ధించునట్లు, నటుని అభినయముద్వారా ముఖ్యరామాది గత రస మానుమానికముగా తెలియబడుచున్నది. ముఖ్యరామాది పాత్రలకు జెందినస్థాయికి అనుకరణరూపమై, అనుకరణరూపత్వ లక్షితమగుటచే రసమను వేరొక పేరును స్థాయిభావమే పొందుచున్నది. కావ్యబలానుసంధేయములుగా విభావములు, శిక్షణవలన అనుభావములు, కృత్రిమ నిజానుభావార్జనవశమున సంచారిభావములుఁ గలవు. కాని స్థాయి భావము కావ్యబలానుసంధేయముకూడ కాజాలదు. ఒకని మనోగతమగు స్థాయిభావము మరియొకనికి స్వాభావికముగా నుండజాలదు. ఒకని స్థాయిభావమును మరియొకడు అనుకరించగలడు. ఈ అనుకరణను హేతువుగా గ్రహించి అనుమాన ప్రమాణముద్వారా మొదటివానికి గల స్థాయిభావమును తెలిసికొనగలము.

ఈ అభిప్రాయమును బలపరచగోరి వాచికాభినయరూపమున రతిశోకాదులవగతము లగుట లేదని శంకుకుడనినాడు. రతిశోకాది శబ్దములు రతిశోకాద్యర్థముల నే చెప్పునవి. కావున

"వివృద్ధాత్మాప్యగాధోఽపి
దురంతోఽపి మహానపి
బాడబేనేవ జలధిః
శోకః క్రోధేన పీయతే"
"శోకేన కృతః స్తంభః
తథాస్థితో యేనవర్థితాక్రందైః
హృదయ స్ఫుటన భయార్తై
రోదితు మభ్యర్థ్యతే సచివైః."

అను శ్లోకములలో గల శోక మభిధేయమే గాని అభినేయము కాజాలదు.

"భాతి పతితో లిఖన్త్యా స్తస్యా
బాష్పాంబు శీకరకణౌఘః
స్వేదోద్గమ ఇవ కరతల
సంస్పర్శా దేవ మే వపుషి"

అను రత్నావలీ శ్లోకమున ఉదయనునియందు సుఖాత్మకముగాగల రతి స్థాయిభావము అభినయింపబడుచున్నది.

నాట్యమునగల వాచికాభినయమునకు, రస ప్రతీతికి గల అన్యోన్య సంబంధమును తెలిసికొన దలచినపుడు అభినయము వేరు, రసము వేరు అని గ్రహించుచున్నారు. అభినయమున రసావగతికి తీసికొనిపోగల శక్తి కలదు. రసజ్ఞానమునకు అభినయ జ్ఞానము హేతువగుచున్నది. ఈ రసము స్థాయిభావము కంటె విలక్షణము కాదు గనుక రససూత్రమున స్థాయి శబ్దమును భరతుడు ప్రయోగించ లేదు. కావున కావ్యగత పాత్రనిష్ఠమగు రతి స్థాయిభావమును నటు డనుకరించగా శృంగార రసము వచ్చుచున్నది.

ప్రదర్శించబడు వస్తుసౌందర్య బలమువలన ఆనుమానికముగా ప్రతీయమానమగు రసము సాక్షాదపరోక్షముగా భాసించుచున్నది. ఇంత మాత్రమున రసప్రతీతిని అపరోక్షానుభూతియని యనరాదు. ప్రత్యక్షముగా కన్పించు విభావానుభావసంచారి భావములనబడు విశిష్టహేతువులద్వారా పరోక్షమగు రసము తెలియబడుచున్నది. ఈ రసజ్ఞానము కావ్యానుమానసిద్ధము. లౌకికానుమానమున వ్యాప్తి జ్ఞానము ప్రసిద్ధమగుటచే ప్రసిద్ధహేతువు కన్పించును. కావ్యానుమానమున హేతుతుల్యములు లేక హేతు ప్రతీకలు అగు విభావాదులు కలవు. కావున రస ప్రతీతి అనుమాన ప్రమాణసిద్ధమని శంకుకుని వాదము.

## 2

ఈ వాదమున విచారణీయాంశములు కొన్ని గలవు. అభిజ్ఞాన శాకుంతలము ప్రదర్శింపబడునపుడు ఏడవ అంకమున దుష్యంత పాత్రను ధరించిన నటుడు

సుఖి అను ప్రతిపత్తి మనకులేదు. ఈ నటుడు సుఖి కాడనిగాని, ఇతడే దుష్యంతుడనిగాని, ఇతడు దుష్యంతుడగునా కాదాయను సంశయము కాని, దుష్యంత సదృశు డితడని కాని ప్రతిపత్తి మనకు కలుగుటలేదు. కాని ఏ దుష్యంతుడు సుఖియో వాడే వీడను ప్రతీతి మనకు కొంతవరకు గలదు. ఈ ప్రతీతి సమ్యఙ్మిథ్యా సంశయ సాదృశ్య ప్రతీతులకంటె విలక్షణమైనది. ఈ నటుడు దుష్యంతుడు కాడని మన మెంచుటలేదు. సందేహబుద్ధి, తాత్త్వికమనుబుద్ధి, విపర్యాసబుద్ధిగాని లేక, వీటికన్న విలక్షణమై, ఈ నటుడే దుష్యంతుడను ప్రతీతి మనకు గలదు.

రస ప్రతీతిలో అనుకరణ గలదని శంకుకు డని నాడు. ఈ అనుకరణ యెట్టిది? ఎవ రెవరిని అనుకరించును? సామాజికు డనుకరించుచున్నాడా? కావ్యగత పాత్రలను నటు డనుకరించుచున్నాడా? ఒకడు చేసిన పనిని చూచి తత్తుల్యమగు పనిని చేసిన దీనిని అనుకరణ అందురు. అనుకరణకు సాదృశ్య మవసరము. నాట్యవేదిపై గిన్నెలోని పాలను త్రాగుచు నటుడు సురాపానమును అభినయించగలడు. కాని పాలు, గిన్నె లేనిచో సురాపానము ననుకరించజాలడు. సురాపానము చేయుచున్నాడను జానమునకు హేతువులుగా వర్తించు గిన్నె పాలు, త్రాగుట, అను మూడును ఉండితీరవలెను. ప్రత్యక్ష సిద్ధమగు నీ మూటినుండి పరోక్షమగు సురాపానమును ఆనుమానికముగా సాధింపవచ్చును కావున అనుకృతినుండి ఆనుమానిక జ్ఞానమును పొందవలెననిన, అనుకృతి యని పిలువదగిన విశిష్టప్రవృత్తి కన్పించవలెను. పాత్రయొక్క రతియనుభావమును నటుడనుకరించుచున్నాడని చెప్పవలెననిన, నటుని ప్రవృత్తియందు అనుకరణయొక్క విశిష్టస్వభావము కన్పడవలెను. కాని ఇట్టి స్వభావము ఇచట కన్పించదు. కావ్యగతమైన పాత్రయొక్క ప్రవృత్తిని మనము దర్శించలేనంతవరకు నటుని ప్రవృత్తిని అనుకరణ అనలేము.

నటుడు శృంగార రసము నభివ్యక్తము చేయునపుడు అభినయాది పరిస్పందములు కన్పించుచున్నవి. అభినయమున కన్పించు సాత్త్వికానుభావములు రతిస్థాయిభావముయొక్క అనుకరణలు కాజాలవు. చిత్తవృత్తియగు స్థాయిభావ ముద్దీపితము కాగా, సాత్త్వికాద్యనుభావములద్వారా బాహ్యాభివ్యక్తిని ఈ స్థాయిభావమే పొందుచున్నది. ఇచట కారణభూతమైనది చిత్తవృత్తి, కార్యభూతమైనవి అనుభావములు. స్థాయిభావ మనబడు చిత్తవృత్తియే విభావానుభావాదులను సమన్వయపరచు అనువృత్త సూత్రము, విభావానుభావాదులచే అనుకరింపబడినది స్థాయి కాజాలదు. కావున పాత్రల చిత్తవృత్తులను కవి, నట, పాఠక, సామాజికు లనుకరించుట లేదని స్పష్టము.

నటుని చూపు రోమాంచగద్గదికాదికము, భ్రూక్షేపాదులు, మొదలైనవి చిత్తవృత్తి రూపమగు రతియొక్క అనుకరణములుగా ప్రతీయమానము లగుటలేదు. ఈ యనుభావములు భౌతిక దేహమునకు సంబంధించినవి మాత్రమే గాక, చిత్తవృత్తికన్న విలక్షణమగు భిన్నేంద్రియ గ్రాహ్యములు, భిన్నాధికరణములు గలవని గ్రహింపవలెనని తాత్పర్యము.

నటగతమైన చిత్తవృత్తియగు రతియే సామాజికునిచే అనుకరింపబడి శృంగారముగా ప్రతీయమానమగుచున్న దనినచో ఈ ప్రతీతి యేవిధముగా కల్గుచున్నది? ప్రమదాది కారణములు, కటాక్షాద్యనుభావములు, ధృత్యాది సంచారిభావములు కలసి చిత్తవృత్తియగు స్థాయితో సహకరించి ప్రతీతి యోగ్యము లగునట్లుగా నటుని చిత్తవృత్తి భాసించుచున్నదని సమాధానము నొసగవచ్చును కాని నటుని చిత్తవృత్తి రత్యాకారముగా భాసించుచున్నచో రత్యనుకరణమునకు ప్రసక్తి లేదని స్పష్టమగుచున్నది.

అనుకరింపబడునది కావ్యగతమైన పాత్రయగుటచే దీనిని అనుకార్యమందురు. అప్పుడు నటుడు అనుకర్త యగును. [illegible]ర్యవిషయమున విభావాదులు పారమార్థికములని, అనుకర్తయగు నటుని విషయమున అట్లు కాదని శంకుకుని వాదము. నటుని విషయమున విభావాదులు వాస్తవకారణములు కాకపోయినచో వాస్తవఫలితముల నొసగుచున్నవను ప్రతీతి యెట్లు వచ్చుచున్నది? కావ్యశిక్షాది బలమున కృత్రిమములయ్యును, వాస్తవములుగా భాసించగలవా? సామాజికులీవిభావానుభావ సంచారిములను కృత్రిమములని భావించుచున్నారా? కృత్రిమములని భావించిన, రత్యాదిస్థాయిభావావగతి సిద్ధించదు. నటుడు కేవల మనుకర్తయే యైనచో నటు డనుకరించుచున్నాడను జ్ఞానము సామాజికున కెట్లు కల్గుచున్నది? అనుకరింపబడు స్థాయిభావముయొక్క సంచారిభావానుభావములు స్వాభావికములు కాలేవు. అట్టిచో అనుభూతమగు రసముకూడ స్వాభావికము కాజాలదు.

ప్రసిద్ధమగు రతి లక్షణ కారణమువలన రత్యనుకరణమను కారణాంతరము, జన్మించుచున్నదని, ఈ కారణాంతరమునగల ప్రభావవశమున అనుభావములు

వచ్చుచున్నవని, శంకుకు డనవచ్చును. రతిస్థాయి భావమును నటుడు ప్రదర్శించుచున్నా డనుకొందము. దుష్యంతాది పాత్రలలోగల రతి ప్రధానకారణము. దీనివలన నటునియందు కారణాంతరముగా రత్యనుకరణము కన్పించుచున్నది. ఈ రత్యనుకరణమున కన్పించు విభావాదికమగు హేతువుద్వారా రత్యనుకరణమే తెలియబడగలదు గాని ప్రధానపాత్రలోగల రతియనుభావము తెలియబడదని చెప్పవలెను. కాని సామాజికులకు రత్యనుకరణ ప్రతీతి ఆవంతయు లేదు.

అనుకరణజ్ఞానమను హేతువుద్వారా పరోక్షమగు రస మవగతమగుచున్నదనుట కూడ అయుక్తమే. ధూమప్రత్యక్షమునుండి పరోక్షమున అగ్ని కలదని తెలసికొనునపుడు ఈ ధూమజ్ఞానము హేతువు. ఈ ధూమము సదా అగ్నితో సంబద్ధమైయుండునని మనకు తెలియును. దీనిని వ్యాప్తిజ్ఞానమందురు. ఇచట హేతువగు ధూమము సాధ్యమగు అగ్నిని అనుకరించుచున్నదని చెప్పుట ఉన్మత్తప్రలాపము. ధూమ సదృశముగా పొగమంచు కన్పించును. అగ్ని సదృశముగా జపాకుసుమము కన్పించును ధూమము ననుకరించునట్లుండు పొగమంచును జూచి, అగ్నిని కాని, అగ్నిని అనుకరించునట్లుండు జపాకుసుమమును గాని పరోక్షమున నున్నట్లు మనము తెలిసికొనలేముగదా! కావున ఒక అనుకరణమునుండి మరియొక అనుకరణమును తెలసికొన వీలులేదు. అగ్నిధూమములకుగల నియత సంబంధము వీటి అనుకరణలలో కన్పించదు. ఇట్లే ఒక అనుకృత విషయజ్ఞానమునుండి తదనుకార్యజ్ఞానము కలుగ నేరదు. ఆనుమానిక జ్ఞానమున ప్రత్యక్ష పరోక్ష విషయములకు నియతసంబంధముండి తీరవలెను. ఇట్టి సంబంధము అనుకరణలలో కన్పించకపోవుటచే అనుకరణద్వారా రసము ఆనుమానికముగా తెలియబడుచున్నదని చెప్పరాదు.

దుర్వాస వేషధారియగు నటుడు శకుంతలా ప్రవృత్తినిజూచి కోపగించినట్లు కనబడుచున్నాడు. ఇచట నటునకు కోపమున్నదా? లేదా? కోపములేని నటుడు క్రుద్ధునివలె కన్పించుచున్నాడని శంకుకు డనవలెను. భ్రుకుటి మొదలగువానిని గమనించి క్రుద్ధసదృశుడే నటుడని యనవలెను. కాని సామాజికుల కిచట సాదృశ్యజ్ఞానములేదు. నట, దుర్వాసులకు వైలక్షణ్యములేదని, కోపము వాస్తవమైనదేయని ప్రతీతిగలదు. దుర్వాసకోపమును నటు డనుకరించుచున్నాడను జ్ఞానము సామాజికులకు కల్గినచో, పరచేష్టానుకరణరూపమగు హాస్యమే ప్రతీయమానమగును గాని కోపముకాదు. హాస్యప్రాయమగు ఈ కోపము పంచమాంకమున కన్పించు విషాదవృత్తమునకు హేతువు కాలేదు.

దుష్యంత పాత్రను ప్రదర్శించునటుని దుష్యంతునిగా భావించుచున్నాము. రూపక ప్రదర్శనావసరమున ఇతనిని నిజనామముతో గాని, వేరొక పేరుతో గాని మనము వ్యవహరించుటలేదు. నట దుష్యంతులకు అభేదరూపము ప్రతిపాదింపబడుచున్నది. రూపకానంతరము ఎప్పుడైనను ఈ ప్రదర్శనను విచారించవలసి వచ్చినచో మన మీ అభేదజ్ఞానమును పరిత్యజించుట లేదు. రసప్రతీతిలో ఈ అభేదజ్ఞానమే తాత్త్వికముగా భాసించుచున్నదని భావము. ఈ అభేదజ్ఞానము కేవలము భ్రమయని రోంచెడమేని, ఈ భ్రమ ఎట్లు ఉత్పన్నమైనది? దీని స్వభావమేమి? దీనికి, తత్త్వజ్ఞానమునకు గల సంబంధమేమి? అను ప్రశ్నలకు సమాధానము నీయవలెను. పైగా ఒకే ఒక పాత్ర భిన్ననటులచే ప్రదర్శింపబడుట గలదు ఏ నటుడు దుష్యంతపాత్రను ప్రదర్శించినను, అతనిని దుష్యంతుడని భావించుచున్నాము. తద్ద్వారా దుష్యంతాది పాత్రలు విశ్వజనీనములని, వ్యక్తులందరితోను వీటికి అభేదముగలదని, దుష్యంతత్వము సామాన్య రూపమని నిశ్చితమగుచున్నది.

శిక్షావశమున అనుభావములు, కృత్రిమ నిజానుభావార్జన బలమున సంచారిభావములు వచ్చుచుండగా విభావములు కావ్యబలాను సంధేయము లగుచున్నవని శంకుకు డనినాడు. కావ్యగతవాచోయుక్తిని అనుసరించి విభావములు ఆత్మీయములుగా పరిగణింపబడుచున్నవనుట ప్రామాదికము. 'ఈ శకుంతల మామకీనము' అని స్వాత్మీయత్వ రూపమున నటునకు ప్రతిపత్తి కలుగుటలేదు శకుంతలా దుష్యంతుల అన్యోన్య సంబంధము సామాజికులకు అవగతమగుచున్నది. తాను దుష్యంతుడను అనుభావము నటునకు కల్గుటచే విభావరూపమున శకుంతల సాక్షాత్తుగా కన్పించుచున్నదేగాని కావ్యబలానుసారమున గాదు. సామాజికులకు కలుగు ప్రతీతిని అనుసరించికూడ రసమును స్థాయ్యనుకరణమని చెప్పజాలమని స్పష్టమగుచున్నది.

దుష్యంత పాత్రను ప్రదర్శించినపుడు నటున కెట్టిదైన చిత్తవృత్తి కలుగు? తను దుష్యంతునకన్న విలక్షణుడను బుద్ధియున్నదా? దుష్యంతునకన్న విలక్షణుడను బుద్ధియున్నచో నటుని చిత్తవృత్తులు

మాటిమాటికి ప్రయోజ్య దుష్యంత ప్రవృత్తికి అంతరాయములను కల్పించగలవు. కాని దుష్యంతునిగాని, దుష్యంతునిచిత్తవృత్తినిగాని, అనుకరించుచున్నాననను జ్ఞానము నటునకులేదు. ఒక విషయమును చక్కగా అనుకరించవలెననిన ఆ విషయమును పూర్తిగా చూచి తెలిసికొనియుండవలెను. తనకు సమకాలీనుడగు వ్యక్తిని తాను తెలిసికొనినట్లు నటుడు దుష్యంతుని తెలిసికొనలేడు. అనుపలబ్ధమగు దుష్యంత ప్రవృత్తిని నటు డనుకరింపలేడు. తను ప్రత్యక్షముగా గమనించిన ఉత్తమప్రకృతిగల పురుషుని శోకమును నటుడారవ అంకమున అనుకరించుచున్నాడని చెప్పినచో, ఎట్లు అనుకరించుచున్నాడో తెలుపవలసియున్నది. అనుకార్యము శోకమగుటచే, శోకముద్వారా అనుకరించుచున్నాడని చెప్పుట అసంబద్ధ ప్రలాపమగును. నటున కితఃపూర్వములేని శోకముతో శోక మనుకరింపబడజాలదు. అశ్రుపాతాదికము శోకజనిత మగుటచే దీనిద్వారాకూడా అనుకరణ జరుగనేరదు. కావున ఉత్తమ ప్రకృతిగల పురుషుని శోకమున ఏయే అనుభావములుగలవో వాటిని అనుకరించుచున్నాడని చెప్పవలెను. అప్పుడు ఉత్తమప్రకృతి అనగా నేమి? అను ప్రశ్న రాగలదు. ఉత్తమప్రకృతిగల పురుషునియందు వైశిష్ట్యములేనిచో నటుని బుద్ధియం దాతని ప్రవృత్తి లగ్నము కాలేదు. పైగా ఉద్దీపితములైన సంచారిభావములచే నుద్భూతములగు అనుభావములు స్వతఃసిద్ధములు కావు. ఎవడీవిధముగా శోకమును అనుభవించునో అతని శోకమును నటుడు చూపుచున్నాడనిన, నటున కట్టి వ్యక్తియొక్క అనుభూతియందు స్వాత్మానుప్రవేశము కల్గుచున్నదని స్పష్టము. కావున అనుకార్యానుకర్తృభావము నిరస్తమగుచున్నది.

శిక్ష, స్వవిభావస్మరణము అనువాటి ద్వారా చిత్తవృత్తి సాధారణీకరణము కలుగగా నటునకు హృదయసంవాదము సిద్ధమగుచున్నది. ఈ హృదయసంవాదమువలన నటుడు కేవల మనుభావములను చూపుచు, ఉచిత వాక్యాది పూర్వకముగా భాషించుచున్నట్లు ప్రతీయమానుడగుచున్నాడు. ఇంతేకాని అనుకరణను తెల్పుటలేదు. అసంవేద్య వస్తువృత్తమును సంవేద్యముగా చేయుటలో అనుకరణకు ప్రసక్తియేలేదు. విభావాది సమూహమున రతి సదృశతా ప్రతిపత్తి లేకపోవుటచే రసములు భావానుకరణములని చెప్పరాదు.

“సుఖదుఃఖములను జన్మింపచేయ శక్తిగల విషయసామగ్రి బాహ్యజగమున కలదు. సాంఖ్యదర్శనానుసారము సుఖదుఃఖ స్వభావముగలది రసము. విషయసామగ్రియందు దళములవలె విభావములు, సంస్కారకములుగా అనుభావ వ్యభిచారి భావములు, తత్సామగ్రీజన్యములై అంతరములుగా సుఖదుఃఖ స్వభావముగలవి స్థాయిభావములునై యున్నవి” అని శంకుకుడు వచించియున్నాడు. సుఖదుఃఖ స్వభావముగల స్థాయిభావములు కేవలము చిత్తవృత్తులని శంకుకు డిచట అంగీకరించినాడు. కాని మొదట స్థాయి, రసశబ్దముల కేమాత్రము భేదము లేదనివాడు గూడ శంకుకుడే. చివరకు తన తప్పును తానే దిద్దుకొని, స్థాయిభావ మాంతరంగిక చిత్తవృత్తియని, రసము జగన్నిష్ఠము లేక విషయ సామగ్రీ నిష్ఠము అని గ్రహింపగల్గినాడు.

## 3

రసాస్వాదనసమయమున రసము తాత్త్వికమా? కాదా? అను ప్రశ్న బయలుదేరదు. లౌకిక సన్నివేశసదృశముగా రసము గ్రహింపబడుటలేదు. రూప్యస్మృతి పూర్వకమగు శుక్తి రూప్యప్రతీతివంటి భ్రమాత్మకమగు జ్ఞానము సహిత మిచట కన్పించదు. రసజ్ఞానము ఆరోపాద్యవసాయాత్మకముగూడ కాదు. చంద్రముఖియను శబ్దప్రతీతిలో గల ఉత్ప్రేక్షగా కూడ రసమును నిర్వచింప వీలులేదు. చిత్రప్రస్తాది కర్మలలో కన్పించు లౌకిక ప్రతికృతిగా కూడ రసమును చెప్పరాదు. రసము లౌకికానుకారము గాదు. ఇంద్రజాల క్రియలో తాత్కాలికముగా నిర్మింపబడునట్టి విషయముగా గూడ రసమును నిర్వచింపరాదు. హస్తలాఘవాదియుతమగు మాయచే జనించు చిత్రముతో రసమును పోల్చరాదు. ఆస్వాదింప బడు రసమున మనము ఉదాసీనులమై ప్రవర్తించుట లేదని భావము.

కావ్యమున వర్ణింపబడు దుష్యంతాది పాత్రలతో మనకు ఇంద్రియ సన్నికర్ష పూర్వకమగు ప్రత్యక్ష ప్రతీతిలేదు. కాని ఒక నటుడు దుష్యంత పాత్రను స్వీకరించి రంగస్థలమును ప్రవేశించగానే అతడు దుష్యంతుడే అనుబుద్ధి మనకు కలుగుచున్నది. ఇట్లే అభిజ్ఞాన శాకుంతలమును చదువునపుడు దుష్యంతుడే ఆయా పంక్తులను ఉచ్చరించుచున్నాడను ప్రతీతి మనకు కల్గుచున్నది. అంతేగాక కావ్యానుశీలనవశమున మన మానసములు విశదములై, విస్తర

వికాసములనందగా, ఆయా పాత్రలు మనలో సంకలితము లగుచున్నవి. గుణాలంకార మనోహర శబ్దార్థ శరీరము, లోకోత్తర రసప్రాణకమునగు కావ్యము నవలోకించు వేళ హృదయసంవాదవశమున నిమగ్నాకారమగు చిత్తవృత్తి మనలో బయలుదేరుచున్నది. మన మాయాపాత్రలలో నిమగ్నులమగు నప్పుడాయా పాత్రలు మనలో అంతర్లీనము లగుచున్నవి. తద్ద్వారా లోకోత్తర దర్శన శ్రవణ యోగ్యుల మగుటగలదు. ఏవంవిధస్థితికి అనేక సన్నివేశములు ఉపకారకము లగుచున్నవి.

గీతాతోద్యముల నాలకించునపుడు సాంసారికమగు లౌకికభావము విస్మృతమై, హృదయము నిర్మలమైన దర్పణమువలె భాసించును. సూచ్యాద్యభినయావలోకనమున ప్రమోద శోకాది తన్మయీభావము వచ్చుచున్నది. పాఠ్యమును వినుచు, పాత్రాంతర ప్రవేశము నవలోకించునపుడు మనలో విశిష్టమగు పరిణామ సంస్కారము కల్గుచున్నది. దేశకాలాది విశేషావేశములు తిరోహితములగుట ఇందలి ముఖ్యవిషయము. అప్పుడు సమ్యఙ్మిథ్యా సంశయ సంభావనాదికమగు జ్ఞాన విజ్ఞేయత్వ పరామర్శ కాస్పదము కాజాలని స్థితిచేకూరును. దుష్యంతాది పాత్రలను తమపై ఆరోపించుకొనిన నటులు కన్పడగానే తత్సంస్కారానువృత్తికి కారణభూతములు, తత్సహచర హృద్యవస్తు రూపములునగు గీతాతోద్య ప్రమదానుభవ సంస్కారములచే సూచింపబడుచు, సమనుగత మగుచున్నటు దుష్యంతాద్యభేదబుద్ధి సామాజికునకు కల్గుచున్నది. ఈ అభేదబుద్ధిలో దుష్యంతాదులు సామాజికునిలో అంతర్లీనములు గాగలరను ప్రతీతి సామాజికునకు వచ్చును. తన ఆత్మద్వారా, తన ఆత్మలో సామాజికుడు కావ్య జగమును దర్శించ గల్గుచున్నాడని భావము.

ఈ దర్శన దేశకాలాదులచే అనియంత్రితము. ఇచట సంవిద్విశేష రంజకములగు రమ్య గీతాతోద్యాది సంస్కారములద్వారా హృదయాభ్యంతర నిఖాతమగు రసానుభవము కల్గుచున్నది. ఇట్టి రసాస్వాదమును అనుకారమని ఎంచితిమేని రసము అనౌచిత్య గ్రాహ్యమగును. పరచేష్టానుకరణద్వారా హాస ముద్భవించునని భరతుని వాక్యముగలదు. అనౌచిత్య జనితమైనది అనుకరణ. ఔచిత్యవంతమగు రసమున అనుకరణ కన్పించ వీలులేదు. కావున ప్రమదాది విభావానుకరణము రసమున గలదని చెప్పరాదు. నియతానుకారముగాగాని, అనియతానుకారముగాగాని రసమును, నాట్యమును నిర్వచింపరాదని భట్టనాయకుడు, తౌతభట్టు ప్రపంచించియున్నారు.



# సంధ్యా వందనం

శ్రీ పురిపండా అప్పలస్వామి

రాతిరి తీరని ఇదిలో
అలిసిన జాబిలి పిల్లను
మబ్బుల వసనం కప్పి
నగ్నత పోగొట్టిన
చలికత్తెలు
వేకువ తెలిగాలులు
శిశువు పాత్రం కావో!—

అంబరం
దిగంబరిలా,
ఆకలిలా,
ఉరికొయ్యల వేలాడే
నేస్తగాని
నేత్రంలా—
కాలం కర్కోటకుండు
కోరల నుద్ధారించిన
విషవహ్నిచ్ఛట సోకిన
తూరుపు నల మహారాజు
బాహుకుడై పడిపోతే,

తన ఇంతికి
దిగ్దంతికి
దమయంతికి
కల్లబొల్లి మళ్లీ పెళ్లి—

భీతిల్లిన రాతిరి సైరంధ్రిని
చెరపట్టిన అరుణకీచకుడు
అనూరుడై
పాపం!—

వేశ్యమాత లాస్యతృష్ణ
క్షతక్షతం దంతక్షత
మయూరపద నఖక్షతం
విస్సన మూల్గిన వేదం
ఇస్సీ!—

కొక్కొరో కొక్కో కోకో!
కావుకావు కావుమన్న
కాకిపాట కిదే తావు
కోయిల పాటా?
అది నా పోయిన మాట.

# తిక్కన పాత్రనిర్మాణవైచి

## గరుడోపాఖ్యానము

శ్రీ తెన్నేటి పూర్ణచంద్రరావు

తిక్కన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాకునా, నే ముఖంబున దాబల్కిన పల్కు లాగములై వర్తిల్లునా, వాణీనర్తన నీతిం దోతురం కునా, జను మహాత్ముడైన్ కవిబ్రహ్మనా ప్రశస్తిబడసినవాడు బుధారాధన విరాజియగు తిక్కన సోమయాజి. ఆమహాభాసుని కవితాకళాకౌశలముం గూర్చి యనేకులు విమర్శించి యున్నారు. వారిలో పెక్కురు విరాటోద్యోగము లనే విమర్శించిరి. తిక్కనగారి రచనా ప్రౌఢిమ విరాటమునం దెట్లున్నదో అనుశాసనిక పర్వమునను నట్లేయున్నది. కాని అనుశాసనికాదులందు హృదయాహ్లాదికథ లేకుండుట సాహితీ పిపాసువుల దృష్టిని విశేషముగ నాకర్షింపలేదు. కాని తిక్కన రచనా సౌందర్యమును అవగాహనము చేసుకొను మనసు దనిలి పరికింతుమేని అంతమూల్యములగు మణులెన్నియో లభింపగలవు. అట్టి మణిజాలమున 'గరుడోపాఖ్యానము' సానదీర్చిన యొక మహావజ్రము.

కొందరు దీనిని నన్నయగారి గరుడోపాఖ్యానముతో బోల్చి మంచిచెడ్డలు నిర్ణయింతురు. తారతమ్య పరీక్ష యావశ్యకమే యగును గాని ఆపోల్పబడునవి ఒకే విధమైన శైలిగలవై యుండవలయును. తారతమ్య పరీక్షను చేయునపుడు కథాకథన శైలికి చెందిన రెండు కావ్యములను పోల్చి మంచిచెడ్డలు నిర్ణయించినఁ దప్పులేదు. కాని కథాకథన శైలికి చెందిన దానిని నాటకీయ శైలికి చెందిన దానితో పోల్చుట ఎట్లు? అట్టి పోలిక శైలుల మధ్య నేయగును గాని రచయితల మధ్యనగునా? కాబట్టి నిరర్థకములగు నీ పోలికలు పిడివాదములకు దప్ప సత్యాన్వేషణ కేమాత్రము ప్రయోజనకారులు గావు. నన్నయగారు రెచ్చటను కథను నిలువనీయరు. ప్రతి పద్యమునందు కథ ముందుకు జరుగుచుండును. తిక్కనగారు పాత్రలను ప్రవేశపెట్టి, నిలిపి, వాని సంభాషణముల మూలమున కథను గోచరింపజేయును, నన్నయగారు కథ నెట్లారంభింపవలెనో, ఏ విషయమును ముందుచెప్పి దేనిని పిదప జెప్పవలయునో—ఈవిషయములందు కడు జాగరూకత వహింతురు. తిక్కనగారు ఏపాత్రచే నే మాట యనిపింపవలయునో, ఏయే సన్నివేశముల నేపాత్ర కెట్టి మానసికస్థితిని వర్ణింపవలెనో—ఈవిషయములందు దత్తప్రయత్నులై యుందురు. గతి ప్రధానమైన శైలి నన్నయగారిది. స్థితి ప్రధానమైన శైలి తిక్కనగారిది. నన్నయగారి శైలి ప్రవాహము వంటిది. తిక్కనగారి శైలి శుద్ధ కాసారము వంటిది. దాని యందము వేరు; దీని యందము వేరు. ఇట్లు చెప్పుట వలన నన్నయగారి రచనమున సంభాషణా ప్రాగల్భ్యము లేదని గాని, తిక్కనగారి రచనమున కథాకథనశక్తి కుంటుపడెనని గాని యర్థము కానేకాదు. "దండినః పదలాలిత్యం, భారవేరర్థ గౌరవమ్, ఉపమా కాళిదాసస్య మాఘేసంతి త్రయోగుణాః" అన్నపుడెట్లో, నన్నయగారి శైలి కథా కథనము తిక్కనగారి శైలి నాటకీయము నన్నపుడు నట్లే. కాబట్టి వీరిరువురి రచనములను పోల్చి మెఱుగుతఱుగులు చూపింప దొరకొనుట మహాసాహస మనియే చెప్పదగియున్నది.

నన్నయ తిక్కన లిరువురును మహాకవులు. మార్గదర్శకులు తిక్కిన తెలుగు కవులెల్లరు వీరిలో నెవ్వరినో యనుసరించిన వారే. 'కవులకెల్ల గురువు తిక్కన; తిక్కనకు గురువు నన్నయ' యనుమాట సముచితమే. తిక్కనగారి రచనను పరిశీలించినచో ఆయన నాటకీయ శైలి సుస్పష్టము కాగలదు. చిన్న కథనైనను స్వయం సమగ్రముగ చిత్రింతురు. గరుడోపాఖ్యానమునందే ఉచ్చైఃశ్రవమును జూచి కద్రూవినతలు వాదించుకొనుటను జూచిన సంభాషణల నాయన యెట్టి దక్షతతో నిర్వహింపగలడో తేటతెల్లమగును.

"వ. నిజేచ్ఛమైవచ్చిన యుచ్చైఃశ్రవంబు నిట్లాలోకించి.'

వినత :—హాయుమింత నొప్పునె? యనూన ధవళ ప్రభాఢ్యమై (అని పలుకన్ విని)

కద్రువ :— అపరాంగంబున నీలిమ దోచె (ననియె భూపవరేణ్య)

(అనవుడు నమ్మృగాక్షి) :—యిటులాడితి నవ్వులకాడితో, నిజంబునకునో, నీదు చూపునకు జోలిన భంగియె చెప్పుము! (అన్న)

అవ్వనిత :— (దరస్మితస్ఫురిత వక్త్రముతో) ఇది యేటిమాట? నల్లని ఎడగానరాదె? తెరులంబలుకం బనియేమి? (నావుడున్)

వినత :—(తెలియం జూచి) కాదు (అని పూని పల్కుటయు)

కద్రువ :—పన్నిదమేమి దీనికి న్వాదిది యేల రిత్త (అనినన్ విని)

ఆసతి :—నిక్కమేని నీవేదిపణంబుగా దలచి ఏర్పడ జెప్పితి దానికేను సంవాదము సేయుదాన గరువంబుగ నొక్కటి నిశ్చయింపుమా!

(అనిన విని) కద్రువ :—(వినతవదనంబున చూడ్కి నిలిపి) నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను జేయగలదాన, నేను గెల్చినను నీవునాకు జేయంగగలదాన వీకడింది పన్నిదముసుము (అని తెగటాడి పలికె)"

[అను. ప్ర. 184—190]

తిక్కనగారి పద్యములను నాటక పద్ధతిగా పైన వ్రాసితిని. 'అని పలుకన్ విని, అన్న, నావుడున్, అని పల్కుటయు, అనిన విని' యనుమాటలను తీసి వైచినచో తిక్కన భాగమంతయు నాటక సంభాషణము వంటిదగును. తిక్కన నాటకీయముగ వ్రాయవలయుననిఅనుకొనియే వ్రాసియుండునా యను నాశ్చర్యము ఈవిధమైన సన్నివేశముల జూచినపుడు కలుగక మానదు. పాత్రలనోట తత్తదుచిత భాషణముల నాడించుటయే గాక వారి ముఖవికాసములనుగూడ "తెలియం జూచి, దరస్మితస్ఫురిత వక్త్రముతో, వినతవదనంబున చూడ్కి నిలిపి" ఇత్యాది పదంబులతో వర్ణించును. అచటనే గాదు. గరుడోపాఖ్యానమునందెల్ల యెడల తిక్కనగారిచాతుర్యమును జూపియున్నారు. వినత మత్సరగ్రస్తయై 'వేగిరపడి అనీతి నొకయండమువియ నడచి' నపుడు; అనూరుడు కలిగి 'మత్సరమున జాపలంబున నిట్లువియించితివని కోపించినాడు. అప్పుడు వినతను తిక్కనగారు వర్ణించిన విధముం జూడుడు,

"వెలవెల బాఱుచు, వడకుచు నలుకుచు తన
మోముజూడు నయ్యంగన, ప
ప్పలుగు కృపజూచి.

వినత నెంత శోకభరార్తగా తిక్కనగారు వర్ణించెనో గమనింపుడు. తన మాత్సర్యము వెల్లడియైనందుకు వెలవెలబాఱుట, శాపభయముచే వడకుట కుమారుని యవస్థకలుకుట, ఇత్యాద్యవస్థలను వర్ణించి ఒకానొక శోకపరిదీనమూర్తిని మనకనుల ఎదుట నిలుపుచున్నాడు కవిబ్రహ్మ.

కొన్ని పదముల నొక సందర్భమున నుపయోగించి, ఆపదములచే అపూర్వమైన అర్థమును ధ్వనింపచేయు నేర్పు తిక్కనగారికి కలదు. కద్రువ వినతలు పందెము సలిచికొనునపుడు కద్రువ పెట్టినపన్నిదమునకు వినత యంగీకరించు సందర్భమున తిక్కనగారి పద్యమిది:

"ఆ పొలతి యట్లు వల్కిన, శాపము ప్రేరేప
నరుణజననికి నుత్సాహోపేతమయ్యె జిత్తం బా ప
న్నిదమునకు"

ఇందు 'అరుణజనని' యనుపదము ఎట్టి యర్థమును స్ఫురింపజేయుచున్నదో చూడుడు! ఆమె చాపల్యము, వేగిరపాటు, అమాయిక హృదయము స్ఫురించుచున్నవి. కద్రువకు దాస్యము సేయకతప్పదనియు వ్యంగ్యము. పందెము తానే గెలిచెద ననుకొనుచున్న వినత కీవిశేషణము నుపయోగించి తిక్కనగారు చక్కని నాటకీయ వ్యంగ్యమర్యాదను పోషించిరి. అట్లే కద్రువ కుమారుల రావించి వారితో సవతుల పందెపు వృత్తాంతము జెప్పునపుడు "అవ్వధూటి కేవలధవళంబునావిని యొడ్డారమునకు నేనదె నల్లదనము గంటె వెనుకదెస నన్నవాదయ్యె" ననును. ఇందు తాను తోకయందు నలుపున్నదనుట ఒడ్డారమునకే ననుచున్నది. 'నవ్వులాటకు తానేదో యనగా వినత దానిని పట్టుకొని సాగదీసినదనియు, నలుపనుటలో తన యుద్దేశము నవ్వులాటయే గాని మరి యితరము గాదనియు, వాదమగుటకు వినతయే కారణమనియు భావము, 'ఒడ్డారమునకు' 'వాదయ్యె' అను పదములచే నభివ్యంగ్యమగుచున్నది. వినతను పేర్కొనకయే 'వాదయ్యె' ననుట ఎంతగడుసరి తనమో యూహింపుడు? ఈమాటవలన నామెకు వినతపైగల తృణీకార భావముగూడ గోచరించుచున్నది. పదములను ఇట్లు

తూచి వాడు నేర్పు 'ఉభయకావ్యప్రౌఢి పాటించు శిల్పమునఁ బారగు' డైనవవానికే చెల్లినది.

గరుడుని పాత్రను చిత్రించుటలో తిక్కనగారొక చమత్కారమును చేసిరి. వినత సవతాలికి దాసియై సేవజేయుచు కాలముగడుపుచుండగా మహాబలశాలియగు గరుత్మంతు డెట్లూరకొనెను? తెలియదని చెప్పుకొనవలెను తెలియకుండుటకు చిన్నతనము కారణము గావచ్చును. కాని తిక్కనగారు చేసిన ఈ చమత్కారమువలన గరుడుని పాత్ర, కొక విలక్షణత ఏర్పడుటయే గాక వాస్తవికత గూడ చక్కగా కుదిరినది. గరుత్మంతుని వర్ణించుచు తిక్కనగారు:

'ఘనతర కంధరుండు దృఢ
కాయుడు దీప్తముఖుండు రక్తలో
చనుడు, మహోత్తమాంగకుడు
చారుసుసంగత పక్షసారమం
డనుడు, పరిస్ఫురద్ద్యుతివి
డంబిత బాలదివాకరుండు, లో
కనయన పర్వనిర్వహణ
కారి సుపర్ణుడుపుట్టె భూవరా!'

అను పద్యమును వ్రాసిరి. ఇట్టి వాడు తల్లి దాసియై యున్నదని ఎఱిగియున్న పక్షమున నూరకొనునా? పోనీ తల్లి దాసియైన పిదపనే గరుడుడు జనించెనను కొందమన్న, దాసియైన వినతి యండమును కద్రువ, మాయోపాయమున హరించెడిదే. అట్లు చేయనీయకుండ కాపాడుకొనగల నేర్పు, కపటము, గూఢభావము వినతకు లేవని తిక్కనగారు మొదలనే చెప్పినారు. మరి ఎట్లు? అందుచేతనే గరుడుడు వినతి దాసియగుటకు ముందే పుట్టినట్లు వ్రాసినారు. ఇప్పుడింకొక పెద్ద చిక్కు తటస్థించినది. తల్లి దాసియగుటకు ముందే గరుడుడు జనించియుండిన పక్షమున తల్లిని దాసివేల గానిచ్చును? తానైన దాసుడై ఆమెను విడిపించియుండును. దీనిని సమర్థించుటకే తిక్కనగారీ చెప్పబోవు చమత్కారమును జేసిరి. ఆచమత్కార మీక్రింది పద్యమున నున్నది.

'జననింబాసి చరించునష్టతన యి
చ్చం బక్షినాథుండునుం
జని, ద్మోద్భవ కల్పితంబు లగు భో
ంబుల్ శరీరంబు వ
ర్ధన మొందింపగ సిద్ధ సాధ్యగణముల్
దన్ముద్దు సేయంగ గ్రీ
డన లోలత్వమునంజరించు పరితు
ష్టస్వాంతుడై యెల్లెడన్.'

గరుత్మంతుడు కశ్యపుని కుమారుడు. కశ్యపుడు బ్రహ్మకొడుకు కాబట్టి బ్రహ్మకు గరుడుడు మనుమడగును. మనుమనిపై తాతకు ముద్దు కలుగుట సహజము గదా! అందుచేతనే గరుడుడు 'లోకనయన పర్వ నిర్వహణకారి' యని ముందే చెప్పినాడు, లోకులందరకు నేత్ర పర్వముగానున్న మనుమని జూచి తాతగారగు బ్రహ్మ ముద్దుసేయగా సిద్ధసాధ్యులందరును ముద్దు జేసిరి. లోకములో పెద్ద వాడెవడైన తన కుమారునో, మనుమనో ముద్దాడుచున్నచో నాయనతో పనియుండి వచ్చిన వారును నిజముగా నాపాప తమ కింపుగొలుపుచున్నను లేకున్నను మర్యాదకైన ముద్దాడుచుందురు. అట్లే బ్రహ్మయే మనుమనికి భోజ్యములు కల్పింపగా ఆయన అనుచరులు గరుడునెంత మన్నించియుందురు? ఇట్లు బ్రహ్మ, సిద్ధ సాధ్యులు ముద్దుసేయగా గరుడునకు తల్లివద్ద నుండుటకంటె తాతగారివద్ద నుండుటయే ప్రియమగుచు వచ్చినది. తలిదండ్రులను సైతము విడిచి తాతలకడనుండు బాలకులను మన మెందఱనో ఎఱుగుదుము. అందుచే గరుడుడు క్రీడాలోలుడై, దేశసంచారియై ఇంటిగొడవ బట్టక తిరుగుచున్నాడు. తిక్కనగారీ విషయమునంతను ఊహాబలమున నిర్మించిరి. ఈ పద్యము వ్రాసిన పిదపనే కద్రూవినతల వనవిహారము, పన్నిదము వృత్తాంతము వ్రాయబడినవి. గరుడుడు తల్లి దాస్య వృత్తాంతము నెఱుంగమికి కారణము తిక్కనగారెంత చమత్కారముగ కూర్చిరి? గరుడుడు చిన్నతనమునుండియు తాతగారియొద్ద నుండుచు తల్లి విషయమునంతగా పట్టించుకొనలేదు. ఇది వాస్తవికతకు దగ్గరగాను మనోహరముగను ఊహింపబడినది.

ఇట్లనుటవలన గరుడుని పాత్ర కొక విలక్షణత ఏర్పడినది. గరుడుడు లోకనయన పర్వనిర్వహణకారియగుట కద్రువకు మఱింత మాత్సర్యమును వృద్ధి పొందించి యుండును. అంతియేగాక బ్రహ్మవలన నట్టి ముద్దు లభించుటచే దేవతలందరును గరుడుని సంభావించియుందురు. ముందురాబోవు అమృతా

పహరణమునకిది బలకరము. చిన్నతనమునుండి దేవతల కడ బెరిగి, దేవతా భోజ్యము లారగించినవాడే అమృతము కొఱకై దేవతానాథునితో పోరి గెలువగలిగెను. అంతేగాక గరుడుడు వినతా దాస్యకాలమునకే యువకుడై యుండుటచే, అనూరుడు చెప్పిన ప్రకారముగా వీనివలన తన దాస్యము నివృత్తియగునని వినత నమ్మియుండెను. దాస్యకాలమునకు ముందే గరుడోదయమగుట ఇచ్చట నుపకరించినది. అందుచేతనే తిక్కనగారు, వినత "రెండవ యండంబున జనించిన తనూజునిం దలంచుచు నాసపాటు గదిరిన హృదయంబుతో దాస్యంబనాలస్యంబు ననుపుచుండె" నని చెప్పినారు. ఇట్లు గరుడుడు వినతా దాస్యకాలమునకు ముందే జనించెననియు, పుట్టిన దాది గరుడుడు తాతగారివద్దనే చనవుగనుండి క్రీడాలోలుడై చరించుచుండెననియు చెప్పి తిక్కనగారు చమత్కారముగ ననేక ప్రయోజనములను సాధించినవారైనారు. అంతేగాక గరుడుడు తల్లి కష్టమును ఎట్లుపేక్షించెనను ప్రశ్న లేకుండ బోయినది. గరుడుడా విషయమెరుంగడు. దానికతడేమి చేయును? గరుడుని పాత్రకీ చమత్కారమువలన నొక వింత సొగసు సదిరినది. తల్లి యిట్లు దాస్యము నెఱపుచున్నది. గరుడుడు తానీ విషయమునే పట్టించుకొనక 'పరితుష్టస్వాంతుడై' సంచరించుచున్నాడు. ఇట్లుండ కొంతకాలమునకు :

యౌవన దర్పమంది జవ
మంతకునంతకు నగ్గలింప మై
లావధికంబు గాగ, నుప
లాలన సేయగ బద్మసంభవుం
డా విహాగోత్తముండు హృద
యంబున గర్వమెలర్ప నుద్ధతుం
డై విహరింపజూచి యొక
యప్పుడు నారదు డల్ల జేరియున్.

సంపూర్ణ యౌవనము వచ్చినది. బలమంతకంతకు పెరుగుచున్నది. దానితోపాటు తాతగారి యుపలాలనము బెరుగుచున్నది. ఇవి కారణములుగా గర్వ మెలర్పుటచే ఉద్ధతుడై విహరించుచున్నాడు. ఇది జూచి నారదు డల్ల జేరినాడు. కర్తవ్యబోధ కావలసిన యావశ్యకత ఏర్పడినది. నారదుడు పోటుమాటలతో :

దాసియై సవతాలికి తల్లి పనులు
సేసి నలగంగ, నద్దెస చింతవంత
లేక నీవిట్లు దిరుగుట లెస్సయగునె
అద్భుతోజ్జ్వలతేజ! కశ్యప తనూజ!

యని పలికించినాడు. తిక్కనగారి ఔచిత్యము గమనింపుడు! 'దాసియై' యని యారంభించి వినత దాస్యమే ప్రథమ విచారహేతువుగ చెప్పుచున్నాడు. సవతాలికి, తల్లి దాసియై పనులు చేసి నలుగుచున్నది. ఆప్రక్క నీ వామె యట్లకష్టపడుచుండగా నీవిట్లు తిరుగుట పాడియా?" యని పలికించి నారదుడు కొంటెగా 'అద్భుతోజ్జ్వలతేజ! కశ్యప తనూజ' యని సంబోధించినాడు. ఇంతటి తేజస్కుడవై యుండి, మహానుభావుడైన కశ్యపుని కుమారుడవై యుండి యిట్లు తల్లి కష్టములపాలు కాగా ఉపేక్షింపదగునా యని ఆ సంబోధన భావము.

నారదు డెల్ల సంగతులను చెప్పినాడు. గరుడుడు వాయువేగమున జని 'మాట యెద్దియుం జెప్పక తల్లికి విషాదభరార్తమూర్తియై ప్రణుతి చేసినాడు.' ఈ విషాదభరార్తమూర్తి యగుట తన్ను క్షమింపుమని గావలయు. కన్నతల్లి కష్టముల నిన్నాళ్లు గమనింపకున్నందుకు గావలయు. ఇంక నచట నాగలేదు గరుడుడు. వెంటనే కద్రువపాలికిం బోయినాడు. తల్లి కష్టములసంగతి చెవిని బడినచో సహించునా? అందుచేతనే తిక్కనగారు బ్రహ్మదేవుని చక్కగా వినియోగించుకొని గరుడుని శీలమునకు వన్నె దిద్దినారు. ఇంక గరుడుడు కద్రువతో నన్నమాటల తీరు గమనింపుడు. నీకును నేను బుత్రుడనె, స్నేహముతో "నన్ను జూచితివైన కృపసేత పెద్దయును లెస్స" యనెను. తనతల్లిని దాసిగా చేసికొన్నది తన్ను జూచి ఎట్లు కృపసేయును? 'నీ చెలియల్ చరించు నీ వరపుడపుం జరిత్రమున వచ్చునె నీకొక పేర్మి?' యని ముందే చెప్పినాడు. ఆవిధముగా కరుణించితివైనను సరే. లేకున్నచో అనుపమ బలదర్ప సమన్వితుడను సుమా! నేనుపేక్షింపను. నీకును పుత్రుడనైపోతిని. లేకున్నచో నేమయ్యెడిదో యను ధ్వని కలుగుచున్నది. ఇది దైవకృత్యమనియు చెప్పినాడు. అనగా తనతల్లికి దాస్యము కద్రువ రమ్మనుటచే వచ్చినది కాదు; ఉండకున్నచో నుండెడిదిగాదని భావము. విధుపు కలిగినచో తాను మనంబున పొందునట! తన పొందెవరికి గావలయును? ఈ మాటల తీరు గర్వమును ఉద్ధతిని ప్రకటించుచున్నవి. ఈ మాటలకు కద్రువ

ముఖము "ముఱకటించు" కొన్నదట! గరుడుని వ్యంగ్య మామె గ్రహించినది గనుకనే "బలవంతుం డవు, నెర్పు చందముల జెప్పంజాలి ఈ రితిపల్కుల దేర్పం పనిలే" దన్నది. ఈతని బలగర్వమునకు తగిన శాస్తి జేయవలెననియే 'లోకులు నిన్నుం బ్రణుతింప తెమ్మమృతము' అని చెప్పెనది. "నీ వింతవరకు లోక నయన పర్వనిర్వహణకారివి మాత్రమే. ఈపని చేసి నచో లోకులు నిన్ను బ్రణుతింతురు కూడను. అమృతము లేవోయి పోయి" అని ఈసడించినది. అమృతము దెచ్చుట సామాన్య కార్యముగాదు. అమృతము తెమ్మనుటలోని కద్రువ తెలివి, తరువాత కశ్యపుడు గరుత్మంతునితో —

అమృతంబు దుర్లభం బ
య్యమరుల కేనియు నతిప్రయత్నంబున, గు
ప్తము సేసియుండు వాసవు
డమల చరిత నీకు నగునె నట్టిది దేరన్.

అన్నపుడు స్పష్టపడును. కాని యౌవనదర్ప మతిశయించియున్న గరుడుడు సాధ్యాసాధ్యముల నాలోచింపక ఉత్సాహమున 'సరే' యన్నాడు. వీర రస మిచట రూపొందినది. తండ్రితో గూడ గరుడుడు "అల్లననగుచు నీవు పుత్రస్నేహోత్సుకుండవయి పలికితే బలియుండ, సుపాయజ్ఞుడను మహోజ్జ్వల తేజా" యని పలికినాడు. తండ్రి నట్లు సంబోధించుటలో 'ఆత్మావై పుత్రనామాసి' యనునుడి జొప్పున తాను నట్టివాడేయగును గదా! లోకులు ప్రణుతింతురని కద్రువ పటకారముగానన్నది గాని భవితమున గరుడునిపట్ల నది నిజమేయైనది. తిక్కనగారి రచనా కౌశల మిట్టిది.

ఇప్పుడు గరుడుడు వీరరసాలంబనమైనాడు. ఉత్సాహము దీప్తి పొందినది. ఆహారము గజకచ్ఛపము లగునని ఎఱింగి తండ్రిని వీడ్కొని 'ఉత్సాహము కందళింపగ వియద్వీథీగతుండై విమాన నికాయంబులు దూల పక్షతి వితాన స్ఫారదీప్తివ్రజం బిన రశ్మి ప్రకరంబు గీప్పరుప' నా గజకచ్ఛపములున్న ఎడకుం జనినాడు. అవి రెంటను పోరుచున్నతరి గరుడుడు వానిపై వ్రాలి "కచ్ఛపమున్ వలకాల, వామ పాదమ్మున వారణమ్మును నుదిమ్మున బట్టె తెగిల్చె గోళ్లన్." ఇట్లు వానిని గోళ్లనొత్తి 'మేఘ యుగళసకోల్లస శైరికాచల ప్రహాయసకేలి గో యన నభస్సంచారి'యైనాడు. దీనగరుడుని యుత్సాహము క్రియారూపము నందెనది. తిక్కనగారి గజ కచ్ఛప సంహారమును రాబోవు అమృతాపహరణమునకు నాందిగా వాడుకొన్నారు. గరుడుని యుద్ధ చాతుర్యము, బలపరాక్రమములు స్పష్టముగా నిచటనే జూపినారు. గోళ్లం దగిల్చి ఏనుగును, తాబేలును ఆకాశవీథియందు సంచరించెనన నెట్టి బలవంతుడై యుండవలయును? అట్టివానికి, బ్రహ్మ మనుమనికి అమృతాహరణ మెుక్క లెక్క యను భావము పాఠకునకిచటనే కలుగుచున్నది. తరువాత వృక్షశాఖా వృత్తాంతము వచ్చును. విరిగిన ఆ శాఖను అవని బడనీక ముంచుపున బట్టినాడు. తాబేలు, ఏనుగులను రెండుకాళ్లతోను, పంచయోజన విస్తీర్ణమగు వృక్షశాఖను ముక్కుతోనుపట్టి గరుడుడు పయనించుచున్నాడు. ఆ శాఖయందున్న మహర్షులు కరుణించి దానిని విడచిపోయినారు. అప్పుడు గరుడు డేమి చేయవలెను? ఆ శాఖ నెచట విడువవలెను? దీని నితరులనడుగుట ఎట్లు? ముక్కుతో కొమ్మను పట్టినాడు. 'విపులశాఖ నిచట విడిచిన నిచ్చటి జంతుకులము లెల్ల నచ్చునింక నేమి సేయువాడ నేనను నెవ్వగ పుట్టె నవ్విహంగపుంగవునకు' అని తిక్కనగారు వ్రాసినారు లోపల నెవ్వగ కలిగినదిగాని పరుల నడుగుటకు వీలులేదు భూతములపై గరుడునకుగల దయ దీన స్పష్టపడినది. అంత బలపరాక్రమములు అంత కరుణగల నాయకుడు ధీరోదాత్తుడే గదా! 'అవికత్థనః క్షమావా నతిగంభీరో మహాసత్త్వః। స్థేయాన్నిగూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః' అని కదా ధీరోదాత్తుని లక్షణము. ఆత్మశ్లాఘ లేనివాడనుట సుస్పష్టమే. క్లేశసహిష్ణు వగుటయు మన మెరుంగుదుము. మహాసత్త్వుడగుట సువిదితముగదా! గూఢమానము గలవాడనుట కథ చివర గాని తెలియదు. తన తల్లిని దాసిగా జేసికొన్నందుకు కద్రువపై గరుడునకు మిక్కిలి కోపమున్నది. కాని గంభీరుడగుట దానిని వెల్లడింపలేదు. అమృతము తెచ్చువఱకును కద్రువ మాటయే యెత్తడు. తన కింత కష్టమువచ్చిన దనుకొనడు. సవతిని శపింపడు. కద్రువ కుమారులం గాంచి ఈర్ష్య చెందడు. తిక్కనగారు పాత్ర నెట్లు తీర్చిదిద్దునో, ఎట్లు అలతి మాటలతో మహార్థముల స్ఫురింపజేయునో ఆశ్చర్యకరమగు విషయము.

అమృతము చుట్టును మండెడి యగ్నిం గాంచి దానిని 'దనికిన నెఱకలు గమురునో యనుచు తలపున' బ్రహ్మకడ కేగినాడు. ఇచట బ్రహ్మకడ కేగెననుట సమంజసమేగదా! ఆయనవలన నగ్ని నణచు సుపాయ

మెఱుంగికొనివచ్చి ఏ తత్ప్రకారంబున నగ్ని నుపశమింపజేసి, 'నీరుం పాయగజల్లి రాక్షసుల యున్మేషంబు మర్దించి హృత్సారోదారు డయోమయం బయిన యజ్ఞాలంబులే వ్రచ్చి దుర్వారస్వైర విహార మొప్ప నమృతగ్రాహం బొడంగూడుడుం దారావీధి' జనం దొడంగినాడు. ఈ సంగతి వెంటనే ఇంద్రునకు దెలిసినది. మరి ముందే గరుడున కమృతముండు ప్రదేశమెటు తెలిసినది? గరుడుడు చిన్నతనమునుండి తాతగారి కడనుండి దేవలోకవృత్తాంతమంతయు నెరింగినవాడు గనుక అమృత మెచట నుండునో తెలిసికొనియే యుండును.

తిక్కనగా రిచట యుద్ధమును వర్ణింపలేదు. గజకచ్ఛప సంహారముననే గరుడుని చాతుర్యము, బలసంపద వర్ణించుటచే నిచట ప్రత్యేకించి మరల చెప్పనక్కఱలేకపోయినది. ఒక్క వజ్రాయుధపు దెబ్బకేమైన వెఱచునేమో గాని పురి యితరమును లెక్కసేయడని గజకచ్ఛప సందర్భముననే మనకు తోచును. అందుచేతనే యింద్రుడు వజ్రాయుధము ప్రయోగించినట్లును, అదిగూడ గరుడు నేమియు చేయజాలక వెనుదిరిగి పోయినట్లును చెప్పబడినది. అంత నింద్రుడేమియూ చేయజాలక వెనుదిరిగి తన పట్టణమునకు పోయినాడు. ఇంద్రునీ దీనదశకు పాల్పడజేయుటలో గరుత్మంతుని పరాక్రమము పరకాష్ఠనందినది. "ఇంద్రజయమహోత్సవంబున సుపాత్త్రయశః పరిపూరితంబులై త్రిజగములున్ వెలుంగ" సుధారస పూర్ణభాండము గైకొన్నాడు. అమృతభాండమును 'తెచ్చి, డించి, కద్రువ ప్రీతిదేలజూపి తల్లి చెఱవాపికొని పొంగి'నాడు. కద్రువ 'తెమ్మమృతమున్' అన్నది. గరుడుడు తెచ్చినాడు. తెచ్చినదానిని కద్రువ కీయవలెనని లేదు. గనుక మరల పుచ్చికొని ఎడగలుగంగ బోయి నిలిచినాడు. గరుడుని గూఢ కోప మిచట ఈ పత్ప్రకటనము నందినది. ఆ సందర్భమున గరుడు డన్న మాట లివి :

"జననీ నీ వమృతంబు తెమ్మనిన యా
సత్యోక్తి వాటించియే
జని నానావిధ కర్మ కర్మఠుడనై
సాధించి వే తెచ్చితిన్
విను నా నీ యొడబాటు సెల్లె; జనులన్
విన్పించితిన్ తెల్లగా
వినతం దోడ్కొనిపోయెదన్, మనమునం
విభ్రాంతి లేకుండుమీ."

'జననీ' యని ఎత్తిపొడిచినాడు. "నీ వమృతము తెమ్మన్నావు. నేను సాధించి తెచ్చితిని. నీ వన్న మాటను పాటించి బహు ప్రయాసకోర్చి సాధించితిని గాని మరొకటిగాదు. నీకును, నాకును, అయిన యొడబాటు సెల్లినది. నీ వమృతమును తెమ్మన్నావు, నేను తెత్తునన్నాను. అట్లే తెచ్చినాను. ఇంక వినతను నేను తోడ్కొని పోవచ్చునుగదా!" అని చెప్పి మనములో విభ్రాంతి లేకుండుమాయని మరల చెప్పినాడు. 'మాటకారినైన నన్నే మాటతో ఓడింపనేయనిగాని, వీని కింతటి తెలివియా యని గాని ఆశ్చర్యపడవద్దు. ఇది నీవు చేసిన పనికి ప్రాయశ్చిత్తమే గాని మరేమియు గాదుసుమా' యని వ్యంగ్యము. అని యిట్లు ధర్మస్థితితో మాట నెరవేపారగా పల్కినాడని తిక్కనగారు చెప్పినారు. అన్నమాట నిలువబెట్టుకొనుటకై దేవతలతో యుద్ధము సైతము చేసి శ్రమపడి సాధించుట ధర్మస్థితి. మరల నా యమృతము కద్రువకు దక్కనీయక దేవలోకమునకే జేర్చుట నేర్పు. ఈ రెండును గరుడునియందు గలవు. గరుడుడు ధర్మాత్ముడే కాదు. నేర్పరి. ఉపాయజ్ఞుడు. ఈ నేర్పరితనము తాతగారి సాంగత్యమున నలవడియుండును ధర్మముతోడి నేర్పుకలిసినశీలముగల పాత్రను భావించుట ఆయాగుణములకు విరోధము లేకుండునట్లుగ చిత్రించుట — వీని కెట్టి నేర్పు కావలయును? 'సాత్యవతేయ సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతోడ మహా కవిత్వ దీక్షావిధి నొంది'నవానికి దప్ప మరియొకని కా శక్తి కలుగునా? సహజ వైరుధ్యము గలుగు రెండు గుణములను సమన్వయపరచి చిత్రించుటలో తిక్కనగా రందెవేసినచెయి. ధర్మాత్ముడు నేర్పరి కాకపోవచ్చును. కాకుండుటయే బహుళము. నేర్పరి ధార్మికుడు కాడు. రెండును ఒక్కచో కుదిరినట్లు చిత్రించుట అనన్యసాధ్యమగు పనితనము.

ఇంద్రునితో గరుడునకు కలిగిన మైత్రిని చక్కగా ప్రవేశపెట్టినాడు కవి. అది యుద్ధరంగమున నైనదిగాదు. అమృతమును హరించుకొనిపోయెగదా యను దుఃఖముతో నున్న వాసవునకు; అమృతమెప్పుడు తీసికొనిపోయి తల్లి చెఱబాపుదునా యని ఆతురపడుచున్న గరుడునకు మైత్రి కలుగుట ఎట్లు? పోనీ గరుడుడు అమృతము గొనిపోవునపుడు 'నేను మరల దీనిని నీకే యిత్తునులే, భయపడకు' మనియైన చెప్పినవాడు కాడు. అట్లు చెప్పినచో నింద్రుడు యుద్ధమక్కఱలేకయే అమృతభాండమును తెచ్చియీయకపోవునా? కాని గరుడుని గొప్పతన మది

గాదు. సవతితల్లితోనైన యొడబాటు పాటించుటకై వజ్రాయుధమును సైతము నిర్జించి యనన్యసాధారణంబగు పరాక్రమమున దేవతానీకముల పారద్రోలి యమృతమును దెచ్చెనను కీర్తియట్లయిన కలుగునా? అంతేగాక సవతితల్లికోరిక దీర్పలేక కుట్ర పన్నినట్లుండును. అపుడు ధర్మస్థితికి లోపమగును. ఇపుడట్లుగాదు. కావలయునన్నచో అమృతభాండమును కద్రువ కీయగలిగిన శక్తి గరుడునకున్నది. కాని, 'కొడుకుల బంచి తెల్పెనగు గుఱ్ఱము వాలమునందు నల్లగనగు క్రియ దీర్చి పన్నిదము గెల్చిన కద్రువ'ను మాటపై నోడింపవలెననియు, తన్మూలమున కద్రువ తానుచేసిన తప్పును గుర్తించి పశ్చాత్తాపపడవలెననియు నాతడు తలచినాడు. "వినతయగు వినతను, తెలివితేటలు జూపి నీవోడించితివి, నీకంటె తెలివిగల వాడను నిన్నోడించితిని. తాడిదన్నువాని తలదన్నువాడు లోకములో నెప్పుడునుండును సుమా! మాటలమారితనముతో ధర్మమును జయింపగలవా?" యని యీమెకు పాఠము బోధింపదలచినాడు అట్టి గరుడుని యౌచిత్యంబును, కవి యౌచిత్యమును సంస్తుత్యములు గదా! అప్పుడు అమృతభాండమును గొంపోయి యింద్రున కిచ్చినాడు. దేవలోకమున నుండదగిన యమృతభాండము భూమిపైనున్న ధర్మక్షీణత్వము కలుగును గదా! ధర్మస్థితిని నిలుప గోరినవాడు గనుకనే మరల దానిని యథాస్థానమున నుంచినాడు. ఈతని యిట్టి ధర్మదీక్షను జూచి యింద్రుడు విస్మితుడై స్నేహితుడగుట సముచితము. గరుడుని తత్త్వమును కనిపట్టినవాడు గనుకనే దేవతలెల్లరు తన్ను గరుడునకేమైన వరంబిమ్మన్నపుడు 'మన వరంబునకు నాసపడియెడి కొలంది వాడుకా' డని సమాధానము చెప్పినాడు. ఆహా! అంత పరాక్రమము, అంతధర్మనిరూఢబుద్ధి, అంత నిగూఢ కోపము, అంతదయ, కలిగిన పాత్రగా గరుడుని చిత్రించిన తిక్కనగారు మహాశిల్పి గదా! నిరాధారమైన యాకాసముపై గారడి మణి సౌధముల నిర్మించినట్లుగా సోమయాజిగారు మామూలు కథలలోని పాత్రలనే బహుభావసమన్వితములుగ సృష్టించును. వానిని సజీవములు గావించును! మన కండ్ల ఎదుర నిలుపును? శ్రీనాథాదులుగూడ నిందుచేతనే గాబోలు 'అక్కాంచిన గర్భతుల్యున కఖండితభక్తి నమస్కరింపవలసినవా' రైనారు! అమృతము వారల కప్పగించి, వారి ప్రశంసలను గాని బహుమానములను గాని ఆశింపక, కేవలము ధర్మమునందే ఆరూఢమైన బుద్ధికలవాడై గరుడుడు 'తల్లి దాస్యంబు తన బాస తప్పకుండ బాపి యాసుధ మరల యప్పాకశాసనునకు దయనిచ్చి' మగిడిసనియెనట! యిట్లు "పాకశాసనుని" గూడ దయజూడదగిన మహాబలపరాక్రమాది గుణగణాశోభితుండైన గరుడుడు ఆత్మశ్లాఘనమును గాని గర్వమును గాని పొందక ఉదాత్తుడైనాడు. ధీరోదాత్తతనిట్లు ప్రత్యక్షముగ కన్పట్టజేసిన తిక్కనగారు మహాశిల్పి! "అల్పాక్షరముల ననల్పాగరచన" చేయుట, 'రసాభ్యుచిత బంధముగ' పలుకుట, స్వయం సమగ్రములుగ కథలను తీర్చి దిద్దుట—వీనికి తిక్కనగారే శక్తిగలవారు. గరుడునిలో నాయకునకు కావలసిన కులీనత—మహాభాగ్యము—ఉజ్జ్వలత—ఔదార్యము—మహా విశాలత—ధార్మికత్వము—వైదగ్ధ్యము—ఈలక్షణముల నెంత చక్కగ నుదిరించెనో! 'లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ప్రయత్న ఉత్సాహః' అని చెప్పబడిన ఉత్సాహ లక్షణమును గరుడుని యందెంత సహజముగా వర్ణించెను? 'శిలాద్యలంఘనం నామ ధైర్యమిత్యభిధీయతే' యని చెప్పబడిన ధైర్యమును గరుడునియందెంత చిత్రముగ రూపించెను? ఒక్క గరుడపాత్రమును చిత్రించుటలోనే తిక్కనగారు శ్రద్ధవహింపలేదు. కద్రువ, వినతలపాత్రలను గూడ నీయన చక్కగ పోషించెను. వినతి స్వభావమామె పేరునందే ఉన్నది. వినత శబ్దమునకు ఎదురింపలేనిది అనిగాని లొంగిపోవునది అనిగాని అర్థము చెప్పవచ్చును. ఎవరెన దబాయించినచో సమాధానము చెప్పజాలనిది. అట్టిదిగావుననే కద్రువ వేవురను వేడుకొనగా వినత యిద్దఱనే సుతులను వేడుకొన్నది. వేగిరపాటు, చాపల్యము వినతియందున్న లోపములు. ఈలోపములవలననే ఆమె సవతికి దాస్యముచేయవలసివచ్చుట. భావములను లోపల దాచుకొనజాలని బేల. కద్రువ యిట్లుగాదు. ఆమె మాత్సర్యాది గుణములను కన్పడనీయదు గంభీరురాలు కపటవర్తనము నందారితేరినది. వీరిరువురను తిక్కనగారిట్లే కథయందంతట వర్ణించినారు. సవతియైన కద్రువనుగని 'వగపును మత్సరంబు గదిరెడుమదితో వినత కడున్ వేగిరపడి అనీతి నొక యండమువియ నడచి'నది. మత్సరముతో తొందరపడి యిట్లుచేసినదే గాని దానివలని కలుగు ఫలితము లెట్లుండునో యూహించుకొన్నది గాదు. ఆయండము నుండి "పులుగొక్కడు పూర్వాంగము గలిగి" జనించినది. వినత 'కన్నుల నశ్రుజలంబులు పెల్లొలుకగ శోకమున మునుగు నుల్లముతో' నెవ్వఅపడినది. తిక్కనగారామె తెలివితక్కువదనము నెట్లు చెప్పినారో గమనింపుడు? అనూరుడు కలిగినాడు. "మహాబలస్ఫురణము కలిగి ఇరువురము పుట్టవలసిన

వారము ఇరువురము ఏమో చేయవలసినవారము. అట్లు కానీయక సవతిపై మాత్సర్యముతో నిట్లు చేసినావు గనుక తత్ఫలముగా ఆ సవతికే దాసివిక" మ్మని శపించినాడు. అప్పుడు వినత 'నాయనా నన్ను శపింతువటరా' యనలేదు. వలవలబోలుచు, వడకుచు, అలుకుచు, అనూరుని మోము జూచుచున్నది. ఎంత జాల! ఎంత అమాయకురాలు తిక్కనగారిచ్చటనే యామె శీలమును మనకు సాంతము చెప్పివైచినారు. అపాయములను గుర్తించి తప్పుకొనగలుగు తెలివితేటలను కలిగియుండెనని యూహించి వినతమ్మ ఎప్పుడో యొకప్పుడు కుటిలురాలైన సవతి పన్నాగములలో బడకమానదను భావము పాఠకునికిఁ గలుగునట్లుగా తిక్కనగారు రచించి రాబోవు విషాద వృత్తాంతమునకు పాఠకుని సిద్ధపఱచినారు. అనూరుడు శపించియు, తల్లి అమాయకత్వమును జూచి జాలిపడి 'తల్లీ అడలవల దిదివిధాతృవశమై' వచ్చెనన్నాడు. మరల నీయనునయ మేమి? అనూరుడు 'అప్పెనుపు పొందగనీయక' తల్లి యిట్లు చేసెనను 'నెవ్వగ' చే శపించినాడు. ఇట 'నెవ్వగ' శబ్ద ప్రయోగము గమనార్హము. అనూరుడు వగపువలననే శపించినాడు కనుకనే మరల తల్లి వగపును గ్రహించినాడు. వినతకు ఇప్పుడు రెండు కష్టములు కలిగినవి. ప్రథమ పుత్రుడు వికలాంగుడగుట మొదటిది పోనీ గదా యనుకొన్నను శాపము తగులుట రెండవది. అసలే అమాయిక ఆపై ఈయాపదలు! వినత నొక దైన్యోపహతయగు అమాయక స్త్రీగా తిక్కన గారు చిత్రించినారు. అనూరుడు తల్లికిఁ గలిగిన ఈ దురవస్థను గ్రహించి తమ్ముడు కలుగువఱకు వేచి యుండెపిదప సూర్యసారథిగా నేగినట్లు వర్ణించుట తిక్కనగారుచేసిన చమత్కారము. ఇట్టి చమత్కారముల మూలమున పాత్రలకు వైశిష్ట్యమును జేకూర్చుట తిక్కనగారి సామాన్యపద్ధతి.

ఇంతవఱకు కద్రువను గురించి, ఆమె వేయిమంది పుత్రులను కోరుకొనెనని దప్ప, తిక్కనగారు మరేమియు చెప్పలేదు. ఉచ్చైశ్శ్రవ దర్శన ఘట్టమున కద్రువ శీలము చక్కగా తెలుపఁబడినది. 'మనోజ్ఞ సితచ్ఛవి నుల్లసిల్లు సుందర తురగోత్తమంబు'ను వారు దవ్వుదవ్వుల గాంచిరి. వినతయే ముందుగా 'హయమింత యొప్పునె యనూన ధవళ ప్రభాఢ్యమై' యని తన యాశ్చర్యమును వెలువఱచినది. ఆమాట ముందు కద్రువయే యనరాదా! కద్రువ యనదు. ఆమె గంభీరురాలు. వినతమాట కెదురుచెప్పవలెనను కోరిక కద్రువకు కలిగినది. అవునన్నచో కాదనుటయు. అన్న మాటను గురించి పందెములవఱకు సాగదీయుటయు కద్రువ స్వభావగుణములు. అందుచేతనే తోకనీలముగానున్నదన్నది. కద్రువకు వినతను గురించి, చాల తెలివి తక్కువదని, వెఱ్ఱిదనియు, తృణీకార భావముండియుండును వినత అంతటితో పోనిచ్చినది కాదు. కద్రువను 'నవ్వులకాడితో, నిజంబునకునో? నీదు చూపులకు బోలినభంగిరయ్యి' చెప్పుమని ప్రశ్నించినది. అపుడు కద్రువ పరుస వక్రముతో ఇకేమి మాట? స్పష్టముగానట్లు నల్లదనము కన్పించుచుండగా నింతగా చెప్పవలసిన పనియే యున్నదని ఆయబద్ధమునే మరింత నెర్పుగా చెప్పినది. అబద్ధమాడుచున్నను రవంతయైన జంకుగొంకులు లేకపోవుటయుంచి చిఱునగవుతో జవాబుచెప్ప కద్రువ ఎట్టిదైయుండవలెను? వినత యూహారకొన్నది గాదు. తానే పొరబడితి నేమోయని మరల జూచినది. నూచి నల్లదనము లేదని నొక్కి చెప్పినది. వినత ముందు పొరపాటు నొప్పుకొనుట కద్రువకు చిన్నతనమనిపించి యుండునేమో, దీనికి సమాధానముగా 'వట్టిమాటలేల? పందెమేమి' యని 'దబాయించి'నది. అట్లన్నయైన నూరకుండునేమో యని. వినత కద్రువ ఏవో నవ్వులాటలకే యనుచున్నదనుకొన్నదేమో నీవే పందెము నిర్ణయింపుము దానికి నేనొడబడుదునన్నది. ఈమాటతో కద్రువ భావమున తుపాను రేగినది. ఆమెకు అనూరుడు జనించుట అతడు చెప్పినమాటలు, గరుత్మంతుని జననము జ్ఞప్తికి వచ్చియుండును. గరుత్మంతుడు 'లోకనయన పర్వనిర్వాహకారి' బలవంతుడు. తన వేయిమంది కొడుకులు వాని ఒక్క గోరుకు పోలరు. ఈమాత్సర్యము కద్రువను చాల కాలమునుండి బాధించుచుండవలెను. అందుచేతనే వినత వచనంబున మూడ్కి నిలిపెంది. వినతను తన దాసిని చేసికొన్నచో నెట్లుండును? గరుడుడును తన దాసుడే యగును కదా? సుబ్బిపుతో కలుపుచేయుట యొక లెక్కలోనిది గాదు. అందువలన కద్రువ దాస్యమును పందెముగా బెట్టినది. ఓడినవారు గెలిచిన వారికి దాస్యము చేయుదునట్లు. వినత యప్పుడైనను 'ఈమాత్రము దానికింత పందెమెందుకు లెమ్ము దానితోక తెలుపైన మనకేమి నలుపైన మనకేమి' యన్నదా? లేదు. కారణము శాపము ప్రేరేచుటయు నామె అరుణజనని యగుటయు. అరుణజననము అనగానే వినత చాపల్యము తెలివితక్కువతనము మాత్సర్యము స్ఫురించును. అరుణజనని యగుటచేతనే కద్రువ మాయలో జిక్కినది. ఒప్పుకొన్నను 'పోయి యాగుఱ్ఱమును చూచి వత్తము రా' మ్మనలేదు. కద్రువ పతి పరిచర్యకు కాలమయ్యెనని

సాకు జెప్పి అప్పటికి మాపు దప్పించినది. పతిపరిచర్య యనుసరికి వినత ఎదురాడ వీలులేకపోయినది. కద్రువ ఎంత నేర్పరియో చూడుడు! అప్పటికే వినతను లొంగదీయుటెట్లాయని కద్రువ పన్నాగములు పన్నుచుండి యుండును. సమయము వచ్చినది.

కొడుకుల రావించి కద్రువ జరిగిన యుదంతమును నాలుగు మాటలలో చెప్పి, తప్పంతయు వినతదే ననుటను ధ్వనించి, 'ఓడిన దాస్యవృత్తివచ్చు, సవతికి నే నెట్లు వరవుడంబు సేయదగు, తోక నల్లగా జేయరయ్య' యని యాజ్ఞాపించినది. కద్రువ గడుసరితనమీ 'సేయదగు' నన్నమాటలో నున్నది. తాను దాస్యము సేయదగదట! అనగా వినత సేయుటకు తగినదని భావము కాదా! ఎంత యహంకారము? తిక్కనగారు 'తగు' నను రెండక్షరముల మాటలో కద్రువ స్వభావము నెంతలోతుగా సూచించుచున్నారో గ్రహింపుడు. అంతేగాక 'మీయట్టి కొడుకుల బడసిన నేనామెకు దాస్యవృత్తి సేయదగను. మీరుగూడ నాతోపాటు దాసులు కావలసివత్తురు. నాకోసము కాకున్నను మీకోసమైనను మీరు నే జెప్పిన పనిచేయవలయు' నని వ్యంగ్యము. దీనికి వాసుకి ప్రభృతు లంగీకరింపలేదు. కద్రువ దౌష్ట్యమిచట పరాకాష్ఠనందినది. కన్న కొడుకులను రాబోవు జనమేజయుని సర్పయాగ 'దహన భీకరభూరిశిఖాప్రవేశ సంజాతదురంతతాపమున జా' వుడని శపించినది. అట్టిదానికి సవతిపై జాలికలుగునా? తిక్కనగారిచట కద్రువను 'భుజంగి' యని పిలిచినారు. పాములను కన్నది గనుక కద్రువయు పామే. కొడుకులు శాపభీతులు, పోయి గుఱ్ఱపుతోకను నలుపు జేసిరి. అపుడు కద్రువ 'సంతోషద్రుతమతి' యగుచు పిలిచి సవతికి చూపినదట! తానై పిలుచుకొనిపోయినదట! కవిచాతుర్యము! వినత కనుమానము కలుగలేదు. ఇది యన్యాయమనలేదు; వినతయైనది. కద్రువ యామెను పరిచారికా కృత్యంబుల నిత్యము నలయించుచున్నది. వినతయు రెండవ కుమారుని తలచుకొని ఆశతో రోజులు గడపుచున్నది. కొడుకుతోనైన చెప్పుకొనలేదేమో! మంచిరోజులకొఱకు నిరీక్షించుచున్నదేమో! ఇంత అమాయిక హృదయ ఎచటనైన నుండునా?

కద్రువ పన్నాగము గరుడుని వలన విఫలమైనది. గరుత్మంతుని బలగర్వములను, అతడు పొందు జనాభిమానమును గాంచి కద్రువ యసూయాపరయైనది. కాబట్టియే అమృతము దెమ్మనుట. అమృతము తెచ్చుట అసాధ్యము. ఒకవేళ తెచ్చుటకు గరుడుడు యత్నించినను దేవతలతో యుద్ధముచేసి గెలువలేడు. ఒకవేళ గెలిచినను ఇంద్రుని వజ్రాయుధము దెబ్బతిని బ్రదుకలేడు' అని భావించియే కద్రువ అమృతము తెమ్మనుట. కద్రువ లోపమేమనగా వినత తనకు దాసియగుట తన ప్రజ్ఞవలననే గాని దైవమువలన కాదనుకొనుటయే. ఆమాటయే గరుడుడు 'దైవకృత్య'మని యామెకు మొదటనే జెప్పినాడు. మాట నేర్పుచే ఎంత పనినైన చేయగలనను అహంభావముతోనున్న కద్రువను గరుడుడు మాట నేర్పుచేతనే ఓడించినాడు. ఈరీతిని చివరకు అమాయకురాలగు వినతకు దాస్యవిమోచనమును కద్రువకు పరాభవమును జరిగినది. కద్రువ కింకను శిక్షకలిగెడిదే గాని గరుత్మంతుకు తల్లియని క్షమించినాడు. ఈ భావమునే యతడు గూఢముగా 'జననీ' యను సంబోధనమున ద్యోతింపజేసినాడు. ఈ జననీ యను మాటను వాడుటవలన 'తల్లివి గావున క్షమించుచున్నాను సుమా!' యనుభావము వ్యంగ్యమై చమత్కారకమైనది. గరుడోపాఖ్యానమున కద్రూవినతల పాత్రముల నిట్లు తిక్కనగారు చిత్రించినారు. మాటనేర్పు, కాపట్యము, గాంభీర్యము, మాత్సర్యము కలది కద్రువ. వినతకు గాంభీర్య మన్నదియే లేదు. లోన కలిగిన భావముల నణచుకొనలేని బేల. తాత్కాలికముగా కపటవర్తనమే జయించినను తుదకు ధర్మమే నిలిచినది. పరస్పర విరుద్ధభావములను, మూలమంటబోయి వర్ణించుటలో తిక్కనగారి దారి తేరిన చేయి. ఈశక్తివలననే ఆయన పాత్రలను సహజముగ సజీవముగ, సుందరముగ చిత్రింపగలడు. జరుగుచున్న కథయందు మనకును పాలు గలదనిపించును. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారన్నట్లు "ఇట్టి మహాపురుషుడు (తిక్కన) ఆంధ్రదేశమున మరియొకడు బయలుదేరలేదనుట అతిశయోక్తిగా నేరదు. ఆంధ్రవాఙ్మయమున నిట్టి మహనీయగుణ సంపన్నుడగు కవి మఱియొకడు లేడు" అనుట సాహసము గాదు. ఆంధ్రభాషాసతిని స్వస్వరూపముతో నిలిపి యుద్ధరించిన వారిలో నీతడగ్రగణ్యుడని చెప్పవలసి యున్నది. ఈతని మూలముననాంధ్ర వాఙ్మయము, ఆంధ్రభాష, ఆంధ్రదేశము, ఆంధ్రజనము — వేయేల, ఆంధ్రత్వమునదే ధన్యత్వమును బొందుచున్నది.

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాదకుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



మీ బట్టలను సన్‌లైట్‌తో ఉతికినచో మలినము ఎంత సులభముగా దొర్లిపోతుందో మీరే చూడండి. కొద్ది నిమిషములలో మీ తెల్లని బట్టలన్నియు ( రుమాలునుండి దుప్పట్లు వరకు) క్రొత్తవాటికంటె తెల్లగా నగును ! మరియు సన్‌లైట్‌తో ఉతుకుట వలన మీ బట్టలు చాలకాలము నిలబడును."



"దీనిని బాగా జ్ఞాపకముంచుకోనండి— సన్‌లైట్ సబ్బు రంగు బట్టలను తళతళమని మెరసేటంత ప్రకాశవంతముగా ఉతికేటట్లు మరేదియు ఉతుకదు. సన్‌లైట్ సబ్బునుండి త్వరగావచ్చు నురగ బట్టలను బాదకుండగనే వాటిలోని మలినమును తరిమివేసి వాటి అసలు రంగును తిరిగి తెచ్చుటను మీరే చూడండి."




S. 222-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది

కథానిక

# దాగిలిమూతలు

బుచ్చిబాబు

అదంతా అనుకోకుండా అకస్మాత్తుగా జరిగింది. మధ్యాహ్నం నిద్రనుండిలేచి, ఆవులిస్తూ వెళ్ళి గోడనున్న అద్దంలో ముఖం చూసుకున్నాడాయన. నుదుటిమీద సన్నటి గీతలు, నల్లవెంట్రుకల మధ్యలో తెల్లవి, కళ్ళకింద కాకిపాదం ఆకారంగీట్లు—నిజంగా కనబడినంత ముసలితనం, తనలో వుందా అని ఆశ్చర్యపడ్డాడు. ఉపాధ్యాయ వృత్తిలో వారు వృద్ధులుగా కనపడతారంటారు. ఆ వుదయమే రామదాసు మాస్టరీ వుద్యోగానికి రాజీనామా యిచ్చాడు. ఇందుకు వో విధంగా సంఘాన్ని మరమ్మత్తు చెయ్యాలన్న ఉబలాటమే కారణం. స్కూలు నిర్వాహకవర్గంవారు, పాఠశాల అభివృద్ధికై పోగుచేయబడ్డ విరాళాలను తమ స్వంతానికి వాడుకుంటున్నారన్న సంగతి బైట పెడతానని బెదిరించాడు. అందుకు సమాధానంగా నాస్తికత్వం, స్వేచ్ఛాప్రేమ బోధించి పిల్లల్ని పాడుచేస్తున్నాడన్న మిషపై యీయన్ని వుద్యోగం నుండి తొలిగించడానికి, నిర్వాహకవర్గంవారు [illegible]మ కట్టారు. ఈతని దగ్గర తన ఫిర్యాదు రుజువుచెయ్యగల బలమైన నిదర్శనాలేవీ లేవు. ఇదివరకే తన వింత భావాలపైనా అభిప్రాయాలపైనా వ్యాఖ్యానాలున్నాయి. ఇప్పుడు వెర్రివాడుగా చెప్పుకుంటున్నారు. ఏ కొద్దిమంది విద్యార్థులో తప్ప, తన వాదాన్ని బలపరిచేవారు లేరు. రామదాసుకి రాజీనామా యివ్వక తప్పిందికాదు. వయస్సు నలభైఎనిమిది కావొచ్చు కాని యింక స్కూలు మాష్టర్ని మాత్రం కాను, అమ్మయ్య, అనుకుంటూ అద్దంలో బింబాన్ని వెక్కిరించాడు.

గది మూలనున్న పాత కర్ర పెట్టె అద్దంలో కనిపించింది. వెళ్ళి ఆ పెట్టె తెరచి అందులో వొస్తువుల్ని పరిశీలించసాగాడు. వివాహమైన కొత్తలో తను కల్యాణికి వ్రాసిన వుత్తరాలు కొన్ని చూశాడు ఒకదాన్ని తీసి చదివాడు. ఆనాడతనిలోవున్న శృంగారచేష్టలు, రసికత్వం ఆశ్చర్యం కలుగచేశాయి. అదంతా వృథా, కల్యాణిలో ప్రేమోద్రేకం శూన్యం. తనకేమీ పట్టనట్లు, అక్కర్లేనట్లు, యితనివద్దనుండి ఏదో కొంత దాచినట్లు, వుండేది. నిప్పుకణంపై మంచుకణం పడినట్లు యితనిలో వుద్వేగం చప్పబడి మెల మెలగా అనుమానానికి దారితీసింది, ఆరుసంవత్సరాల దాంపత్య జీవితం అసూయతో నిండిపోయింది. ఆమె సంతానం కలగకపోవ[illegible], యితని చికాకుకి మరో కారణం. అతనిలో లోటు తెలుసుకోవాలంటే మరో పెళ్ళి చేసుకోవాలి. ఇద్దరి భార్యలతో కాపరం మాటలు కాదు. రామదాసు వయస్సు అప్పటికి ముప్పైరెండు. ఆ వీధిలోనే మరో అమ్మాయితో స్నేహం కుదిరింది. ఈ విషయం భార్యతో చెప్పేశాడు. ఆమె తగవులాడేది. ఆమెపై అతనికున్న అధికారానికి చిహ్నాలుగావుంటున్న యీ తగాదాలు అతనికి సంతోషాన్ని కలగచేసే అనాలి.

కొద్దినెలలో కల్యాణి న్యుమోనియా వ్యాధికి గురైంది. పరామర్శించడానికి వొచ్చిన బంధువుల్ని స్నేహితుల్ని చూసే రామదాసుకి మండిపొయ్యేది. వాళ్ళల్లో ఎవరో వొకరితో ఆమెకి చెలిమి ఏర్పడి వుండాలి. ఎవరో తెలుసుకోలేక పిచ్చెత్తినట్లుగా వుండేది. కొన్నిరోజుల్లో కల్యాణి చనిపోయింది. మళ్ళా పెళ్ళికి స్వతంత్రుడేకాని, ప్రేమించిన పిల్లకి మరొకరితో వివాహం జరిగి కాపరానికెళ్ళిపోయింది. ఇదంతా జరిగి పదిహేను సంవత్సరాలైంది. అతను మళ్ళా ప్రేమించడం జరగలేదు. వొంటరిగా [illegible] గడుపుతూ, విషాదంలో వొక వెర్రి ఆనందాన్ని అనుభవిస్తూంటాడు. అతని వైవాహిక జీవనం భగ్నమైంది గనక వివాహంలో విసుగుతప్ప మరేమీ లేదంటాడు.

మిగతా విషయాలపై అతని అభిప్రాయాలు, అనుభవాన్ని అనుసరించే వున్నాయి. దేశంలో జనాభాని పెంచడమే కాకుండా, సంతానం యాతనంటాడు. పురుషులంత దగాకోర్లు, స్త్రీలంతా చెడ్డవాళ్ళు. ఈవెర్రి విపరీత పరిణామం పొందకుండా ఉపాధ్యాయవృత్తిలో నిమగ్నుడై అంతర్యాన్ని దిగ

మింగ గలిగాడు. అపనమ్మకపు సిద్ధాంతాలు, అతని బోధలకి పదునిచ్చాయి.

ఉత్తరాలు పెట్టేసి, రామదాసు, ఫోటోగ్రాఫ్‌ల ఆల్బమ్ తీశాడు. అది ఎవరో యిచ్చిన పెండ్లి బహుమానం. పెళ్ళినాటి ఆ పటం చూస్తే అతనికి దిగులేస్తుంది. అప్పుడు సన్నగా నాజూకుగా వుండేవాడు, అతనే యితనంటే స్నేహితులు ఆశ్చర్యం ప్రకటించేవారు. గోడనుంటే చూసేవారు యిట్లాంటి వనడం, తను బాధపడటం జరుగుతుందని, దాన్ని లోపల పెట్టేశాడు. అతను, పదిహేనేళ్ల వయస్సులో తీసుకున్న మరో ఫోటో వుంది. అమాయకంగా కనపడే పెద్ద కళ్లు అవీ—విద్యార్థి దశలో ఫోటో అది. అమాయకత్వంతో వొచ్చే ప్రశాంతత అతని మనస్సులో లేకపోవడం చిత్రంగా తోస్తుంది. తనేదో పాపం చేశానన్న స్ఫురణ పదేపదే అతన్ని ఆవహిస్తుంది. అది చాలా స్వల్పవిషయం. కల్యాణి న్యుమోనియాతో మంచాన పడినప్పుడు, వైద్యుని రప్పించడంలో కొస్తంత ఆలస్యమైంది. జబ్బు అల్లా పరిణమిస్తుందని అతననుకోలేదు. ఆమెకూడా ఫరవాలేదంది. డాక్టరు యీ ప్రస్తాపన తేలేదు. ఆమె చనిపోయింది—అందు కతను బాధ్యుడన్న అనుమానం వొదలదు. గిట్టనివారు కొందరు భార్యపోవడం ఏర్పాటుగానే వుందన్నారు. ఈ అనుమానాన్నుండి పారిపోలేడు. ఆల్బమ్ మూసేసి, దానిపై ఏదేనా కప్పుదామని లోపల తిడుముతుంటే, నాటకం దుస్తులు బైటపడ్డాయి. చిన్ననాటి నాటకాల సరదాల్ని జ్ఞాపకం చేసే సరంజామ అదంతా. మస్లిన్‌లో కుట్టిన రాజు వేషం కోటు, మంత్రివేషం పాగా, మునివేషం కాషాయి జుబ్బా, గడ్డాలు—యివన్నీ మాసి, చినిగి అల్లాగే వుండిపోయాయి. పాఠశాల వార్షికోత్సవంనాడు పిల్లలు నిర్వహించే నాటకాలు అతను చూసేవాడు. అతనూ, అప్పుడప్పుడు వో వేషం ధరిస్తుండేవాడు—నారదుడు, అతని అభిమాన పాత్ర. రామదాసు తను గొప్ప నటుడైపోవాలనుకునేవాడు. నటుడికి కావల్సిన లక్షణాలతనిలో వున్నాయని నమ్మకం. అతని జీవితమంతా వొక నటనగా పరిణమించింది. ఆ నటనలో వుత్తీర్ణుడయ్యాడేమో కాని, రంగస్థలంపై కాలేదు ఎందుచేతనో. భార్యపోయిం తర్వాత, యోగిగా అవాలనుకునేవాడు. రైల్లో వోమారు 'యోగి' బృందంతో గోష్ఠిసలిపాడు. పరమాత్మని సందర్శించినప్పుడు కలిగే మహత్తర ఆనందం గురించి, వైరాగ్యంలోని ప్రశాంతతనిగూర్చి, హిమాలయాలలో తపస్సువల్ల పొందే వెలుగునిగూర్చి వారు ప్రస్తావిస్తుంటే, అతను బుద్ధుడు, రామకృష్ణ పరమహంసనీ స్మరించి, వూహించుకున్న సంతోషంలో మునిగేవాడు. రైలు నిలబడగానే, టిక్కెట్లులేకుండా ప్రయాణం చేసినందుకు, రైల్వే వుద్యోగి ఆ యోగిబృందాన్ని దింపి తీసుకుపోవడంతో అతని పగటికల కరిగిపోయింది.

అనుకోకుండానే, రామదాసు ఆ కాషాయ వస్త్రాన్ని ధరించాడు, మొహానికి గడ్డాలు తగిలించుకున్నాడు, సమాధిలో వున్నప్పుడు యోగి చేతికింద వుంచుకునే కర్రని తీసుకుని మరో గుడ్డ పాగాచుట్టి, అద్దంలో చూసుకున్నాడు. ఆ దుస్తులు బాగా అమిరాయి. కళ్లల్లో దీనత్వం, ముడిపడిన కనుబొమ్మలు, గంభీరంగా ముడుచుకున్న పెదవులు, తెల్లనెండ్రుకల లోని పరిపక్వత—అన్నివిధాలా యోగిలా వున్నాడు.

నిజంగా ఇది ఇతనికి తగ్గవేషం, నిజతత్వం కూడా యిదే. చటుక్కున రామదాసుకి వొక ఆలోచన తట్టింది. ఈ దుస్తులతో వీధులోకెళ్లి, సంఘాన్ని చూస్తే ఎల్లావుంటుందో...! అదొక అపూర్వమైన మానసికానుభవం. నిజమన్నట్లుగా గడియారం మూడుకొట్టింది. పనిమనిషితో తనింక ఆపూటకి రానక్కర్లేదని చెప్పాడు. ముందుగది లోపల గడియవేసి, దొడ్డివెంపు గదికి తాళంవేసి, వీధిలో అటూ యిటూ చూసి ఎవ్వరూ తనని చూళ్లేదని తేల్చుకుని, బైటకి నడిచాడు. నాలుగడుగులు ముందుకేసి ఇంటికేసి, అదే ఆఖరుసారి చూసినట్లుగా, పరకాయించి చూసి, తొందరగా నడవడం సాగించాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు. వీధమ్మట నడిచే వ్యక్తులకేసి చూస్తుంటే తనేదో దూరంగా ఎత్తుమీదనుండి చూస్తున్నట్లనిపించింది. పాకుతూ, మెల్లిగా ఈడ్చుకుంటూ కదిలిపోతున్న దౌర్భాగ్యపు మానవులు వారందరూ—ప్రతి వ్యక్తి మనోవ్యాధి మేఘంలో మరుగుపడ్డాడు. ఇంటికి తొందరగా నడుతున్న అతను బాంకు గుమాస్తా—ఇల్లు, మరో బాంకు, భార్యకి మంచం అవతల నిలబడి ఈ డబ్బు కాస్తా. దాఖలు చేసుకుంటాడు; ఆ కార్లో పై వుద్యోగం కోసం పన్నాగం పన్నుతున్న ప్రభుత్వోద్యోగి కోర్కె సిద్ధించినకొద్దీ వారి ఆశయాలు పెరిగి, చివరకి మేఘం బ్రద్దలై పొందిన ఫలితాల్ని ముంచెత్తివేస్తుంది.

రామదాసు పార్కుదగ్గరికి చేరుకున్నాడు. కొందరు పిల్లలాడుకుంటున్నారు, మరికొందరు వొస్తువులు అమ్ముకుంటున్నారు. ఇద్దరు సాధులుగంజాయి

పడుతున్నారు. వారి ఎదుట పడకుండా, చెర చెరా నడిచి కాలవగట్టుకి చేరుకున్నాడు. గట్టున గుడిసెలున్నాయి, ముసీడని స్త్రీలు బుట్టలల్లుతున్నారు. తొందరగా నడిచి ఏకాంతంగా వున్న చోటుకి చేరుకున్నాడు. ఎవరో అతని వెనక నడుస్తున్నట్లనిపించి తిరిగిచూశాడు. నడివయస్సులో వున్న వొక వ్యక్తి దీనంగా నమస్కరించి పలకరించాడు.

విచారంతో అతని ముఖం వాడినట్లుగా వుంది; భుజానవున్న తువ్వాలుతో కళ్ళల్లో తడిని తుడుచుకుంటున్నాడు. అతన్ని పలకరించాలేమో, రామదాసుకి చటుక్కున తట్టిందికాదు.

"ఎవరు నాయనా నువ్వు—దిగులుగా వున్నటున్నావు?"

"అవును స్వామీ—నన్ను మీ వెంట తీసుకుపొండి."

"ఎక్కడికి?"

"ఎక్కడికైనా సరే. మీరు హిమాలయాల్లో వుంటుంటారు."

కొంచెం నిదానించి, రామదాసు "అవును" అన్నాడు.

"మిమ్మల్ని ఏదీకోరను, ఎక్కడికో దూరంగా ప్రశాంతమైన నిర్జన స్థలానికి తీసుకు వెళ్లండి."

"కారణం?"

"నాకు జీవితమంటె విసుగెత్తిపోయింది."... రామదాసు కారుణ్యం సూచిస్తూ నవ్వాడు.

"జీవితమంటె యింత మోహం మొత్తడానికి నీకు జీవితం గురించి ఏంతెల్సు నాయనా?" అన్నాడు రామదాసు.

"సంసారం త్యజించి, ఇంట్లోంచి లేచిపోవాలనిపించేటంతగా జీవితంగురించి తెల్సు స్వామీ—నేను తిరిగి వెళ్లను. మీతో వచ్చేస్తాను." అన్నాడా వ్యక్తి. ఇతన్ని శిష్యుడుగా దేశపర్యటన దృశ్యం వూహించి గగుర్పాటు చెందాడు రామదాసు. సరియైన వాక్యంకోసం యోచిస్తుండగా, అవ్యక్తి, తన కుడిచేతిని పైకెత్తి చూపించాడు.

"హిమాలయాలనుండి వొచ్చిన స్వాములుమీరు -చెయ్యిచూసి, నా విషయం చెప్పండి"... అన్నాడు. రామదాసు చకితుడయ్యాడు. చెయ్యిచూసి చెప్పడం రాదంటె? అరచేతిని మృదువుగా వొత్తి "నీకు గొప్ప భవిష్యత్తు వుంది" అన్నాడు. అట్లాగంటె ప్రమాదంలేదు.

"లేదు స్వామీ—నాకు భవిష్యత్తు లేదు. దుర్భరమైన గతం మిగిలింది. సర్వమూ త్యజించి నేను మీతో వొచ్చేస్తాను." అని అవ్యక్తి గట్టుమీద దిగాలుపడి కూర్చుని, మొహాన్ని చేతుల్లో దాచుకున్నాడు. పక్కన కూర్చుని భుజాన్ని తట్టుతూ, రామదాసు అతన్ని వోదారుస్తున్నాడు.

"ఏమీ తెలియని పసివాడివి నాయనా నువ్వు" అన్నాడు. అతను తనవెంపు చూడనప్పుడు, మాటలు సులువుగా వొస్తున్నట్లు గ్రహించాడు.

"త్యజించవల్సిన వయస్సు నీకింకా లేదు. ఈ విషయాలనుగూర్చి అప్పుడే ఆలోచించకూడదు. ఇంటికివెళ్ళి, భార్య పిల్లల్ని చూసుకుంటూ, వారి ప్రేమానురాగాలకు పాత్రుడవై యథోచితంగా సమాజసేవచెయ్యి నాయనా. పారిపోవడంవల్ల సృష్టిలయని భంగం చేస్తున్నావు." అన్నాడు...నిజంగా వీటికేమన్నా అర్థముందా అనుకుంటూ. జీవితంగూర్చి వ్యాఖ్యానించి సిద్ధాంతీకరించడంకంటె సులువైంది మరోటి లేదనిపించింది. అనేకమార్లు యీ సిద్ధాంతాలను పెద్దలు ప్రస్తావించగా విన్నాడు. ఎన్నో మాగు వీటినిగురించి చదివి యివన్నీ దగా అనుకునేవాడు.

"అవును నాయనా—యీచికాకు, క్షణికమే. బాధ కాసేపటికి ఉపశమిస్తుంది. ఈ జీవితం వొక రంగస్థలం. ఎప్పుడూ ఎవరో ఒకరు దీనిపై వుంటూనే వుంటారు. నీ పాత్ర నువ్వు నిర్వహించాలి. ఎన్నెన్నో ఘనకార్యాలు నువ్వు సాధించాలి. ఎన్నెన్నో కలలు కన్నావు, నీ పిల్లలద్వారా ఆ స్వప్నాలు నిజమవుతాయి. నువ్వు కొంత సాధించి విడిచి పెడతావు. అక్కడ వారందుకుంటారు. సృష్టి నిత్యమూ సిద్ధి పొందుతూనే వుంటుంది."

ఆ వ్యక్తి మొహం పైకెత్తి కాలవకేసిచూశాడు. మళ్ళా కిందికి దించి మోకాలుమీద ఆనించాడు.

"లేదు—నాకీ జీవితంలో ప్రేమలేదు."

"చెప్పు నాయనా చెప్పు, నిదానంగా చెప్పు."

"తల్చుకుంటే బాధగా వుంటుంది. నే చెప్పలేను స్వామీ..."

"లేదు నాయనా ఇతరులతో పంచుకుంటె బాధ ఉపశమిస్తుంది. నిన్ను వోదార్చి మనశ్శాంతి

కలగచేస్తానేమో యత్నిస్తాను. జీవితంలో సమాధానం కుదిరేటట్లు చెయ్యగలనేమో—నీ వృత్తాంతం చెప్పవూ?"

"మీరు మహానుభావులు. పవిత్రమైన మీ మనస్సుని యీ తుచ్ఛమైన ప్రేమగాథతో కలవరపెట్టలేను. మీ ముందు అల్పుడను కాలేను."

"కాదు నాయనా—అల్పుడవు కావు. భగవంతుని దృష్టిలో అందరూ సమానులే. పరమాత్మ అన్నిటిలోనూ వున్నాడు. తుచ్ఛమైన ప్రేమలో కూడ—ముందు నీగాథ వినాలని వుంది." అన్నాడు రామదాసు.

ఆ వ్యక్తి కొలనులో చిన్న చిన్న రాళ్ళు విసురుతూ తన కథ చెప్పడం సాగించాడు. "పెద్దవాళ్ళేర్పాటుచేసిన, సాధారణమైన వివాహం మాది. పిల్లని చూశాను. నచ్చింది. నా కప్పుడు ఇరవైనాలుగు, ఆమెకి పదహారు. కార్యమవగానే చదువు కోసం కాలేజీకెళ్లిపోయ్యాను. చదువు పూర్తిచేసుకుని ఎనిమిది నెలలకి తిరిగొచ్చాను. ఆమె వొక మొగ శిశువును కన్నది. హరి అని నామకరణం చేశారు. నాకు ఉద్యోగం దొరికింది. హాయిగా కాపరం చేస్తున్నాం. ఐదేళ్లతర్వాత మా రాధ పుట్టింది. హరి ఎప్పుడూ తల్లితోనే వుండేవాడు. రాధకి నా దగ్గర చనువు. రాధ అచ్చంగా నా పోలికే అన్నాడు వో స్నేహితుడు. హరికి ఎక్కడా నా పోలికలేదని అప్పుడు గుర్తించాను. అసలు మా కుటుంబంలో ఎవ్వరిఛాయలూ వాడిలోలేవు. వాడు నాకు పుట్టలేదన్న వొక పెద్ద అనుమానం పట్టింది నాకు. పెండ్లయి పదినెలలేనా కాలేదు. నేను తండ్రినయ్యానన్నారు..."

ఆ వ్యక్తి మౌనం దాల్చాడు.

"ఇంతేనా" నెలలవకుండానే ప్రసవించడమనేది వుంది..." అన్నాడు రామదాసు. ఎందుకన్నానా అని పెదవి కొరుక్కున్నాడు, ఆ వ్యక్తి వినిపించుకోనట్లుగా మళ్లా సాగించాడు.

"కాని పోలికల మాటేమంటారు? రోజులు గడచినకొద్దీ నా అనుమానం దృఢపడసాగింది. బంధువుల్నీ, స్నేహితుల్నీ పోలికలకోసం గాలించసాగాను. ఋజువు లేకుండా ఆమెపై నిందమోపే సాహసం నాకు లేదు. చిత్రం, నా అనుమానంతో పాటు, ఆమె ప్రేమానురాగాలు ఎక్కువవుతూ వొచ్చాయి. ఇదంతా నన్ను మరిపించడంకోసం చేస్తున్న నటన అనుకునేవాడిని. సూచాయగా ఎత్తిపొడుస్తూ నా అనుమానం బైటపెట్టేవాడిని. రాద్ధాంతాలయ్యేవి. ఇవన్నీ అన్యోన్యానురాగం సూచించే వొట్లతోనూ, ప్రమాణాలతోనూ ముగిసేవి. కాని... కాని..."

తడితో కళ్లు బరువెక్కి అతను చెప్పలేకపోయ్యాడు. మెల్లగా తేరుకున్నాడు.

"ఈ మధ్యాహ్నం నిజం కనుక్కున్నాను." అని నిట్టూర్చాడు.

"విపులంగా చెప్పు నాయనా..."

"నాకింక అనుమానం లేదు. హరి తండ్రి లక్ష్మీపతి చిన్నప్పటినుంచీ మేమిద్దరం స్నేహితులం. ఒక వూళ్ళో కొన్ని సంవత్సరాలు పనిచేశాము. నా పెళ్ళి నాటికి, మేమిద్దరం వో వూళ్లోనే వున్నాము. తరవాత కొన్నాళ్లకి బదిలీ అయి అతను మరోచోటికి వెళ్లిపోయ్యాడు. ఉత్తరాలు వ్రాస్తూండేవాడు. మొన్న మమ్మల్ని చూసిపోదామనొచ్చాడు.

హరిలో అతని పోలికలున్నాయి ఉన్న రెండు రోజులూ, ఆవిడకూడా మాతో కలిసి సంభాషించేది. నా కర్థంకాని ఆంతరంగికం వాళ్ల మధ్య వుండేది. మళ్ళా మాటల్లో నాకేమీ దొరకలేదు. ఒకొరికేసి వొకరూ, యిద్దరూ కలిసి నాకేసీ—చూసే చూపుల్లో నాకేదో కనిపించింది."

రామదాసు అప్రయత్నంగా నవ్వాడు.

"మనో చాంచల్యానికి, భ్రాంతికి యిది మంచి ఉదహరణ—స్నేహితుల్ని యీవిధంగా ఉపయోగించుకుంటున్నావా, నాయనా?" అన్నాడు.

"అంతే కాదు స్వామీ. ఈ ఉదయం లక్ష్మీపతి వెళ్లాడు. అతన్ని దిగవిడిచి నే ఇంటికొచ్చేసరికి మధ్యాహ్నమైంది. రాధ నిద్ర పోతోంది. హరి యింకా స్కూలునుంచి రాలేదు. హాల్లోంచి లోపలికెళ్ళి పడకగది తలుపులు తెరిచాను. ఆమె అదిరిపడింది. తలంటుపోసుకుని, ఏదో చూస్తూ కూర్చుంది. నన్ను చూసి బెదరినట్లు చివాలున లేచి చేతులోవున్న కాగితాన్ని గుప్పెట్లో ముడిచేసి కొంగులో చెయ్యి దాచింది. జుట్టు గాలికి కదులుతూ మెడచుట్టూ పడింది. శరీరానవున్న తడి చీరని కొద్దిగా పట్టుకుని వుండడంమూలాన గుప్పెటు కనిపిస్తోంది.

'ఏమిటుంది?'...నా ప్రశ్నకి ఆమె వులిక్కిపడింది.

'ఏమీ లేదు.'...కంఠంలో దౌర్జన్యం ధ్వనించింది.

'ఏమిటో నాకు తెలుసు' అన్నాను.

'అవుతే నన్ను సకటం దేనికి?'

'నే అనుకున్నది సరో కాదో చూద్దామని.'

'ఏమనుకున్నారో ముందు చెప్పండి.'

'చెప్పను.'

'చెప్పకపోతే యిదేమిటో కూడా చెప్పను.'

ఒకడుగు ముందుకేసి...'ఆ గుప్పెట్లో ఏమిటో యిల్లా తే' అని గర్జించాను.

'నే నివ్వను' అని రెండడుగులు వెనక్కి వేసింది.

'నేను బలవంతంగా తీసుకోగల్ను తెలుసా—'

'అబ్బో...'

'విసిగించక యిల్లా తే—ఊ—' అంటూ దగ్గర మోకాలుమీదికి జారిన ఆమె చీరకొంగు పట్టుకున్నాను.

'దూరంగా వుండండి—వెళ్లిండి' అని కొంచం బిగ్గరగా అంది.

'ఎందు కివ్వవు?'

'మీకీ పట్టుదలెందుకు?'

'నాకంతా తెలుసు కాబట్టి...'

'ఏమిటా వెర్రి ధోరణి...మీకేం తెలుసు?'

'నాకేం తెలుసో నీకు తెలీకపోతేగా!'

'నాకేం తెలీదు.' అన్నదామె.

'మొగుడికి చివర్లోకాని తెలీదంటారు!' అన్నాను.

'ఆహా' అని కాస్త వెటకారంగా అని, హిస్టీరియా అనిపించే అదోరకం నవ్వుని నిలుపుకుంటోంది.

'చివర్లో తెలిస్తే చివర్లోనే నమ్మాలికూడా'... అని ముగించింది. పూనకంలా వొచ్చేసింది నాకు కోపం. ఆమె నోటిమీద చేత్తో వొక్కటి చరిచాను. చేతులో వున్నదాన్ని లాక్కోడం కోసం పెనుగులాట సాగించాను. పట్టువొదలక, మంచం బద్దీ పట్టుకుని నన్నొక్క తోపుతోసింది. నేను మంచంపైన కూలాను. వెర్రి ఆవేశంలో కొట్టడానికి ఏదేనా దొరుకుతుందేమో చూస్తూ, హాల్లోకెళ్ళి పింగాణీ పూలతొట్టిని విసిరేశాను. అప్పుడే వొచ్చి గదిలోకెళ్ళబోతున్న హరికి అగిలింది. అమ్మయ్యో అని వాడు కూలడం, నే వెళ్లిపోతుండే తలుపులు లోపల గొళ్లెమెయ్యడం జరిగింది. 'హా ఇక్కడికి రాకు పో' అని వాడు గొణగడం అస్పష్టంగా వినిపించింది. కొండ శిఖరంనుండి పడినవాడిలా గుండె—అఘాతంలోకి కుంగిపోతున్నట్టుగా, అల్లా నకు ముకుంటూ యిల్లా చేరుకున్నాను. స్వామీ—మీరే నన్ను చూడాలి."

ఉద్రేకంతో ఆ వ్యక్తి పెదవులు వొణికిపోతున్నాయి. పొరలివొస్తున్న దుఃఖం మొహాన్ని వికృతంగా చేసింది. రామదాసు అతని మొహాన్ని తుడుస్తూ బుజ్జగించాడు. అతని కళ్లలోకి తీక్ష్ణంగా చూశాడు.

"చూడు నాయనా, 'నే నిది చేశాను,' 'నే నది చేశాను' అంటావు. ఈ 'నేను' ఎక్కడుంది? లేదు నాయనా. ఆకలేస్తే అన్నం కావాలంటావు, చక్కిలిగింత పెడితే నవ్వుతావు. గిల్లితే ఏడుస్తావు. మిగిలినవాళ్లు ఎవ్వరూ చెయ్యనిదీ, ప్రత్యేకంగా నువ్వు మాత్రం చేసేదీ, యిందులో ఏముంది? అహం నిమరచిపో—కన్నీటికి, నవ్వుకీ అతీతుడ వవుతావు ..నీఅహం గురించి ఆలోచించి, దాన్ని ప్రేమించి తుదకు ద్వేషిస్తున్నావు. అందుకనే అహంనుండి పారిపోతున్నావు. నువ్వు నీ భార్యనీ, పిల్లవాడినీ ద్వేషించడం లేదు. నిన్ను నువ్వే ద్వేషించుకుంటున్నావు. హరి గాయపడేట్టు నువ్వు విసిరిన పూలతొట్టి నీపైన నే విసురుకున్నావు. గాయపడి పరుగెత్తుకొచ్చేశావు" ...ఈ సందర్భంలో ఏదేనా వో శ్లోకం చదవాలనుకున్నాడు రామదాసు. కాని తప్పులు చదవడం అతనికి యిష్టంలేదు.

"నే నామెను ప్రేమించాలనుకున్నాను. శీలం చెడిపోయిన స్త్రీని ప్రేమించలేను స్వామీ..."

రామదాసు చిరునవ్వు నవ్వాడు.

"పిచ్చివాడవు నాయనా..... నువ్వామెను ప్రేమించలేదు, వాంఛించావు. వయస్సు మళ్లేడంతో వాంఛ సన్నగిల్లుతుంది. వాంఛ లేనప్పుడు సాధ్యమైన ప్రేమే—నిజమైన ప్రేమ."

"సంతోషం లేనప్పుడు యీ ప్రేమ ఎందుకు స్వామీ?..."

"ఈమాత్రం తెలీదా? నువ్వు అన్వేషిస్తున్నది ఆనందం కాదు. నువ్వు కోరేది కొత్త కొత్త ఇంద్రియానుభవాలు. వయస్సుతోబాటు శారీరక సుఖాలు

పల్చబడతాయి. హృదయం పవిత్రమైన ప్రేమతో నిండుకుంటుంది. సంసారాన్ని త్యజించడానికి నువ్వు సంసిద్ధుడివేగా?"

"ఆ."

"సరే ఇప్పుడు నీ హృదయంలోపల చూడు. అసూయ, ద్వేషం వున్నాయా?"

"అవును స్వామీ—నాకు తెలిసొస్తోంది. మనస్సులో ఆరాటం తీస్తోంది"

"నిన్ను గురించి ఆలోచించకు. నీ భార్యని గురించి, పిల్లల్ని గురించి ఆలోచించు. వారిని ప్రేమానురాగంతో ముంచివెయ్యి. వారిని సుఖపెట్టు. నువ్వు సుఖపడతావు. ఇదే వేదాలు బోధించే రహస్యం"

"ఇది నాకెలా సాధ్యమో చెప్పండి?"

"ఎందుకు కాదు? నీ భార్య నవ్వెళ్లో వున్న దేమిటో నువ్వు చూడలేదు. అది మామూలు కౌగిలం కావొచ్చు. ఏనాడో నువ్వామెకి వ్రాసిన జాబు అవొచ్చు. పాత జాబులు ఎంతో ఆనందాన్నిస్తాయి. ఆ జాబుని ఆమె చదువుకూ వుండొచ్చు"

"అవుతే ఆమె నాకెందుకు చూపించదు?"

"చూసు నాయనా—ఆమెకీ నీలాగే అహం వుంది. నీ అహాన్ని నువ్వు ప్రదర్శించావు. ఆమె తన అహాన్ని బైట పెట్టింది. నీ దౌర్జన్యం, మూర్ఖత్వం, ఆమెలో దౌర్జన్యాన్ని, మూర్ఖత్వాన్ని పురిగొల్పాయి. రహస్యమైన స్వార్థాల సంఘర్షణ అది. తిరిగి ఆమె దగ్గరకు వెళ్లు. నీ మూర్ఖత్వాన్ని తెలియపరిచి, పశ్చాత్తాపపడి, ఆమె క్షమాపణ వేడుకో. ఆమె హృదయ ద్వారాలు తెరుచుకుంటాయి. విశ్వాన్ని సహితం ముంచివేసే ప్రేమ నీపై కురిపిస్తుంది."

"మరొకరికి పుట్టినవాణ్ణి నేనెట్లా ప్రేమించగలను స్వామీ?"

"మనమందరం దేవుడిబిడ్డలం. మరొకరికిపుట్టినా సరే, నువ్వు ఆ బిడ్డని ప్రేమించగలగాలి."

"నేనది చెయ్యలేను."

"నువ్వు చెయ్యగలవు. పరిస్థితులకు లొంగి, ఆమె అజ్ఞానంలో, అపచారంచేసి వుండొచ్చు. ఆమె గతాన్ని క్షమించు. మంచిగా వుండేటందుకు వొక్క అవకాశమివ్వు. పుట్టిననాటినుండి, చనిపొయ్యేవరకూ మంచిగావుండే వ్యక్తులు మనలో ఎవ్వరూ లేరు. అజ్ఞానంలో, యౌవనచాపల్యంలో, మనం తప్పటడుగులు వేస్తాం. పొరపాట్లు చేస్తాం—అప్పుడప్పుడు బోర్లగిల పడతాము. లేచి సర్దుకుని, మళ్లా బ్రతుకు సాగిస్తాం. నా కళ్ళల్లోకి చూడు. ఆమె అపచారం చేసిందంటున్నావు. అట్లాంటిఅపచారం నువ్వెన్నడూ చెయ్యలేదా—నీలో నువ్వు ఆ ప్రశ్న వేసుకో..."

"కాని నేను పురుషుణ్ణి..."

"ఆమె స్త్రీ—పైగా మాతృత్వంద్వారా పరిపూర్ణత పొందవల్సిన భారం ఆమెపైనుంది."

"స్వామీజీ మీరు చెప్పింది నిజమైతే, అసలు నీతికే తావులేదు."

"ఇదొక వెర్రి నాయనా. చార మొక్కటే దుర్నీతి కాదు. అసత్యం, దగాకోరుతనం, అన్యాయం, లంచగొండితనం, అధికారం, అసూయ, ద్వేషం, పగ, యుద్ధం—ఎన్నెన్నో వున్నాయి లోకంలో. ఇదంతా దుర్నీతే. దీనిని నువ్వు ద్వేషించి సమాజంనుండి పారిపోవడంలేదే...సాధించి భాగ్యవంతులైన వారిపట్ల వీటిని ఎందరో హర్షించడమే కాకుండా ఆదర్శంగా స్తుతించడంలేదా? వెక్కిరింపుగా మృత్యువులో అంతమొందే యీ క్షణిక జీవితంలో యిదొక అపరాధమా? అనంత విశ్వంలో, ఎడతెగని సృష్టిసమరంలో, ప్రేమలో పరాకుగా కన్ను మూసొక పాపమా!... నేనొక ర్నెరుగుదును......"...

ఏదో చెప్పబోతూ రామదాసు పొరబాటు తెల్సుకుని, చటుక్కున నిలిచిపొయ్యాడు.

"చెప్పండి స్వామీ—గొప్ప అనుభవం వున్నవారల్లే మాట్లాడుతున్నారు."

"లేదు నాయనా నాకేమీ అనుభవం లేదు. కాని ప్రేమంటే నాకు తెలుసు—విశ్వమంత గంభీరంగా, సృష్టంత శాశ్వతంగా వుండగలదు."

రామదాసు కళ్లు తడిసి మెరుస్తున్నాయి నవ్వులోకి దిగిపోయి, ఆ వ్యక్తిని లేవదీసి ముందుకి నడిపిస్తున్నాడు.

"నాతో రా నాయనా..."

"ఎక్కడికి స్వామీజీ?"

"వైద్యునివద్దకి. అతన్ని తీసుకుని నీ ఇంటికి, పిల్లడిని చూసుకో..."

నిశ్శబ్దంగా నడవడం సాగించారు.

"క్షమార్పణ, జీవితంతో సమాధానపడటం, ప్రేమ, విశ్వాసం యివి అర్థంలేని ధ్వనులు కావు

నాయనా..." అంటున్నాడు రామదాసు. ఇంతలో గట్టునున్న గుడిసెల దగ్గరకి చేరుకున్నారు.

"బీదతనం, అనారోగ్యం, ద్వేషం, యుద్ధం—అన్నిటికంటె ముఖ్యంగా ప్రేమరాహిత్యం—యివి నాయనా, జీవితంలో అనర్థాలు. వీటిని తొలగించడమే మానవజీవితంయొక్క పరమార్థం. నీ ప్రేమకోసం తహతహలాడుతున్న నీ భార్యా బిడ్డలదగ్గరికి వెళ్లు. వారికి వుపచారం చెయ్యి. అదే పరమాత్మ దర్శనం..."

ఇద్దరూ పార్కుదగ్గర కొచ్చారు. ఆ నేత్రాలు, ఉత్సాహంతో పదేపదే మెరుచుకుంటున్నాయి.

"మీరు మహానుభావులు స్వామీ—నాకు అర్థమవుతోంది. నా మనస్సు చల్లగా వుంది. ఇంక అసూయ, ద్వేషమూ లేవు... నేను ఇంటికి వెళతాను. వైద్యుని తీసుకెళతాను...అయ్యో, హరి గాయపడి ఎంతగా బాధపడుతున్నాడో! ఆమె పాపం...ఆమె ఎంతగా...స్వామీజీ, నేను మీ కేమివ్వగలను?"

"నేను చేసిం దేమీ లేదు నాయనా. ఇతరుల కోసం జీవించు- -దైవం నిన్ను కాపాడతాడు."

తొందరగా నడుస్తూ ఆ వ్యక్తి పార్కు వెనక వైపు వెళ్ళిపోయ్యాడు.

రామదాసు తనలో తాను నవ్వుకున్నాడు. జరిగిందంతా హాస్యాస్పదంగా తోచింది. వేదాంతం వేళాకోళమనీ, మనిషి దగాకోరనీ అనుకునేవాడు. ఆధ్యాత్మిక చింతనపైనా, దైవంపైనా, అతని కెప్పుడూ గురి కుదరలేదు. విశ్వాసంలేని అతని పలుకులనుండి వోదార్పు పొంది, అతని మాటలు నమ్మి జీవితవిధానం మార్చివేసుకోటానికి సంసిద్ధుడైన వొక వ్యక్తి అతనికి తటస్థపడ్డాడు. మానవులు ఎంతటి అమాయకులు!...గొప్పగా ధ్వనించే మాటలకీ, శూన్యమైన భావాలకీ లొంగి, మోసపోతారు......తన భాషకీ, భావాలకీ తనే ఉద్రేకపూరితుడై, హృదయంలో సంచలనం కలగడం గుర్తించి రామదాసు చీకాకుపడ్డాడు. నుదుటిమీద చెమట్లు కమ్ముతున్నాయి. పాగా తీసేసి, వొకపొర తీసి దానితో మొహం తుడుచుకున్నాడు. సూర్యుడు దిగిపోతున్నాడు. పొడుగాటి నీడలు పడుతున్నాయి. చెట్లు, వీధి, పడమటిఆకాశం—వీటిపైన సంధ్య వెలుగు ఎర్రశాలువా కప్పినట్లుంది. ఇద్దరు సాధువులు సంచీలు కట్టేసుకుని, కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కాలవకేసి నడిచిపోతున్నారు. వారిలో వొకడు వెనక్కి తిరిగి తనకేసి చూసినట్లయింది. రామదాసు వెంటనే పాగాతగిలించి, పార్కు అవతలవైపుకు వెళ్ళాడు. కుళాయిదగ్గర మొహం కడుక్కొని కాసిని నీళ్లు తాగి ముష్టివాళ్లమన్యగా నడిచి పార్కులోపలికి చేరుకున్నాడు. అలసటగా వుండి, కాసేపు సేద తీర్చుకుందామనుకుని, వోమూల కర్ర బెంచీమీద మోకాళ్ళు ముడుచుకుని కళ్ళు మూసుకుని కూర్చున్నాడు. కొన్ని నిమిషాలు గడిచాయి. ప్రతిధ్వనించే పిల్లలకేకలూ, నవ్వులూ వినబడ్డాయి

పిల్లలలో ప్రమాదం, మరోచోటుకి దూరంగా వెడితే మంచిదేమో అనుకున్నాడు. కాని వాళ్ళు ఆటల్లో లీనమైపోయ్యారు. తనని గమనించినట్లులేరు వారి వొయ్యారమైన పరుగులు, ముద్దుగొలిపే నవ్వులు, చూడ్డానికి ఆకర్షణీయంగా వున్నాయి. వారి సహజమైన సంతోషం అతన్ని సంతోషపెటింది. చూస్తూ కూర్చున్నాడు. ఆకాశంలో ఎరుపు కరిగి, దట్టమైన ఊదారంగు మేఘాలు కమ్ముకుంటున్నాయి. ఫ్యాక్టరీ కూత వినబడింది. పావురాలు చెట్లమీదికి ఎగురుతున్నాయి.

అతను లెక్క పెట్టాడు. ఆరుగురుపిల్లలు దాగిలిమూత లాడుకుంటున్నారు. ఐదారేళ్లుంటాయి—ఆ పిల్ల, దొంగ; కళ్లమీద రుమాలు కట్టివుంది. మిగతా ఐదుగురూ దొరకకుండా అటూ యిటూ పరుగెడుతూ, మొక్కలవెనక, బెంచీలకిందా దాక్కుంటున్నారు. ఆపిల్ల చేతులు చాచి, తడుముకుంటూ తిరుగుతోంది. రామదాసుకి దగ్గరగా వొచ్చింది. అతను లేవబోతుండగానే అతని బుజం పట్టుకుంది. "ఇదుగో దొంగ ... దొరికాడు ... అమ్మదొంగా — ఇక్కడున్నావా?' అని కేకలేస్తూ, మొహానవున్న రుమాలు లాగేసింది. మిగతి వాళ్లందరూ నవ్వుకుంటూ ఆమె చుట్టూ మూగారు. "ఇదుగో దొంగ" ... అన్నది ఆపిల్ల. మిగతా వారందరూ, రామదాసుని అటూ యిటూ లాగుతున్నారు. అతని గడ్డాలు వూడి వొచ్చేస్తాయేమో నని భయపడ్డాడు. నిలబడి సర్దుకున్నాడు. ఆ పిల్ల సిగ్గుపడి, ముసిముసిగా నవ్వుకుంటూ పరుగెత్తుకుపోయింది. మిగతవాళ్లు ఆమె వెనకే పరుగులు సాగించారు.

రామదాసు పార్కుగేటు ముందుకి చేరుకున్నాడు. దూరంగా 'వో జట్కాబండి నిలిచింది. అందులోంచి, ఇందాకా ఇంటికెళ్ళిన వ్యక్తి, వో కుర్రాడు దిగి, తన వైపుకి నడిచి వొస్తున్నారు.

"స్వామీజీ మీ రిక్కడుంటా రనుకున్నాను. అదుగో నా భార్య, రాధ; అదుగో ఆ బండిలో

వున్నారు. పార్కుకేసి షికారుగా బైలుదేరాము. మీ రుంటారనుకున్నాము. ఆమెకి మీ దర్శనం చేసుకుని, ఆశీర్వాదం పొందాలనుంది. వీడు హరి. చిన్న గాయమే అండి తగిలింది. వైద్యులు బాండేజి వేశారు. స్వామీ, మీరు చెప్పినట్లే జరిగింది స్వామండీ! అంతా...ఎటొచ్చీ, చదువుకున్నది వుత్తరం కాదు. నే వెళ్ళేటప్పటికి మా పెళ్ళినాటి ఫోటో చూసుకుని, జ్ఞాపకాలని వూహించుకుంటోందిట. నే పరాయివాణ్ణిగా ఆ జగత్తులో ప్రవేశించానట... నేను మూర్ఖుణ్ణి స్వామీజీ...ఆమెతో అంతా చెప్పేసి క్షమాపణ వేడుకొన్నాను. మీరు మహానుభావులు. క్షణం వుండండి. వాళ్ళని తీసుకొస్తాను..." అంటూ సమాధానం చెప్పనీకుండా, అతను గబగబ బండిదగ్గరకు వెళ్లాడు. అతని భార్య, కూతురు బండి దిగడం చూశాడు రామదాసు. మెల్లగా నడుచుకుంటూ వొస్తున్నారు. వారికేసి చూసి, చివాలున వెనక్కి తిరిగి రామదాసు నడవడం సాగించాడు. వాళ్లు వొచ్చేసరికి అతను అక్కడ లేడు. వారిని అక్కడ దిగవిడిచి, ఆ వ్యక్తి పిలుస్తూ వెనకాలే నడిచివెళ్లాడు.

"స్వామీజీ—వెళ్ళిపోతున్నారా...వాళ్ళని ఆశీర్వదించరూ?"

రామదాసు అతని కళ్లల్లోకి చూశాడు.

"పరమాత్మ మిమ్మల్ని ఆశీర్వదిస్తాడు. నేను వెళ్ళాలి."

"ఎక్కడికి స్వామీ?"

"ఇంటికి..."

"ఇంటికా? మీకు ఇల్లులేదన్నారుగా..."

"అవును నాయనా దేవుడే నాయిల్లు." అని రామదాసు తొందరగా నడిచాడు. పెద్ద రస్తాకి చేరుకున్నాడు. వెనక్కి తిరిగి చూశాడు. ఆ వ్యక్తి పార్కులోకి వెళ్ళడం చూశాడు. హరిని చూడగానే అతనే 'దొంగ'ని రామదాసుకి తెలిసిపోయింది. పదిహేనేళ్ల విద్యార్థిగా వున్నప్పటి తన ఫొటో ఆ ముఖ్యాన్నే చూశాడు. హరి ఆ ఫొటోలో పిల్లాడిలా వున్నాడు. 'దొంగ దొరికాడు' అన్న పార్కులో పిల్ల మాటలు అతని చెవులో గింగురుమంటున్నాయి. ఆపిల్లల నవ్వు తలుపులు మూసుకున్న అతని హృదయంపైన గుద్దినట్లుగా వుంది తలుపులు తెరుచుకున్నాయి. వేదాంతం అంతా వెళాకోళం, మనిషి దగాకోరు అనుకునేవాడుగా... . తను దగాకోరు; తన జీవితం వెళాకోళం; కళ్యాణిని ప్రేమించి క్షమించ మనగలిగాడా తను? స్కూలు వ్యవహారాలు బైట పెడతానన్నాడు, నిర్వాహకవర్గంవారిపై ద్వేషం వల్ల కాదా? ఎవరిపై అతనికి నమ్మకం వుంది? తన మీద తనకి నమ్మకం వుందా? కళ్యాణి జబ్బుతో మంచాన పడినప్పుడు, వైద్యుని ఎందులకు వెంటనే పిలవలేదు? చనిపోతే, తన బిడ్డని దాల్చిన ఆమెని పెండ్లి చేసుకుందామనేగా?

రామదాసు, తన యిల్లు వున్న వీధికి చేరుకున్నాడు. అడుగు నీరసంగా పడుతోంది. అస్థిపంజరం వొణుకుతోంది. కళ్ళమ్మట [illegible]రు కారుతోంది. ఆకాశంలో చందమామమీద సన్నటి చారలా తెల్లటి మేఘం పడింది నక్షత్రాలకేసి చూశాడు. చందమామ మీది మేఘం తొలిగింది. అతని మనస్సులో ఏదో లేతగా మెరిసినట్లయింది. వీధిలో జనం లేరు— మేడల కిటికీల్లోంచి, దీపాలు కదులుతున్నాయి. ఇంటికి చేరుకున్నాడు. అదిగో అతని ఇల్లు— ఇన్నాళ్ళూ తను దాక్కున్న ఇల్లు. తనెప్పుడూ దాక్కుంటున్నా( -ఇంట్లోనో, స్కూలోనో గడ్డాల వెనకనో; ఇప్పుడు దొరికిపొయ్యాడు. ఇంక దాక్కో లేడు.

ఆకస్మికంగా రామదాసు వెనక్కి తిరిగి నడిచి వీధి మొగిలో కొచ్చాడు. పెద్ద రస్తాలో తొందరగా నడిచిపోతున్నాడు. పార్కు దాటి, గుడిసెలు దాటి, కాలవ గట్టుమ్మటే వెడుతున్నాడు. మొహాన తగిల్చిన గడ్డాలు పీకి, కాలవలో పారేశాడు. ఇంకా నడుస్తున్నా[illegible] ఇంకా దూరంగా మంచుతో, మసగగా కప్పబడిన ఆ పచ్చకొండ వేపుకి, దానవతులున్న వింత కేసి కదిలిపొయ్యాడు.



# నాలుగు పరిమాణాల లోకం

**శ్రీ వసంతరావు వెంకటరావు**

"అయితే, మనం జీవిస్తున్నది మూడు పరిమాణాల లోకమా?" అని లావణ్య ప్రశ్నించింది

"కాదు; నాలుగు పరిమాణాల లోకమని విజ్ఞులంటారు. అందులో మూడు పరిమాణాలను, వాటి అన్యోన్యసంబంధాన్ని, బాగా ఎరుగుదుము. అంటే, ఏవస్తువైనా మూడు పరిమాణాలలో వ్యాపించినట్లు మనం గుర్తిస్తాము. అవి, పొడవు, వెడల్పు, ఎత్తు లేక దళసరి. ఆ మూడున్ను ఒకదానికొకటి లంబంగా నుంటాయి. ఒకఘనాన్ని రెండు పరిమాణాల ప్రదేశంలో నిరూపించినప్పుడు చిత్రం 1. లో




చిత్రం. 1.

వలె బొమ్మను గీసాము. అందులో 'అఆ' దాని పొడవు, 'ఆఇ' వెడల్పు, 'అఎ' ఎత్తు. ఈ ఘనం ఎంతోకాల ముంటుంది. అందుచేత, అది కాల పరిమాణంలోకూడా వ్యాప్తమైయుందనీ, కాలమే నాల్గవ పరిమాణమనీ మనం భావించాలి."

"అదెట్లూహించడమండీ?"

"అంత కష్టమైన భావం కాదది. రేఖాపట సాహాయ్యంతో దానిని సులభంగా ఊహించవచ్చును. ఈ ఘనం క్షణమాత్రముండి మాయం కాదు. కాల వాహినిలో క్షణక్షణం అది వ్యాపిస్తుంది. నిజానికి క్షణమాత్రం మనికి గల వస్తువుని ఊహించుకోనేలేము. అయితే 'నాల్గు పరిమాణాల ఘనం' ఎట్లుంటుందో ఊహించాలంటె మామూలుగా మనం అవలంబించే మార్గం పనికిరాదు. ఉదాహరణకి, నిప్పులు క్రక్కుతూ సుళ్లతో కత్తో భయానకంగానున్న భూతాన్ని కాని, రెండు టెన్నిస్ కోర్టులు, ఈతకనువైన సరస్సు కలిగిన పెద్ద విమానాన్ని కాని, ఒక చిన్న పట్టణంవలె నున్న స్టీమరుని కాని ఊహించుకోమన్నప్పుడు, అవి మన కెదురుగా ప్రత్యక్షమైనప్పు డెట్లుంటాయో అటి చిత్రాన్ని మనసులో చ్ర

చిత్రాని కాధారమైనది మన మూడు పరిమాణాల లోకం. మనం, మన చుట్టూగల వస్తుసంచయము నివసిస్తున్నది మూడు పరిమాణాల లోకమనే మన భావన. మన ఊహ కిదే అర్థమైతే, మూడు పరిమాణాల వస్తువుని రెండు పరిమాణాలలోనికి కుదించడం ఎంత కష్టమో నాల్గు పరిమాణాల వస్తువుని మూడు పరిమాణాలలోనికి కుదించడం కూడ అంత కష్టమే. కష్టమే కాదు అసాధ్య మనిపిస్తుంది. కాని, ఒక ప్రత్యేక దృష్టిలో ఈ కష్టకార్యాన్ని సాధిస్తున్నామని గ్రహించాలి. ఒక కాగితంపై ఒక వస్తువుయొక్క బొమ్మను చిత్రించినప్పుడు దాని మూడు పరిమాణాలను రెండే పరిమాణాలలోనికి కుదిస్తున్నాము. ఈవిధంగా ఒక పరిమాణాన్ని తగ్గించినప్పుడు ఆ వస్తువుయొక్క దళసరిని పూర్తిగా నాశనం చేయడానికని ఒక యంత్రంలో పెట్టి దానిని నొక్కివేయము; ఛాయారూపంలో దానిని ప్రక్షేపిస్తాము—[చిత్రం 2] కుక్క బొమ్మ వెయ్యాలంటె దాని నీడను సరిగా గీస్తే చాలు.



చిత్రం. 2.

"ఈ విధంగానే నాల్గు పరిమాణాల వస్తువును మూడు పరిమాణాల ప్రదేశంలోనికి ప్రక్షేపించవచ్చును. అయితే, మూడు పరిమాణాల వస్తువుల ప్రక్షేపాలు రెండే పరిమాణాలలో నున్నట్లు నాల్గు పరిమాణాల వస్తువుల ప్రక్షేపాలు మూడు పరిమాణాలలో మాత్రమే ఉంటాయి; వాటి నాల్గవ పరిమాణమైన కాలం లోపిస్తుంది. ఈ విషయం చక్కగా అవగాహన చేసికోడానికై రెండు పరిమాణాల జీవుల నూహించాలి. వారు కేవలం నీడబొమ్మ లట్లుంటారు; పొడవు వెడల్పుగల ఒక తలంమీద సంచరిస్తారు. అట్టి జీవులు మూడు పరిమాణాల ఘనాన్ని ఏవిధంగా ఊహిస్తారో తెలిసికొందాము. మూడు పరిమాణాల జ్ఞానమున్న మనం రెండు పరిమాణాల లోకాన్ని మీదనుండి చూడవచ్చును; ఆ సామర్థ్యం మనకుంది. చిత్రం 1. లో ఘనంయొక్క మూడు పరిమాణాలను నిరూపించేను. కాని, రెండు పరిమాణాల లోకజీవులకు మూడవ పరిమాణజ్ఞానం లేదు కాబట్టి, ఆ ఘనంయొక్క పొడవు వెడల్పులను మాత్రమే వారు గుర్తించగలరు కాని, ఎత్తును ఊహించ నేలేరు. అందుచేత, అట్టి జీవుల దృష్టిలో, మూడు పరిమాణాల ఘనంయొక్క ప్రక్షేపం చిత్రం 3. లో వలె



చిత్రం. 3.

ఉంటుంది. మన అదనపు మూడవ పరిమాణమైన ఎత్తును కూడా వారి రెండు పరిమాణాలలోనికే కుద్దించుకొంటారు. ఇట్లు ఆ ఘనంయొక్క ప్రక్షేపాలను ప్రేరుస్థానాలలో వాచి, మాయామేయమైన ఈ 'మూడు పరిమాణాల ఘనం' యొక్క ఆకారాన్ని, లక్షణాలను ఊహించుకోడానికి ప్రయత్నిస్తారు."

"అదేమిటండీ! ఘనంయొక్క ఛాయ అద్దాల చట్రంలాగ కనిపిస్తూంది?"

"రెండు పొడవులనుకాని రెండు వెడల్పులను కాని కలిపే ఎత్తు వారిదృష్టిలో లోపించి, అదికూడా వారెరిగిన రెండు పరిమాణాలలోనికే కుదింపబడుతుంది. అందువల్ల ఆ ఛాయకు చట్రంయొక్క ఆకారం సిద్ధించింది. రెండు పరిమాణాల జీవులు వారి లోకాన్ని విడిచి పైకి రాలేరు కనుక, ఘనంయొక్క ప్రక్షేపాలను పదేపదే పరిశీలించి, ఘనానికి 12 అంచులు, 8 కోణబిందువులు ఉన్నాయని నిర్ణయిస్తారు."

"పాపం, మూడవ పరిమాణజ్ఞానం లేకపోతే ఎంతకష్టమండీ! ఘనంకూడా బల్లపరుపుగా ఉందనే అనుకొంటారుకదూ?"

"అట్టి సానుభూతి అనవసరమని నేను చెప్పేను. మన పరిమితత్వానికి నాల్గు పరిమాణాల లోకవాసు లెంత హేళన చేస్తారో నీకు తెలియదు. చిత్రం 4. చూడు. అది నాల్గు పరిమాణాల ఘనంయొక్క ప్రక్షేపం.



చిత్రం. 4.

మూడు పరిమాణాల ఘనాన్ని ఊహించుకోడానికి రెండు పరిమాణాలజీవులెంత బాధపడ్డారో అంత బాధ మనం పడతాము 4 వ చిత్రాన్ని బోధపరచుకోడానికి. ఘనమంటే మన కొక భావముంది; అది మూడు పరిమాణాలకు మాత్రమే పరిమితమైందనుకో. అయినప్పటికి, దానికి విరుద్ధంగా మరొక చిత్రాన్ని ఊహించుకోనడం కష్టమే. అందులో ఇంకొక చిక్కు కూడా ఉంది. నాల్గు పరిమాణాల ఘనాన్ని మూడు పరిమాణాల ప్రదేశంలో ప్రక్షేపించి, దానిని తిరిగి రెండు పరిమాణాల సమతలంలో ప్రక్షేపించగా తయారైనది చిత్రం 4.

"దానిని జాగ్రత్తగా పరిశీలించు. 3 వ చిత్రం ఏవిధంగా రెండు పరిమాణాల జీవులని చిక్కు పెట్టిందో, అట్లే, 4 వ చిత్రం మనలను చిక్కు పెట్టక తప్పదు. ఒక చతురస్రంలో మరొక చతురస్రముండి, ఒకదాని కోణబిందువులు రెండవదాని కోణబిందువులతో క్రమంగా కలుపబడినట్లు చిత్రం 3 లో కనిపి

స్తూంది. అది మూడు పరిమాణాల ఘనంయొక్క ప్రక్షేపం, రెండు పరిమాణాల తలంలోనికి. అయితే నాల్గు పరిమాణాల ఘనం మూడు పరిమాణాల ప్రదేశం లోనికి ప్రక్షేపింపబడినది కనుక, ఒక ఘనంలో మరొక ఘన మున్నట్లు, ఆ రెండుఘనాల కోణ బిందువులు ఒకదానితో నొకటి క్రమంగా కలుపబడినట్లు మనకా ప్రక్షేపం కనిపిస్తూంది. ఈవిధంగా ప్రక్షేపింపబడిన నాల్గు పరిమాణాల ఘనాన్ని పరిశీలిస్తే, దానికి 32 అంచులు, 16 కోణ బిందువులు, 24 ముఖాలు ఉన్నట్లు స్పష్టమౌతుంది."

"ఇదెక్కడిఘనమండీ? అయితే, మనం మామూలుగా చూస్తున్న ఘనం, చిత్రం 4 లో చూపినట్లుంటుంది అంటారా?"

"అవును. దాని యథార్థ స్వరూప మదే. నాల్గవ పరిమాణ జ్ఞానంలేని మనం, ఆ ఘనాన్ని చిత్రం 1 లో నున్నట్లుగా భావిస్తున్నాము. నాల్గుపరిమాణాలగోళం యథార్థంగా ఎట్లుందో ఊహిద్దాము. దానికిముందుగా, మూడు పరిమాణాలు గల గోళంయొక్క ప్రక్షేపం రెండు పరిమాణాలతలంపై ఎట్లుంటుందో ప్రయోగపూర్వకంగా చూడవచ్చును. మన భూమిని పారదర్శకపుగాజు గోళంతో నిరూపించేరనుకొందాము. భూఖండాలను ఆ గోళంపై వార్నిషుతో చిత్రించేరనుకొందాము. దీపపు కాంతిమార్గంలో ఈ గోళాన్ని ఉంచి, దానినీడ నొక తెరపై ఏర్పరచినప్పుడు ఆనీడ వృత్తాకారం వహిస్తుంది. భూగోళాన్ని రెండు అర్ధగోళాలుగా భావించాలి. ప్రతి అర్ధగోళం ఒక వృత్తంవలె ప్రక్షేపింపబడి తెరపై నీడలో ఒక వృత్తంపై రెండవవృత్తం పడుతుంది. ఆ ఛాయలో, నిజంగా రెండు వృత్తాలు ఒకదానినొకటి కప్పుతూ ఉండి, వాటిపరిధివద్దమాత్రమే కలిసియున్నట్లు మనమూహించాలి."

"మరి కొంచెం వివరంగా చెప్పాలండీ!"

"అంటే, కాంతికి లంబంగా గాజుగోళాన్ని మధ్యకు రెండు సమభాగాలుచేస్తే, ఒక్కొక్క అర్ధగోళంయొక్క నీడ ఒక వృత్త మట్లు తెరపై ఏర్పడుతుంది. ఈవిధంగా రెండు వృత్తా లేర్పడాలి. కాని, ఒకేకాంతి ఈ రెండుగోళాలగుండాపోయి తెరమీద కలిగించిన ఛాయలో కుడి అర్ధగోళపు నీడమీదనే ఎడమ అర్ధగోళపునీడకూడా పడుతుంది. ఆ కారణంచేత తెరమీదనున్న వృత్తాకార భూమిలో న్యూయార్కు నగరానికి పీపింగు నగరం ఎంతో దగ్గరగా నున్నట్లు కనిపిస్తుంది. అది చిత్రం 5 లో స్పష్టమే కదా!



చిత్రం. 5.

"రెండు పరిమాణాలలో భూమియొక్క ఇట్టి విక్షేపాన్ని మాత్రమే అర్థం చేసికోగల రెండు పరిమాణాల జీవులు, న్యూయార్కు పీపింగు నగరాలు చాలా దగ్గరగా నున్నాయనే అనుకొంటారు. వారు తెరవైపు చూస్తూండగా గోళంపై ఒక చీమ న్యూయార్కునుండి పీపింగుకి ప్రయాణం చేస్తుందనుకో. తెరమీద వృత్తానికి మధ్యభాగంలో బయలుదేరిన చీమ నీడ అంచువైపు పోయి, తిరిగి కేంద్రముఖంగా వస్తూన్నట్లు కనిపిస్తుంది. అది చూచిన రెండు పరిమాణాల జీవులు చీమకు బుద్ధిలేదనుకొంటారు. దగరగానున్న పీపింగుకి నేరుగా పోక అంచుదాకా వృథాగా పోయి తిరిగి వెనుకకు రావడంలో అర్థంలేదనుకొంటారు. కాని, యథార్థంగా న్యూయార్కు పీపింగులమధ్య సుమారు 9500 మైళ్ళ దూరముందని, ఆ రెండు నగరాలు భూగోళానికి సుమా రిరువైపుల నున్నాయని, న్యూయార్కునుండి పీపింగుకి అంతకంటె దగ్గర త్రోవలేదని వారూహించలేరు. వారికి మూడవ పరిమాణజ్ఞానం లోపించడమే ఈ చిక్కుకి ముఖ్యకారణం. రెండు పరిమాణాలతలంలో మూడు పరిమాణాల గోళపు విక్షేపంయొక్క లక్షణాలు ఈ విధంగా నుంటాయి.

"దీనిని ఆధారంగా జేసికొని, మన యోచనను కొంచెం సాగదీసి నాల్గు పరిమాణాల గోళపు విక్షేపం మూడు పరిమాణాలలో ఎట్లుందో ఊహించడానికి ప్రయత్నింపవచ్చు. సామాన్య గోళంయొక్క విక్షేపం పరిధివద్ద కలిసిన రెండు వృత్తాల చేరికవలె కనిపిస్తుందని గమనించేము. అట్లే నాల్గు పరిమాణాల గోళంయొక్క విక్షేపం ఒకదానిలో ఒకటి ఇమిడిపోయిన రెండు గోళాల కలయికగా కనిపించవచ్చు అంతకంటె స్పష్టంగా దాని నిస్థితిలో ఊహించగల అవకాశం లేదు.

"అయితే, నాల్గు పరిమాణాల వస్తువుల లక్షణాలను ఉదాహరణ పూర్వకంగా బోధపరచుకోడానికి ప్రయత్నించగలమే కాని, మనకు తెలిసిన ఆకాశంలో 'స్వతంత్రం'గానున్న నాల్గవ పరిమాణాన్ని ఊహించుకోలేము. అయినప్పటికి, ఏదైతే నిజంగా నాల్గవ పరిమాణమో దానిని నిత్యవ్యవహారంలో చర్చిస్తునేఉంటాము. అదే కాలం. ఏ సంఘటనను వర్ణించినప్పుడైనా సామాన్యంగా అది సంభవించిన స్తానాని, అ దెప్పుడు వాటిల్లిందో ఆ కాలాన్ని వివరిస్తాము. ఏ పూర్వసంఘటనను జ్ఞప్తికి తెచ్చుకొన్నప్పుడైనా అ దెక్కడ జరిగిందో ఎప్పుడు జరిగిందో యోచిస్తాము. వాటిలో 'ఎక్కడ' అన్నది ఆకాశపరిమాణాన్ని, 'ఎప్పుడు'అన్నది కాల పరిమాణాన్ని సూచిస్తాయి. అంటె, మూడు పరిమాణాలతో నిర్వచింపవలసిన ఆకాశానికి కాలపరిమాణాన్ని కూడా చేరుస్తున్నాము. కాని, ఆ క్రియలో కాలాన్ని నాల్గవ పరిమాణంగా వినియోగిస్తున్నామన్న జానం మనకు లేదు.

"అంతే కాదు. కొద్దిగా యోచిస్తే యే వస్తువైనా ప్రదేశంలోనే కాక కాలంలో కూడ వ్యాపిస్తుందన్న సత్యాన్ని సులభంగా గుర్తించగలము. ఎట్లంటే: ఏ భవనానికైనా పొడవు వెడల్పు ఎత్తు మాత్రమే కాక జీవిత పరిమాణముంది. అది ంచబడిననాటినుండి అది శిథిలమై కూలిపోయే వరకు గల కాలాన్ని దాని జీవిత పరిమాణ మంటాము. అందుచేత, ఆ భవనం ఆకాశపు మూడు పరిమాణాలలోనూ, కాలంలోనూకూడ వ్యాప్తమై యుండనుట స్పష్టమే."

"కాలంతో నిమిత్తంలేకుండా ఏ సంఘటనను కాని, ఏవస్తువుయొక్క మనికిని కాని ఊహించుకోలేమనుకోండి. కాని, కాలాన్ని నాల్గవ పరిమాణంగా ఎట్లు భావించడమో అర్థం కావడం లేదం "

"నిజమే. ఆకాశానికి కాలానికి చాల విషయాలలో వ్యత్యాసముంది. నిజానికి ఆకాశంవంటి పరిమాణం కాలం గాదు. ఆకాశపు మూడు పరిమాణాలలో దేనినైనా ఒకే కొలబద్ద—అడుగుబద్ద, గజంబద్ద, మీటరుబద్ద—తో కొలవగలం. పొడవు కొలవడానికి కొలబద్దను అడ్డంగా నుంచినట్లయితే ఎత్తు కొలిచేటప్పుడు దానిని నిలువుగా త్రిప్పుతాము. అట్టి చిన్న మార్పుతో ఆకాశంయొక్క మూడు పరిమాణాలను ఒక కొలబద్దతోనే కొలవగలము. కాని, గడియారపు డోలకుయొక్క ఊపులుగాని, వాచీయొక్క చక్రభ్రమణంగాన్ని కాలాన్ని కొలుస్తాయి. గడియారం టిక్ టిక్ మంటూంటే కాలం గతించిపోతూం దని గ్రహిస్తాము. ఆగమనంతో అహోరాత్రులు, దినాలు, వారాలు, పక్షాలు, మాసాలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలుకూడా క్రమంగా గమిస్తాయి. అం- కాదు. ఆకాశంలో మన ఇష్టానుసారంగా ముందుకి వెనుకకు, కుడికి ఎడమకి, పైకి క్రిందికి తిరుగగలము; తిరిగి తిరిగి, కావాలంటే బయలుదేరిన స్థానాన్ని చేరుకోగలము. కాలంలో ఆసౌలభ్యం లేదు. కాలంలో వెనుకకు పోలేము. మన ఇష్టానిష్టాలతో సంబంధం లేకుండా, మనం గతంనుండి భవిష్యత్తులోనికి బలవత్తరంగా నెట్టబడుతున్నాము. ఒకక్షణంవద్ద బయలుదేరితే, ఆ క్షణాన్ని చేరుకోలేము; అది అనారాధ్యంగా భూతకాలంలోనికి మాయం కావలసిందే. అయితే, ఆకాశానికి కాలానికి ఇంత వ్యత్యాసమున్నప్పటికి, ఆ రెండింటిని ఒకే కొలబద్దతో కొలవలేనప్పటికి, జగత్తులో భౌతికసంఘటలను వివరించడానికి కాలాన్ని నాలవ పరిమాణంగా ఉపయోగించగలమని గుర్తించాలి.

"అది సులభంగాదు. కాని, ఈ క్రొత్త దృక్పథంలో మూడు పరిమాణాల సామాన్యఘనం కాలంలో కూడ వ్యాప్తమైయున్న ఘనమౌతుంది. దాని నొక ఉదాహరణ మూలంగా బోధపరచుకోవచ్చును. ఒకే పొడవు కలిగి సాపుగానున్న 12 పుడకలను కట్టి ఏప్రిల్ 1 వ తేదీని ఒక ఘనాన్ని నిర్మించేమనుకొందాము,(చిత్రం 6.)ఒక్క నెలపోయిన తరువాత, మే 1 వ తేదీని పుడకలను విప్పి ఘనాన్ని నాశనం చేసేమనుకొందాము. ఘనానికిగల 8 కోణబిందువులు ఒక నెలపాటు కాలపరిమాణంలో వ్యాపిస్తాయి. అంటే, కాలదిశలో ఈ 8 కోణబిందువులు 8 గీతలను గీసినట్లు భావించాలి. ఆ వ్యాప్తి నూహించడానికి ప్రతి కోణబిందువుకి ఒక రోజువారీ కేలండరు తగి



చిత్రం. 6.

లించి, ఒక్కొక్క రోజు గతించగానే ఒక్కొక్క కాగితాన్ని తిప్పుతున్నా మనుకోవచ్చు. ఆ విధంగా నాల్గు పరిమాణాల చిత్రం లభిస్తుంది. అదే నాల్గు పరిమాణాల ఘనం యొక్క చిత్రం. ఆ చిత్రంలో ఘనానికి 1-4-54 నాడు దాని పొడవు, వెడల్పు ఎత్తులను నిరూపించు 12 అంచులున్నాయి. ఒక నెలపోయిన పిమ్మట 12 అంచులూ ఉన్నాయి ఈ నెలపాటూ కాలంలో వ్యాపిస్తూండగా, కోణబిందువులు కాలంలో గీసిన 8 కాలపు అంచులున్నాయి. మొత్తంపై, నాల్గు పరిమాణాల ఘనంయొక్క అంచులు 32 అని లెక్క వచ్చింది. అల్లే, 1-4-54 న 8 కోణబిందువులు 1-5-54 న 8 కోణబిందువులు; మొత్తం 16 కోణ బిందువులున్నాయి.

"ఈప్రకారంగా ఏ వస్తువుయొక్క నాల్గు పరిమాణాల రూపాన్నైనా ఊహించవచ్చును. అయితే, దానిని మూడు పరిమాణాలలో నిరూపించాలంటే ఒక పరిమాణాన్ని త్యాగం చేయవలసివస్తుంది. చిత్రం 7 లో 'అఆ' కాలపరిమాణాన్ని నిరూపించు అక్షము.




చిత్రం. 7.

ఇ', 'అఉ'లు ఆకాశ పరిమాణాలలో రెండిటిని నిరూపిస్తాయి. రెండు పరిమాణాల ఛాయాజీవియొక్క భౌతికవ్యాప్తిని 'అ ఇ ఉ' తలంలో నిరూపించవచ్చును. కాలగమనంతో ఆ జీవి కాలపరిమాణంలో వ్యాపిస్తాడు. ఆ వ్యాప్తి 'అఆ' దిశలో జరుగుతుంది. ఛాయాజీవియొక్క జీవిత కాలంలో కొద్దిపాటి మాత్రమే చిత్రం 7 లో నిరూపితమైంది. కాని, వాని జీవితకాలం యావత్తు పెద్ద దండంవలె దీర్ఘంగా నుంటుంది. ఆరంభంలో ఈ దండం సన్నగా నుండి, కాలగమనంతో దళసరి ఎక్కువౌతూ, జీవితాంతసమయానికి ఒక ఉరవను పొంది, మరణానంతరం విచ్ఛిన్నమవడానికి ప్రారంభిస్తుంది. నిజానికి ఈ నాల్గు పరిమాణాల దండం అనేకములైన ప్రత్యేకపు పోగులతో ఏర్పడినట్లు భావించాలి. ఛాయాజీవి శరీరంలోని ప్రతికణంవల ఒక్కొక్క పోగు తయారౌతుంది. జీవితకాలంలో ఈ పోగులు చాలవరకు కలిసి ఉంటాయి. జుత్తును, గోళ్ళను కత్తిరించినప్పుడవి రాలిపోతాయి కనుక, ఛాయాజీవి కాలాక్షంలో సాగుతూన్నప్పుడు ఆ రాలిపోయిన కణాలకు సంబంధించిన పోగులు తెగిపోతాయి. జీవి మరణించిన తరువాత వాని దేహం శిథిలమైనప్పటికి ద్రవ్యం అవినాశి కనుక ఈ నాల్గు పరిమాణాల దండంలోని పోగులు చెదిరిపోతాయే కాని, నశించవు.

"ఈ నాల్గు పరిమాణాల కాలాకాశ క్షేత్రగణిత పరిభాషలో ప్రతిక్షణంయొక్క చరిత్రను ఒకరేఖ నిరూపిస్తుంది. దానిని 'ప్రపంచరేఖ' (*World Line*) అంటారు. ఒక వస్తువు అనేకకణాల సముదాయం కాబట్టి దాని చరిత్రను దాని కణముల ప్రపంచ రేఖల సమూహం నిరూపిసుంది. ఆ సమూహాన్ని 'ప్రపంచ పటు' అంటారు.

"ఖగోళమూర్తుల ప్రపంచరేఖలు చిత్రం 8 లో చూపబడ్డాయి. సౌరమండలంలోనున్న సూర్యుని, గ్రహాలను, తోకచుక్కలను విశ్వప్రమాణంలో కణాలుగా భావింపవచ్చును. నిజంగా సూర్యుడు ఆకాశయానం చేస్తున్నప్పటికీ సౌరమండల విషయం యోచించినప్పుడు సూర్యుడు స్థావరంగా నున్నాడని భావింపవచ్చును. సూర్యునిచుట్టు భూమి తిరుగుతూన్న




చిత్రం.

కక్ష్యగల తలాన్ని రెండు అక్షులు గల ఆకాశతలంగా తీసికొని, దానికి లంబదిశలో కాలంయొక్క అక్షను నిరూపించవచ్చును. అట్టి నిరూపణలో, స్థావరంగా నున్న సూర్యుని ప్రపంచరేఖ కాలాక్షానికి సమాంతరంగా నుంటుంది. సూర్యుని చుట్టు వృత్తమార్గంలో భ్రమిస్తూన్న భూమియొక్క ప్రపంచరేఖ, సూర్యుని ప్రపంచరేఖను పెనవేసిన సర్పిలంవలె ఉంటుంది. సూర్యుని చుట్టు దీర్ఘ వృత్తాకారంలో తిరుగు తోకచుక్కయొక్క ప్రపంచరేఖ, సూర్యుని ప్రపంచరేఖచుట్టు సర్పిలంగా నున్నప్పటికి ఒకసారి సూర్యుని సమీపించి మరొకసారి దూరంగా పోయి తిరిగి సమీపిస్తుండడంచేత, ఆ ప్రపంచరేఖలో సౌష్టవం కనిపించదు. భూమియొక్క ప్రపంచరేఖ మాత్రం సూర్యుని ప్రపంచరేఖ చుట్టు సౌష్టవంగా నుంటుంది.

"ఈ విధంగా, నాలుగు పరిమాణాల కాలాకాశక్షేత్ర గణితదృష్ట్యా విశ్వచరిత్ర యావత్తు ఒక్క చిత్రంలో నిరూపింపబడుతుంది. జగదవయవాలైన అణువులు, జీవులు, నక్షత్రాలు మొదలగు వాటి ప్రపంచరేఖల సమ్మేళనంవలన ఆ చిత్రం సిద్ధిస్తుంది."



కథానికః

# పరిస్థితుల వారసులు

శ్రీ వాప్పాల ఫణిదా

అర్ధరాత్రి దాటింది. సిరావానలాంటి చీకటి జల జలమని రాలుతోంది దానికి తోడు మంచు గూడా దట్టంగా పట్టింది. వీధి దీపాలు కునుకుతూ మరణకాంతిని చిమ్ముతున్నాయి. అది మార్కెట్టు ప్రాంతం. అందుచేత, కుళ్ళిపోయిన కూరలు, ఆకులు, ఆ ప్రాంతాన్ని దుర్గంధంలో ముంచెత్తుతున్నాయి. మార్కెట్టుకు పడమటివేపుగా ఒక ఇరుకైన సందు ఉన్నది. పగల్లా ఆ వీధి బావురు మంటుంటుంది. రాత్రి వేళ ఆ వీధికున్న 'రష్' మరి దేనికీ ఉండదు. పగల్లా "మర్యాదస్థులు"గా చెల్లుబాటవుతున్న వాళ్ళామంది, రాత్రివేళల్లో, ఈ వీధుల్లో దర్శన మిస్తుంటారు. వీళ్ళ దృష్టిలో నీతికి కోటుకూ భేదం లేదు; అవసరమైనప్పుడు ఈ రెంటినీ ధరిస్తారు; కావ ల్సినప్పుడు వొంకెకు తగిలించుతారు. కిటికీలనుండి సన్నని సంగీతము, నవ్వులు, పరిమళాలు, బైటికి ప్రవహిస్తు న్నాయి తలలు వంచుకొని, ముసుగులు కప్పుకొని నడిచే జనం తాలూకు పదధ్వనులు ఎక్కువదూరం వినిపించటంలేదు. ఆ జనంలో అన్ని మతాలవారు, అన్ని వర్గాలవారూ ఉన్నారు. అక్కడ మత యుద్ధాలుగానీ, వర్గసంఘర్షణలుగానీ ఉండవు.

అటువంటి వీధిలోనుండి ఒక వ్యక్తి ఆ రాత్రి వేళ మార్కెట్టు ముందుకొచ్చాడు. అక్కడ నిర్మా నుష్యంగా ఉన్నది. మంచు దట్టంగా కురుస్తోంది. చలికి అతని శరీరమంతా బిగుసుకుపోతున్నది. వేడి కోసం రెండు అరచేతులూ గబగబా రుద్దుకొన్నాడు. ఆ చేతులతో కండ్లను కాపుకొన్నాడు. అయినా చలి తగ్గలేదు. దగ్గరగా ఉన్న చెత్త చెదారం పోగు చేశాడు. అగ్గిపెట్టి తీసి ముట్టించాడు. మంచుకు తడి సిన చెత్త 'చుఁయ్' మంటూ మూలిగింది. మరొక సారి ప్రయత్నించాడు. కాని లాభంలేదు. అతను మంచును, చెత్తను, తనను తిట్టుకొన్నాడు. అయినా చెత్తకు అతనిమీద జాలి కలగలేదు. అది వెలగనని భీష్మించింది. ఇంతలోకే ఎదురు అరుగుల మీద ఏదో చప్పుడయింది. అతను కళ్ళు చికిలించి అటు వేపు చూశాడు. ఎవరో ఇటు వేపే వొస్తున్నారు. మొదటివ్యక్తి నడుముదగ్గిర తడుముకొన్నాడు. కత్తి యథాస్థానంలోనే ఉన్నది. ధైర్యంతో అతని కోసం ఎదురుచూస్తున్నాడు. అతను సమీపించిన తరవాత పకాలుమని నవ్వాడు మొదటివాడు.

"హారి! నువ్వురా ఎదవా! నిన్ను చూసి కాస్త బయపడ్డాను. ఒకయేళ్ల పోలీసువాడేమో నని కాస్త పిరికిపడ్డాను తమ్ముడూ" అన్నాడు మొదటివాడు రెండవవ్యక్తి నుద్దేశించి.

"పోలీసుగాడు - ప్రెమ్మనేవుగూడా రాత్రిళ్లు యీగోపుకి రాడు గెల్చా! ఎవ్వడికడినా గాలి వొచ్చాగా ... ... ఒక్క గబ్బుకే తాఁ" అన్నాడు రెండోవాడు "గాఁ" అన్నప్పుడు చిటికె వేసి, ఇద్దరూ నవ్వుకొన్నారు. ఇద్దరూ కలిసి మంట చెయ్యటానికి ప్రయత్నించారు. విధిలేక చెత్త లొంగిపోయింది. "చుఁయ్" మంటూ, పొగలు చిమ్ముతూ మండసాగింది చెత్త. గాలి ఆడటల్లేదు. అందుచేత పొగ అక్కడికక్కడనే చుట్టువేస్తోంది ఆ పొగకు కళ్ళకళ్లు మంటలెత్తి మూసుకుపోతు న్నాయి. ఇద్దరూ ఊది, మంటను పెద్దది చేశారు. 'వ్యాపారం'లోని 'లాభం'లాగా మంట పెద్దది కాసాగింది క్రమక్రమంగా. చీకట్లను ముందుకునెట్టి, మంట వెలుగు నీరసంగా, తడిసిన రోడ్డుమీద ప్రాకు తోంది. ఎర్రనిమంట కాంతికి, వాళ్ళ ముఖాలు భయంకరంగా కనిపించుతున్నాయి. వెలుగు నీడలు అలలులాగున, వాళ్ళమీద కదుల్లాడుతున్నాయి.

"అట్టావున్నావేంభాయ్? ఇయ్యాల ఎక్కడా గిట్టుబాటు కాలేదా యేందిరా? ముకం యేల్లాడే శావ్?" అన్నాడు రెండవవాడు; మొదటివ్యక్తిని చూస్తో.

"ఎవురి ముఖం చూశానో గానీ, ఏమీ గిట్టు బాటు లేదు తమ్ముడూ! లేకపోతే మన మిట్టా ఉంటామో ఉండమో నీకు తెలవదట్రా."

"ఛస్! అట్టా అనబోకు" అన్నాడు రెండవ వాడు. "ఆ మాటన్నావంటే నేను సస్తే గొప్ప కోను; యీల్లు గోరకటమేందిరా ఎర్రి ఎదవ! నీకోస

మని—ఎవడ్రా తలుపులు తెరుసుకొని నిదరపో య్యేది? నిదరబొయ్యేముందు గల అన్నీ బద్దరంగా చూస్కోని పండుకేస్తారు. మరి దొంగతనం సెయ్యాల మంటే సులాగా అనుకొన్నావంట్రా తమ్ముడూ” చెత్తసు కొత్త మంటమీద వేస్తో అన్నాడు.

“మూయ్‌రా నోరు పెంటిముకం నాయాల. ఒరేయ్! నేను నీకంటే బుర్రగలమనిసి నేరా! మొన్న నిండు బస్సులో, చపక్‌మని పర్సు కొట్టే శాను. ముందు సీట్లో ఇనిస్‌పేక్టరు కూసోనిఉన్నాడు. ఆడక్కడ ఉండంగానే మన తడాఖా సూపించాను. రా...నూటయాభై పైచిలుకు గిట్టినాయి అనుమంట ప్పుడు నీలాటి నాయాలైతే, ఆణ్నే యిరగదొక్కుకు సచ్చేవాడు. అన్ని రోజులూ మనియ్ గావురా తమ్ముణ్నా! దానికి అదుష్టం కలిసిరావాల......సత్తే గాని...ఏదీ...ఒక బీడీముక్క యిచ్చుకోమ్మా...”

“ఇయ్యాల నీయింటికి నాయిల్లు ఎదుర్రా... నేనే నిన్న ముసుదా మనుకొంటుంటే ”

“పోయ్యేరా నా విద్దా కోయ్! ఒరే...... నేను అసలు మాదర్‌ఛోద్ లండీకొడుకుని. ఆవిలిస్తే పేగులు లెక్క పెట్టేస్తాను...తియ్‌రా ముందు బీడీ!”

“అమ్మతో డన్నయ్యా! ముండమోపి బీడీ కోసం నే నబద్ధమాడతానంటరా! నువ్వు గామట్టి: పాతిక రూపాయలు రెయిలు టేసన్లో కొట్టేసి, కాపీకి పావలా డబ్బులడిగితే లేవన్నావుగానీ, నేనే అయితే గిరగిరగిర తిప్పి మొకాన యేసేవాణ్ని తెల్సా?”

“సూరన్న కియ్యాల్సిన పద్దాలుగు యియ్యాల్టికి గూడా యియ్యలేదుగానీ, యీడేందో గిరగిరా—గిరగిరా తిప్పి మొఖమ్మీద ఏస్తాడంట! ఏందిరా నీ బొంద నువ్వేసేది?”

“ఆ లొట్టముఖం నాయాల నీతో సెప్పుకు నేడిశాడంటరా! ఆడు నాకు నాలుగుపట్లు బాకీ ఉన్నాడు. నాయి నాకిచ్చి ఆడి డబ్బు ఆణ్నే పట్టు కెలమను ఎవుడిక్కావాలి ఆడి ముండమోపి పద్దాలుగు?”

“అసలు మీ జూదగాళ్లల్లోనే ఉందిలేరా ఈ రోగం. ఒకడికి, యింకోడికి, పడదు. ఎప్పుడూ బాకీలు మీ...నాతోరారా భాయి, బాగుపడుదువు గాని...ఏందిరా అది? అటు సూడు తమ్ముడూ! ఎవర్రా ఆ వొచ్చేది?”

మొదటివాడు మార్కెట్టువేపుకు వేలు చూపిస్తూ అన్నాడు. ఇద్దరూ ఆత్రుతగా అటు వేపు చూశారు. పావునిముషం లోపుగానే మరొక వ్యక్తి తూలు కొంటూ అక్కడికొచ్చాడు.

“ఓరి! నువ్వట్రా ముసిలోడా! రారా ముసి లోడా రా! కాసేపు నువ్వుగూడా సలి కాసుకో” అన్నాడు రెండవవాడు.

“అదుగందుకే బాబూ వత్తావుండాను. సలి —మరీ కొరక్కతింటావుంది బాబూ! నిదరపట్టలేదు.. కడుపులో వొకటే మంట. హరేరాం! హరేరాం” అంటూ మంటకు దగ్గరగా జరిగాడు ముసలోడు. రెండు చేతులు మంటమీదబెట్టి చలి కాపుకొంటు న్నాడు.

“ఏవూరు తాతా మంది” అన్నాడు దొంగ.

“మాది శానాదూరం బాబూ! ఆడ బతకలేక యీదేశి మొచ్చినాను” అన్నాడు ముసలోడు చలికి గజగజ వొణికిపోతూ.

“ఈడ బాగా జరుగుబాటవుతుందా తాతా నీకు?” అన్నాడు దొంగ.

“ఏం సెప్పను బాబూ! పొద్దల్లా ‘హరేరాం హరేరాం’ అంటూ ఆవజాన తిరగతే మాపిటేలకి కొక్కెడు బువ్వ దొరకటం గ్రెలయం; నిన్నా, యియ్యాలా—ఎవురి మొకం సూశానో గానీ బాబూ! ‘యిదిగోరా ముసలాడా!’ అన్న తల్లేలేదు. ఏం సెప్పను బాబూ నా గోడు...అయ్యా! బాబులూ!! ముసిలాణ్ని, వక్క రవ్వ పుగాకు తుంపుంటే పారేయించండి బాబులూ! మీకు పున్నె ముంటాది” అన్నాడు బిచ్చగాడు, ఇద్దరి వేపు ముఖం తిప్పుతో. “పొద్దున్నించీ సిన్న తుంపన్నా యేసుకో లేదు బాబయ్యలూ!”

“నేనూ ఇందాకట్నించి బీడీ కాల్చలేదు ముసలయ్యా” అన్నాడు దొంగ. రెండవ వాడివైపు చెయ్యి చూపిస్తూ.” వాడిదగ్గరకూడా యిల్లె. ఉంటే యిప్పించేవోణ్ని”

“పోన్లే బాబూ! రాముడికి దయకలగలేదు... అయితే—నువ్వేం సేత్తావు నాయ్‌నా?” అన్నాడు ముసలాడు, ఆరిపోతున్న మంటను ఊదుతో.

దొంగ—ఒక క్షణం బిచ్చగాడి ముఖంలోకి చూసి తలదించుకొన్నాడు. తను దొంగతనం చేస్తా నని అతనితో చెప్పటానికి సిగ్గుపడ్డాడు. అతనితో చెప్పినంత మాత్రాన ప్రమాద మేమీలేదని దొంగకు

తెలుసు. అయితేనేం? తను చేస్తున్న పని "నీచ"మైన పని! ఏమూలనో అతని అంతరాత్మ హెచ్చరిస్తోంది గావును. దొంగ పలకలేదు. బిచ్చగాని ప్రశ్నకు జూదరి సమాధానమిచ్చాడు.

"నువ్ జేసే పనేలేతాతా! నువ్వేమో—కానీ, దమ్మిడీ, బువ్వ, అడుక్కుంటావు. మా తమ్ముడేమో..." అన్నాడు జూదరి, కిసుక్కున నవ్వుతో "మా తమ్ముడేమో—మరే—రాత్రిళ్లు వొందలు, వేలు, అడక్కుండా చపాయించేస్తుంటాడు. అంతే తాతా!"

"దొంగతనమా బాబూ!" అన్నాడు బిచ్చగాడు. ఆ మాట విన్నతరవాత కొంచెం వెనక్కు జరిగాడు బిచ్చగాడు.

దొంగముఖం చిన్నబోయింది. తను 'ఫలానా' అని జూదరి చెప్పకుండా ఉన్నట్టైతే బాగుండేదనుకొన్నాడు. అయినా మించిపోయిందిప్పుడు. తనేమీ చెయ

"దొంగతనం పాపం బాబూ! ఆనిక్క నీకేమయినా కోపం రానియ్! ప్రెమాణకంగా సెపుతున్నాను. సచ్చిన తరవాత యమలోకంలో—ఈ పాపకరమనుంతా అనబగించాలి" అన్నాడు బిచ్చగాడు, రెండుచేతులూ జోడించి భగవంతునికి నమస్కరించుతూ.

"నువ్వన్నమాట నిజమే తాతా!" అన్నాడు జూదరి మరి కాస్త చెత్తను మంటమీదికి తోస్తో. "ఇల్లంటిరూ సుకంగా నిదరబోతుంటే—సాటుగా—వాళ్ళ కష్టార్జితం కాజెయ్యటం మోసమే తాతా! ఈ ఎదవనాయాల నేను సెబితే యినిపిచ్చుకోటల్లేదు. నువ్వన్నా సెప్పు తాతా!"

ఈ మాటతో దొంగ కోపం కట్టలుతెగింది. అసలే అతనికి జూదరిమీద, ఇందాకటినుండీ కోపం రేగుతోంది. అవకాశం కోసరం ఎదురుచూస్తున్న అతనికి; జూదరి దొంగతనాన్ని ఎద్దేవాచేయటం ఆసరాగా తీసుకొన్నాడు.

"ఓరి! నోరుముయ్యరా ముండమోపి! మోసం ఉందల్లా—ఆ మాటకొస్తే జూదంలోనే ఉంది." అన్నాడు దొంగ బిచ్చగాడివైపు తిరిగి. "జూదమాట్టం మోసంగాదా తాతా?"

"మోసమే బాబయ్యా మోసమే" అన్నాడు బిచ్చగాడు; కాదంటె ఏమి కొంప మునుగుతుందోనని.

"కాదు" అన్నాడు జూదరి బిగ్గరగా. "రాజాగా ఆడతాం, అదృష్టముంటే గెలుస్తాం. లేకపోతే వోడిపోతాం. ఇందులో ఎవ్వరికీ కన్నా కప్పటం లేదు. మరైతే ఇదెట్టా మోసమవుద్ది?"

"అసలియ్యన్నీ తప్పే బాబులూ! కష్టపడి పని సేసుకోవాలె. దానికి సాటి యీ ప్రపెంచకంలోనే లేదు." అన్నాడు బిచ్చగాడు.

"కష్టపడి నువ్వేం వెనకేశావు తాతా?" అన్నాడు జూదరి, బిచ్చగాని వాదాన్ని సుతరామూ ఒప్పుకోక. "కష్టపడేవాడికి—నిజంగా యివి రోజులు గావు. ఆమాటకొస్తే—జూదమాట్టంమాత్రం కష్టం గాదా తాతా? ఏం మాట్లాడవేం? కష్టం గాదూ?"

"హాయిగా — నీడపట్టున కూకోని ఆడటం కష్టమా? కష్టమంటే నాదే చెప్పాలి. ఎన్ని గొడవలు! ఎన్ని బాదలు!! గోడలు దూకాలి. కన్నాలెయ్యాలి. ఇంట్లో ఎవ్వరూ లేవకుండా సూడాలి. ఇంకే ఎదవనాయాలన్నా కనిపెడుతుండాడేమో గ్రెయించుతుండాలి. ఇంత సేస్తే — ఒకొక్కడి కొంపలో ఎండి పళ్లెమైనా ఉండదు. పైకిమాత్రం—యమ డాబుగా ఉంటారు. నాకష్టంముందు – నీదేపాటి కష్టం? ఏంతాతా నువ్ జెప్పు?" అన్నాడు దొంగ, తాత భుజాన్ని పట్టుకొని కదుపుతో. బిచ్చగాడు బిత్తరపొయ్యాడు ఆ వూపుకు. తను ఏదో వొకటి చెప్పాలి. చెప్పకుండా ఊరుకొనటానికి వీల్లేదు. ఎటు చెప్పటం? బిచ్చగాడు ఈ తికమకతో గుంజుకులాడుతున్నాడు. అదృష్టవశాత్తూ అంతలోకే, కాళ్లీడ్చుకొంటూ వొక స్త్రీ ఆ మంటదగ్గర కొచ్చింది. ముఖం కొంచెం అణగినట్టున్న దా స్త్రీకి. తెల్లటిచీర కట్టుకొన్నది. తల్లో ఏవో పూలు ప్రక్కకు జారాయి. బిచ్చగాడు ఆ స్త్రీనిచూసి కాండ్రించి ఊశాడు.

"ఇక్కడికి గూడా నువ్వొచ్చావే గుడిసేటిదానా! నీముఖంసూస్తే పంచమహాపాతకాలు తగుల్తాయి. హరేరామ, హరేరామ" అన్నాడు బిచ్చగాడు, మంటకు మరికొంచెం దగ్గరగా జరిగి.

"ఏందే యియ్యాల యిట్టావొచ్చావ్? ఈపూట బేరం తగల్లా?" అన్నాడు జూదరి.

"లేదుబావా!" అన్నది స్త్రీ అతని వీపుదగ్గర కొచ్చి. "ఇప్పుడుదాకా చూసిచూసి వొస్తున్నా"

"సిగ్గూ శరమూ లేదంటే నీకు?" అన్నాడు బిచ్చగాడు, స్త్రీవైపు అసహ్యంగా చూస్తూ. "పా

ముందు ఇక్కణ్ణుంచి. ఊఁ పోవేం?" అన్నాడు చేతికర్ర పైకెత్తి.

"ఈ ముసలాణ్ణి ఇక్కడి కెందుకు రానిచ్చావు బావా! వీడి పెళ్ళాం వీణ్ణొదిలి మరోడితో లేచిపోయింది. అప్పట్నుంచీ వీడికి ఆడదంటేనే కోపం!...సరే గాని...పెద్ద బావా! ఒక రూపాయుంటే అప్పియ్యి. సాటు వేసుదాం" అన్నది స్త్రీ.

దొంగ ఫకాలున నవ్వాడు. నవ్వి—"నీ కెంతముంది బావలే పిల్లా?" అన్నాడు. "ఇట్టా కనపడ్డోడకల్లా కక్కుర్తి పడికపోతే ఎవుణ్ణో వొకణ్ణి సేరబట్టుకొని నికరంగా ఉండకపోయ్యావంటే."

అతనిలోని జెలసీభూతం దుర్బలంగా మూలిగింది అటూ.

"ఆ సంగతి నేనూ చెప్పాను భాయీ! ఈ తొత్తు కూతురు యినిపిచ్చుకోలేదు" అన్నాడు జూదరి.

"అన్ గదీ. నువ్ జెప్పింది శానా బాగుండాది బాబూ! అట్టా సేస్తే బగమంతుడు గూడా మెచ్చుతాడు" అన్నాడు బిచ్చగాడు; ఆ స్త్రీ అట్లా బ్రతికటం అతని కిష్టంలేదు. తను రోజూ ఆవిడ చర్యలు చూస్తోనే ఉన్నాడు. ఒక్కొక్క రాత్రికి నలుగురైదుగురు మనుషులు మారటంగూడా తనకి తెలుసు. తన భార్యగూడా తన నొదిలిపెట్టి యిదే వృత్తిలో ఉండేదని విన్నాడు. ఆ కక్షను ఈవిడమీద చూపుతున్నాడు బిచ్చగాడు.

"అసలు మొగోళ్ళంతా గాడిద కొడుకులే! ఆ సూర్యనారాయణ నాదగ్గిరే ఉంటే, నేను మరొక మగాడికి వొంగేదాన్నే కాను. ఉద్యోగం ఉన్నంత కాలం ఉన్నాడు నాతో. తరవాత చెప్పకుండా పోయ్యాడు. ఇంక నేనేం చేసేది? కడుపులోకి అన్న మెట్టా వొచ్చుద్ది? ఆ సంగతి చెప్పు!" అన్నది స్త్రీ తను గూడా మంటదగ్గర కూచుని.

మంట మెల్లిగా మండుతోంది. ఈలోపుగా దొంగ మరికొంత తుక్కు, కాగితంముక్కలు, ఎండు అరిటాకు పీలికలు, చెదారము తెచ్చి కుప్ప వేశాడు.

"హరేరాం—హరేరాం. మంచి శాస్తి చేశాడు రాముడు నీకు. కావల్సిందేలే నీకు. హరేరాం హరేరాం."

"ఈ ముసలాడి సనుగు లేమిటి? పెదబావా!" అన్నది స్త్రీ "వీణ్ణి వెళ్లగొట్టు. ఎప్పుడూ కుక్కలాగా వాగుతుంటాడు...సరే గాని.. నువ్వన్నా ఒక రూపాయుంటే యియ్యి...రేపు అన్నాని లేదు. రెండు రోజుల్లో ఇస్తా మళ్లా. ఏం బావా?"

"ఈపూట బీడీముక్కకు టికాణా లేదు నా దగ్గిర" అన్నాడు జూదరి.

"మనందర పనీ వొకటిగానే ఉంది. చెయ్యరాని పనులు చేస్తున్నాం. అయినా పొట్ట గడవట్లేదు. ఛి ఛి! అసలు మన బతుకులే పాడుబతుకులు. మన జన్మమే ముదష్టపు జన్మ" అన్నది స్త్రీ.

"అద్ గదీ! సెయ్యరానియి సెయ్యబట్టే రామసెంద్రుడు మన కీగతి రాశాడు. ఏ జలమలోనో మనం సేసుకొన్న పాపకరమం యిది. ఇప్పు డనుబగిస్తున్నాం—హరే రామ హరే రామ."

మంట పూర్తిగా ఆరిపోయింది. ఎవ్వరూ తిరిగి దాన్ని రగిలించే ఉద్దేశ్యంలో లేరు. మంచు ఇంకా పడుతూనే ఉంది. నలుగురూ, కాళ్లు ముణుచుకొని, చేతులు మోకాళ్లమీద పెట్టుకొని మండి ఆరిన కుప్ప కేసి చూస్తున్నారు. ఎవ్వరూ పలకటంలేదు. సన్నని గాలికి, కాలి మసిఅయిన కుప్ప, మెల్లిగా కదులుతున్నది. దూరంగా—పోలీసు బూట్లచప్పుడు 'టకా—టకీ' మని వినిపించుతోంది. ఎక్కడో కుక్క మొరుగుడు, గాలికూత. వాతావరణం గంభీరంగా ఉన్నది.

ఆ గంభీరతను భంగపరుస్తో, ఏదో అడుగుల చప్పుడు క్రమంగా దగ్గరవసాగింది. నలుగురూ అటుకేసి చూశారు. ఒక వ్యక్తి వాళ్లవేపే వొస్తున్నాడు. మరి కొస్త చెత్తను వేసి, దొంగ; మళ్ళా మంట చేశాడు.

"బాబ్బాబు! నీకు పున్నెముంటాది. కొస్త పుగాకుముక్క నోట్లోకి యిప్పించు బాబూ!" అన్నాడు బిచ్చగాడు కొత్తగా వొచ్చిన వ్యక్తిని.

దొంగ అతని వాలకాన్ని జాగ్రత్తగా కనిపెడుతున్నాడు. జేబును పరిశీలనగా చూస్తున్నాడు. స్త్రీ అతన్ని అలవాటు గనక—ఆకర్షించ చూస్తున్నది. అతనుమాత్రం వాళ్లందరనూ పరిశీలనగా చూస్తున్నాడు. అతని ధోరణికి వాళ్లు కొంచెం బిడియపడ్డారు. అత నెవరో అధికారేమో నని వాళ్ళ అనుమానం. తప్పుకోవటం మంచిదేమో ననుకొంటున్నారు.

ఇంతలో—

"ఎందుకు నావైపలా చూస్తారు?" అన్నాడా యువకుడు: "నేనూ మీలాంటిమనిషినే! కొంచెం నాక్కూడా చోటివ్వండి. చలి కాచుకొంటాను"

"అయితే నువ్వు దొంగతనం సేత్తావా, జూదమాడతావా బాబూ!" అన్నాడు బిచ్చగాడు.

యువకుడు మెల్లగా నవ్వాడు.

నవ్వి—

"నేనలాంటివేమీ చెయ్యను తాతా! కాని చేసేవాళ్ళందరూ నాకు స్నేహితులే" అన్నాడు.

"అయితే శమాత్తాలను బెట్టి సేపించుతుంటావా బాబూ! హరేరామ హరేరామ. ఇయ్యాల ఎసుమంటి వోళ్ళపాలబడ్డాను!!" అన్నాడు బిచ్చగాడు.

"ఇదుగో! నామాట వినుతాతా!" అన్నాడు యువకుడు—"దొంగతనం, జూదం, మోసం... నిజంగా తప్పులు గావు. ఈ చేస్తున్నవాళ్ళెందరూ, కావాలని చెయ్యటంలేదు. వాళ్ళ స్థితిగతులే వాళ్ళనట్లా తయారుచేశాయి పరిస్థితులు బాగుపడినరోజున, చాలామందికంటే వాళ్ళు మంచిగా బ్రతుకుతారు."

ఒక్క బిచ్చగాడు తప్ప, మిగిలిన వారందరు ఒకరినొకరు చూసుకొన్నారు.

"ఏమోగానీ బాబూ!" బిచ్చగాడన్నాడు. "సరీరం పడుసుకు బతికేదిమాత్రం—ఇక జనములో బాగుపడదు." స్త్రీ వేపు ఊగాడు.

"పొరబాటు పడుతున్నావు తాతా!" అన్నాడా యువకుడు నవ్వుతో. "బాగుచేస్తే—ప్రపంచంలో బాగుపడనిదంటూ ఏమీ లేదు. ఈ కిటుకు చాలామందికి తెలీదు. అంతిదాకా ఎందుకు? ఇటీవలిదాకా నాకే నమ్మకంలేదు. కానీ ఆలోచిస్తే మొదట నేననుకొన్నది 'తప్పు' అని తేలింది. మా సంఘంలో అటువంటివాళ్ళను—ఎందరినో చేర్పించాము. వాళ్ళకు తిండీ, గుడ్డా, యిల్లు, ఊరికే యిచ్చాము. చేతిపనులు నేర్పించాము. ఇప్పుడు వాళ్ళు చాలామంచిగా బ్రతుకుతున్నారు. కొందరికి పెళ్ళిళ్ళు చేశాము. చక్కగా కాపరాలు చేసుకొంటున్నారు. అంతదూరమెందుకు? నీసంగతేమిటో చెప్పు. నువ్వు—ఇక్కడేంచేస్తుంటావు తాతా?"

"బిచ్చమడుక్కొంటాను బాబయ్యా!" అన్నాడు బిచ్చగాడు.

"నీకు తిండి, గుడ్డ, కొంప, ఉన్నయ్యనుకో. ఇంకా నువ్వు బిచ్చమెత్తుకొంటావా?"

"ఛూత్తి...ఈ పాడుపని ఇంకెందుకు సేస్తాను బాబయ్యా?" అన్నాడు బిచ్చగాడు "అయిలేకనేగా బాబయ్యా ఈ తిప్పలు."

"చెయ్యవుగదా! అట్లాగే దొంగలు, వ్యభిచారం చేసేవాళ్ళు, తాగుబోతులు, జూదవాళ్ళు...ఒకటేమిటి? ఈ రకాలవాళ్ళందరూ ఏవో కొన్ని లోపాలుంటే ఈ వృత్తుల్లోకి దిగారు. ఆ లోపాలేమిటో సరిచేస్తే ఇంకా వాళ్ళెందుకా పాడుపన్లు చేస్తారు?... ఇదిగో! నేనా పనిమీదనే ఈ వూరొచ్చాను. ఇంకా రెండురోజులిక్కడ ఉంటాను. నీకు తెలిసినవాళ్ళల్లో ఇటువంటవాళ్ళెక్కడున్నావుంటే నాకు చెప్పు తాతా! నేను సంఘంలోకి తీసుకొంటాను" అన్నాడా యువకుడు అందరినీ చూస్తూ.

"దొంగలకు పెళ్ళాంబిడ్డలుంటే—వాళ్ళకు గూడా పనులు సూపించుతారంటండీ" అన్నాడు దొంగ.

యువకుడు నవ్వాడు.

"ఆఁ... వాళ్ళకుగూడా ఏదో ఆదెరువు చూపెడతాం. మా సంఘం చేస్తున్న పనే అది."

"దీనివల్ల మీకేం లాభం ఉంటదండీ!" అన్నాడు జూదరి.

"మాకు వేరే లాభా లక్కర్లేదు. మనిషి—మనిషిగా జీవించటమే మాకు కావలసిందల్లా."

"మీ రెక్కడుంటారో సెప్పండి బాబయ్యా! నేను మీపాదాలదగ్గర బతుకుతాను. ఇంకా నేను ముష్టి అడుక్కోలేను బాబయ్యా! ఇయ్యాల పొద్దున్నించీ—ఒక్కడు బువ్వ తినలేదు బాబయ్యా!" అన్నాడు బిచ్చగాడు యువకునికి నమస్కారం చేస్తూ.

"నాకొక చోటనే దేమీలేదు తాతా! అవసరమయితే ఈరాత్రి నీదగ్గిరే ఉండిపోతాను...మాడు తాతా! మీ రెవ్వరు?" అన్నాడు ప్రక్కవారిని చూస్తూ.

"అతి సుపయోగించిన గౌరవవాచకానికి దొంగ, జూదరు లిద్దరూ రిచ్చపడ్డారు. తమ జీవితాలను అతనితో చెప్పుకొన్నారు. తమకీ వృత్తులంటే యిష్టం లేనేలేదన్నారు. ఇక గతిలేక చేస్తున్నామన్నారు. ఆమాత్రం అంపదొరికితే 'నీతి'గా బ్రతుకుతామన్నారు. తమ జీవితాల్లోని నీచత్వమును ఎత్తి చూపించేసరికి—వారిలో—ఏ మూలనో అణగివున్న మానవత్వం సిగ్గుపడ్డది. తాము చేసిన పనికి పశ్చాత్తాపపడ్డారు. వాళ్ళ కతను అభయప్రదానం చేశాడు.

"మీ రెవరు?" అన్నా డతను స్త్రీ నుద్దేశించి.

"దాం దొక దుఃఖనష్టపు బతుకు బాబూ! పెతి వాడికి ఒళ్లప్పగించి బతుకుతుంటది, సూడండి. ఇరవై దాటలేదింకా. అప్పుడే పీసు పీసు అయింది. దాన్ని గూడా తమ సంగంలో సేర్చుకోండి బాబయ్యా!" అన్నాడు రంగ.

"పాపం!" అని నిట్టూర్చాడు యువకుడు.

దూరంనుండి మూడు గంటలు, గాలిలో తేలుతూ వినిపించాయి.

"మిమ్మల్ని కలుసుకొన్నందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. మీబోటివారంతా పూర్తిగా సహాయపడితేనే కాని, మా సంఘం మంచిస్థితికి రాదు. ఈ సంగతి—ఇంకా—మిగతా వాళ్ళకు గూడా చెప్పండి. చెప్పి వాళ్ళనుగూడా మన సంఘంలో చేర్పించండి—పోతే—ఇదిగో! చరిత్ర యేమిటో కనుక్కోవాలి. అందుచేత నే నీ రాత్రి వీరిదగ్గరుంటాను" అన్నాడు స్త్రీని చూపుతూ యువకుడు. "ఉదయం—మీరు నన్నక్కడ కలుసుకోండి. వెళ్ళిరండి. నమస్కారం."

"చిత్తం -చిత్తం" అన్నా రందరూ.
వాళ్ళిద్దరూ బయలుదేరారు.
దోవలో—

"మీ రెక్కడుంటున్నారండీ" అన్నాడా యువకుడు.

ఆమె చేతులతో ముఖాన్ని కప్పుకొని వెక్కి వెక్కి పడ్డది.

"ఏడవకండి. ఏడ్చి మీరు సాధించే దేమీ లేదు. గతించినదాన్ని తలుచుకొని మనసు చెడగొట్టుకోకండి. న్యాయానికి, నువ్వేమి తప్పు చేశావు? దరిద్రం నిన్నా పనికి నెట్టింది. నువ్వెవరినీ మోసం చెయ్యలేదు. గతిలేక నిన్ను నువ్వు అమ్ముకొన్నావు. తప్పు లేదు. నీది తప్పని దూషించే వేలాది జనంలో, ఏ ఒక్కడు నిన్నాదుకొన్నా — నువ్వీ వృత్తిని చేసి ఉండవు......ఇందులో నీ తప్పేమీ లేదు. నువ్వు విచారించబోకు...చూడు...అలా ఏడవబోకు. పరిష్కారం నేను చెబుతాను" అన్నాడు యువకుడు. "మీ రెక్కడుంటున్నారు?"

"రండి పోదాం" అన్న దావిడ ఏడుపు దిగమింగుకొని.

ఇద్దరూ ప్రక్కవీధిలో పడ్డారు. ఇళ్ళలో నుండి యింకా, నవ్వులు, సంగీతాలు, వినిపించుతూనే ఉన్నాయి. కొందరు ముసుగులు కప్పుకొని చరచరా బైటికి వెడుతున్నారు. మరికొందరు వీధుల్లో నిలబడి బేరాలాడుతున్నారు. అంతా నిశ్శబ్దంగా జరిగిపోతోంది. వీళ్లను గమనించినవారే లేరు. పోయిపోయి, వీధిచివర మరొక సందులో ప్రవేశించారు. ఆ మూలమేడమీదిగది తాళం తీసింది స్త్రీ. అదొక చిన్నసైజు గుహ. ఒక్కటే మంచం ఉన్నది. మంచం క్రింద కుండలు, బట్లు ఉన్నాయి. గూట్లో నూనె సీసా, దువ్వెన, అద్దం వగైరాలున్నాయి. గోడలనిండా తమలపాకుల ఉమ్మిచారలున్నాయి.

"నెలకు పదకొండు రూపాయల అద్దె యివ్వాలండీ దీనికి. తిన్నా, తినకపోయినా తప్పదు. ఒక్కరోజు ఆలస్యమయితే మార్వా కోడు. ఊళ్లో—మాబోట్లోళ్ళకు యిల్లివ్వరు" అన్న దావిడ.

"ఎంత ఘోరంగా బ్రతుకుతున్నావు?" అన్నా డతను భారంగా.

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం. బైట ఏదో అడుగుల చప్పుడు, వాకిలిదాకా వొచ్చి ఆగింది. అతను చెవులు రిక్కించాడు. తలుపు తట్టిన చప్పుడు. ఆవెంటనే "కాళీ ఉందా?" అన్న ప్రశ్న.

"లేదు" అన్న దావిడ కిటికీదగ్గరకొచ్చి.

"ఏమిటది?" అన్నా డతను ఇదేమిటో తెలియక.

"పోనీండి...ఇంక నానోటిమీదుగా ఏమి చెప్పిస్తారు? పాత అలవాటు ప్రకారం వచ్చాడు" అన్న దావిడ సిగ్గుపడుతూ. "ఇంతకు సిద్ధపడ్డా పొట్ట గడవదండీ! ఇవ్వాళ పస్తుపడుకొన్నాను"

అతని ముఖం వికారంగా మారిపోయింది. హతాశుడుగా దిగజారి పొయ్యాడు. చిరుచెమటపోసింది. పావునిమిషం ఆలోచించాడు. తర్వాత ఘరాలున లేచాడు.

లేచి-

"ఉండు...ఇప్పుడే వస్తాను..." అని చెప్పులు తొడుగుకోబోయాడు.

"ఎక్కడికండీ?"

"నీ కేమన్నా తినేందుకు తెస్తాను. నన్ను వెళ్ళనివ్వు...నువ్విలా తిండిలేకుండా ఉంటే నన్ను చూస్తూ ఊరుకోమంటావా? ఇప్పుడే...పావుగంటలోగా వొచ్చేస్తాను. నాదగ్గర డబ్బు ఉన్నది..."

"ఈ అపరాత్రప్పుడు ఎక్కడా కొట్లుండవు. అయినా ఇట్లా పస్తులుండటం నా కలవాటైంది.

డబ్బులేక కాదు నేను వస్తున్నది. నా దగ్గిరా ఉంది డబ్బు" అన్నదామె గూట్లో ఉన్న డబ్బీ మూత తీసి చూపిస్తూ." ఇవిగో! చూడండి. ఇందులో పది రూపాయలున్నాయి."

"అయితే మరెందుకు అన్నం తినలేదూ?"

వ్వాలి. ఇవ్వకపోతే ఇల్లు వొదిలి పెట్టాలి. పదకొండు రూపాయలకుగాను, పది రూపాయలు పోగుచేశాను. ఇంకా ఇందులో తిండి కోసం ఖర్చుపెడితే పెట్టె ఇవ్వను అదె?" అన్నదామె తిరిగి డబ్బీని గూట్లోకి గిరవాటేసి.

"ఎటువంటి కష్టాలనుభవిస్తున్నావు నువ్వు." అన్నాడతను తాపీగా మంచంమీద నడుంవాల్చి. "రేపటితో నీ బాధలన్నీ విచ్చిపోతాయి. ఈ మురికి గదిలో, ఈ పరిస్థితులమధ్య ఉండటానికి ఇదే ఆఖరు రాత్రి. రేపు వేళకు—హాయిగా—మా సంఘం గదిలో ఉంటావు. తరవాత—ఎవరో ఒక మంచివాణ్ణి చూసి పెళ్లి చేస్తాము. నీ జీవితం సుఖంగా నెళ్లిమారిపోతుంది"

"నే నిక పెళ్లి చేసుకోనండీ! పెళ్లంటే నే నాకు డోకు పుడుతోంది. నే నిలాగే—ఏదో కష్టం చేసుకొని బతుకుతాను" అన్నదామె బెడ్ లైటు అద్దంమీద వాలుతున్న పురుగుల్ని చూస్తూ.

"ఏమీ?" అన్నాడతను, మంచంనుంచి ఒంటి చేతిమీద లేచి, వారగా కూచుని.

"ఒద్దులెండి. ఒకసారి చేసుకొని ఏ మనుభవించాను గనక రెండవసారి చేసుకోమంటారు?"

"పోనీ...చాలా మంచివాడు...మాటవరసకు ...నేను చేసుకొంటా' నంటా ననుకో! నన్ను గూడా కాదంటావా?" అన్నాడతను ఆమెవైపు పరీక్షగా చూస్తూ.

ఆమెగూడా అతనివైపు—క్షణకాలం రిచ్చపడి చూసింది.

"మీబోటి గొప్పవారికి నేను తగినదాన్ని కాదండి! మీ పాదాల దుమ్ముమాత్రమైనా చేయను. నన్ను మీ రట్లా అనబోకండి" అని ఆమె వంగి అతని పాదాలు పట్టుకోనబోయింది. అత నామె భుజాలు పట్టుకొని లేవదీశాడు.

"అట్లా అనకు. నీవంటి అనాథలను ఉద్ధరించటంలోనే పుణ్యమున్నది. భగవంతుడు గూడా ఆశీర్వదిస్తాడు. నీకేమీ అభ్యంతరం లేకపోతే—మా సంఘానికి వెళ్లంగానే—మనం—పెండ్లి చేసుకొందాము. మంచిని గౌరవించటంలో అబ్బురం లేదు. చెడ్డను మంచిస్థితికి తేవటమే గొప్పపని. ఏమంటావు? నీ కిష్టమే గదూ?" అతనామె చుబుకాన్ని పుణుకుతూ అడిగాడు.

ఆమె క్షణకాలం అతని ముఖంలోకి చూసి తల దించుకొన్నది. అతనామెను దగ్గరగా తీసుకొని ముద్దు పెట్టుకొన్నాడు.

ఆరాత్రి ఆమెకు సరిగ్గా నిద్రపట్టలేదు. తియ్యని ఆలోచనలలో తేలిపోయింది. ఇదంతా నిజమా? స్వప్నమా? అనే సందేహంతో గిజగిజలాడింది. స్వప్నమేమోనని, తిరిగి మెలకువ రాగానే, ఈ మధురస్వప్నం చెదిరిపోతుందని విచారించింది. తగ్గించిన దీపాన్ని హెచ్చించి, అతన్ని చూసింది. పక్కనే అతను నిశ్చింతగా నిద్ర పోతున్నాడు. అతని పచ్చని ముఖంనిండా చిరుచెమట పోసింది. దీపపు వెలుగుకు చెమట బిందువులు మిలమిలమంటున్నాయి. జుట్టురేగి, కొద్దిగా, నుదికంటిమీద పడ్డది. చొక్కా గుండీలు ఊడాయి. ఎదురురొమ్ము విశాలంగా, ఎగసిపడుతున్నది. అతనిమీద అనంతమైన "ప్రేమ" కలిగిందామెకు. ఇతను మానవమాత్రుడు కాడనుకొన్నది. అగాధంలోనుండి తనను పైకితీసి, స్వర్గానికి పంపనున్న నవజీవనప్రదాత అనుకొన్నది...ఇంతకంటే — ఎప్పుడైతేమటుకు— కోరవలసిన దేముంటుంది?

చొక్కా గుండీలు సర్దింది. జుట్టు మెల్లగా పైకి నెట్టింది. దీపాన్ని ! అతని ముఖం దాపుకు తెచ్చి, తదేకంగా చూసింది. ఆమెకు దుఃఖం పొర్లుకొచ్చింది. తనఏడుపుకు అతను లేస్తాడేమో నని బలవంతాన ఏడుపు దిగమింగుకొన్నది. దీపాన్ని తగ్గించింది. అతనికి వొత్తిడి తగలకుండా, మెత్తగా ముద్దు పెట్టుకొంది. అతని ప్రక్కనే ఒదిగి పడుకొని కళ్ళు మూసింది. కానీ ఆమెకు నిద్దరరాలేదు. ఆమె ఆత్మ సాగరం ఆనందంలో తేలియాడసాగింది. దివ్య దీధితులతో పెంపెసలారే సుందర భవిష్యత్తు, సహస్ర హస్తాలతో తన నాహ్వానిస్తున్నట్లు భావించింది. రేపటినుండీ ఆమెబాటలలో ముళ్లడొంకలు, చీకటి పొదలు ఉండవు. రేపటినుండీ ఆమె జీవితంలో 'చేదు' ఉండదు. దుర్గంధభూయిష్టమైన, నికృష్ట ఘోర జీవితానికి ఈరాత్రి భరతవాక్యం. నవనవోన్మేషమైన మధురజీవితానికి ఈరాత్రి నాందిప్రస్తావన. తన్ను తనలాంటి వేలాది నిర్భాగ్యులను ఉద్ధరించటానికి భగ

వంతుడే ఇల్లా వొచ్చిఉంటాడు. తను అతన్ని చేసుకొంటుంది. చేసుకొని—తనలాగా నీచాతినీచంగా జీవిస్తున్న వారిని ఉద్ధరిస్తుంది...

ఆ రాత్రి ఆమెకు సరిగ్గా నిద్రపట్టలేదు. జడివానలా ముసురుకొనే రకరకాల ఆలోచనల తాకిడికామె ఉక్కిరిబిక్కిరయింది. ఎప్పటికో గానీ—కసింత కునుకుపట్టలేదు. తీరా లేచి చూసేసరికి భళ్ళున తెల్లవారింది. తియ్యనికలలబరువుతో వాలిన రెప్పలను మెల్లగా విచ్చి, తన నవజీవనప్రదాతను చూసింది. కానీ అతను ప్రక్కమీద లేడు. కళ్ళు నులుముకొని, చివాలున లేచింది. గది నాలుగు మూలలూ చూసింది. కనిపించలేదు. బహుశః కాఫీకి వెళ్ళిఉండొచ్చు. రాత్రి—తనేమీ తినలేదు గనుక, ఏదైనా తీసుకొచ్చేందుకు వెళ్ళిఉండొచ్చు. లేదా తతిమ్మావారిని కలుసుకొనేందుకు వెళ్ళాడేమో? ఇదమిత్థమని తనేమీ నిర్ణయించలేకపోతున్నది. మరి కొంచెంసేపటికల్లా అతనొస్తాడు. అప్పటి కేదన్నా ఫలహారం చేసి సిద్ధంగా ఉండాలి. అందుకోసం ఆమె గూటిదగ్గిర కెళ్ళింది. రాత్రి—తను పదిరూపాయలు దాచిన డబ్బామాత్రం, ఖాళీగా—ఆమెవేపు బావురుమని చూసింది.

"భగవంతుడా!" అన్నదామె నిలువునా కూలబడి.

అప్పటికి భగవంతుడింకా నిద్రలేవలేదు.



# జ్ఞానసాధన : ప్రాచీనుల ప్రమాణములు

శ్రీ గరికిపాటి సత్యనారాయణ

మానవుడు మాతృగర్భమున జనియించిన దాది మరణించువరకు తనకు వెలిగానుండు ప్రపంచ స్వభావమునుగూర్చి తెలిసికొనవలెనను నిరంతరాభిలాష శైశవావస్థలో నంకురితమై, బాల్యావస్థలో కోరకితమై, యౌవనములో పల్లవితమై, క్రమముగా వయఃపరిణామము నొందినకొలది కుసుమితమై యలరారును. అతని యభీష్టమును సిద్ధింపజేయుటకో యనునట్లు, అతని దేహముననే తత్సాధనము లమర్పబడియున్నవి. అవి మానవుని ఇంద్రియములు. ఇంద్రియములకు గోచరమగు వానిని ఇంద్రియార్థము లందురు. కేవలము పై రెండింటికిని పరస్పర సంనికర్షము జరిగననే చాలదు. మానవుని ఆత్మ అతని మనస్సుతో సంయోజనము నొందవలెను. మనస్సు ఇంద్రియముతోడను, ఇంద్రియము ఇంద్రియార్థముతోడను సంయుక్తముకావలెను. ఈ ప్రక్రియ యంతయు క్రమముగా జరిగినపుడే మానవునకు, బాహిరముగానుండు జగత్తులోని వస్తువులనుగూర్చి యథార్థానుభవము జరుగును. అట్లుగానిచో ఇంద్రియార్థమునుగూర్చి సరియైన యనుభవము మానవునకు కలుగదు. అన్యాసక్త మనస్కుడైనచో నెదుట వేయి సంబరములు గావించినను ఆనందింపలేడు. గంధర్వగానము విన్నను మురిసిపోలేడు. అప్సరః కన్యా సంస్పర్శము కలిగినను సుఖానుభూతి నొందడు. షడ్రసోపేతములగు పదార్థములు పాత్రములోనున్నను, తనివిదీర, చవులూర, నారగింపలేడు. పారిజాత ప్రసూనామోదమైనను నాసారంధ్రమునకు తృప్తినీయజాలదు. ఆత్మమనస్సంయోగము జరిగినపుడే ఇంద్రియార్థముల కనుగుణమైన అనుభూతి మానవుని ఎడదలో కల్గుచున్నది. ఈ యథార్థానుభవమునే నైయాయికుల పరిభాషలో 'ప్రమ'యని వ్యవహరింతురు. ఇట్టి ప్రమ కల్గుటకు అత్యావశ్యకములై, అనితర సాధారణములైన కారణములను ప్రమాణములని యందురు. దేని సహాయముచేత కార్యోత్పాదనము సంపూర్ణమగునో, ఏ కారణము మిగిలిన కార్యజాతమునకు సాధారణము కాజాలదో దానినే అసాధారణ కారణమనిగాని కరణమనిగాని నైయాయికులువ్యవహరింతురు. ఘటమను కార్యమునకు మృత్తు అసాధారణ కారణము. మృత్తువలననే ఘటము తయారగుచున్నది. ఆ మృత్తు లోహమయ పాత్రాదికములగు మిగిలిన కార్యజాతమునకు సాధారణ కారణముకాదు. అది ఒక ఘటమునకే కారణమగుచున్నది. అట్లే మానవునకు యథార్థానుభవము కలుగుటకు అనితర సాధారణములై, అత్యావశ్యములైన కారణములు, ప్రమాణములు, ఇంద్రియములు.

ఇంద్రియములు రెండు విధములు. (1) కర్మేంద్రియములు (2) జ్ఞానేంద్రియములు. అందు కర్మేంద్రియములు వాక్పాణి పాదపాయూపస్థలు. కర్మేంద్రియ ద్వారమున మానవునకు సాక్షాత్తు యథార్థానుభవము జరుగదు. వానికి జ్ఞానేంద్రియముల సహాయమావశ్యకము. జ్ఞానేంద్రియములే మానవునకు అన్య సాధనముల యవసరము లేకయే అనుభవము నొసంగుచున్నవి.

ఇంద్రియేంద్రియార్థ సంయోగజన్య యథార్థానుభవము నాశ్రయించిన ప్రమాణములు నాలుగు. అవి ప్రత్యక్షానుమానోపమాన శబ్దములు. పంచజ్ఞానేంద్రియములకును ఇంద్రియార్థములకును సన్నికర్షమేర్పడగా సముత్పన్నమైన జ్ఞానమును ప్రత్యక్షజ్ఞానమందురు. త్వక్చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములే మానవుని పంచజ్ఞానేంద్రియములు. అందు త్వగింద్రియము స్పర్శానుభూతికి స్థానము. మలయానిలము మందగతి వీచునపుడు మానవుని త్వగింద్రియము వాయుశైత్యము ననుభవించును. అట్లే ప్రచండ గ్రీష్మములోని వాయువులు మానవునకు ఔష్ణ్యానుభూతి నొసంగును. రెండవ జ్ఞానేంద్రియము కన్ను, మానవుడు నిదుర మేల్కాంచినది మొదలు కనుమూయువరకు నిత్య జాగృతమగు నింద్రియము. ఇది రూపగ్రహణమునకు నేదుగడ. ఏది సుందరమో, ఏది యసుందరమో, ఏది కృష్ణమో, ఏది రక్తమో, దీని ద్వారముననే తెలిసికొనుచున్నాము. మూడవది శ్రవణేంద్రియము. ఇది శబ్దగ్రహణమున కాకరము. ధ్వనులలోని మాధుర్యమును గాని, అతద్గుణమును గాని దీని మూలమున నెరుంగుచున్నాము. మానవుని వాగ్వ్యవహారమును ఈ ఇంద్రియమే సుసాధ్యము చేయుచున్నది. నాల్గవది జిహ్వ. ఇది రుచ్యనుభవమునకు తావలము. ఏది కటువో, ఏది తిక్తమో దీనిమూలమున గ్రహించుచున్నాము. అయిదవ యింద్రియము ఘ్రాణము. ఇది వాసనను గ్రహించు ఇంద్రియము. ఈ పంచ జ్ఞానేంద్రియముల మూలమున, మానవుడు, తనకు సన్నిహితములైన వస్తువులకు సంబంధించిన జ్ఞానమును మాత్రమే పొందగలుగుచున్నాడు. అతి సన్నిహితములైన వస్తువులనుగూర్చిగాని, అతి దూరముననున్న వస్తువులనుగూర్చిగాని తెలిసికొనుటకు అతని ఇంద్రియములశక్తి చాలదు. అనేకకోట్ల మైళ్ళ

దూరమునయున్న సూర్యచంద్రాది గ్రహముల గతులను గమనించుటకు తమ అసాధారణ శేముషీ వైభవము నుపయోగించి సరిక్రొత్త యంత్రములను కనుగొని తద్ద్వారమున తమ మనోరథముల నీడేర్చుకొన గలిగిరి. ఆ యంత్రములైనను మానవునకు ప్రకృతి సిద్ధములగు నింద్రియముల సహాయములేనిదే, నిరుపయోగములు. కావున వానిని పరతః ప్రమాణములుగ నంగీకరింప వలయును.

ప్రత్యక్షమును పురస్కరించుకొని ప్రత్యక్షేతర మగుదాని నూహించుట కుపయుక్తమగు జ్ఞానసాధన మునే అనుమానమందురు. ప్రత్యక్షమగు వస్తువునకు సిద్ధమనియు, ఊహ్యమగు ప్రత్యక్షేతర వస్తువునకు సాధ్యమనియు వాడుక. సిద్ధమునకు సాధ్యమునకు నియత సాహచర్య ముండితీరవలయును. ధూమము ప్రత్యక్ష ప్రమాణ సిద్ధము. తద్ద్వారమున వహ్ని నూహించుట అనుమానము. ధూమమునకును వహ్నికిని ఉండు సాహచర్య నియమమునుబట్టి ధూమమును గాంచగనే వహ్నినే తప్పక మన మూహింపవల యును. ఈ జగత్తంతయు కార్యము. ఇది ప్రత్యక్షము. దీనిద్వారమున ప్రత్యక్షేతరు డగు జగత్కర్త నూహించుట యనుమానము. ఘటమునకును కుంభకారునకును నియతసాహచర్యమున్నట్లు, జగత్తునకును జగత్కర్తకును నియతసాహచర్యమును నిశ్చయించు కొని, ప్రత్యక్షేతరు డగు ఈశ్వరుని ఊహించుట అనుమానప్రమాణమువలన సిద్ధించినది. కార్యద్వార మున కారణమును మానసికముగా అనుమించుట స్వార్థానుమానము. దానిని హేతుబద్ధవాక్యవిన్యాస రూపమున నలువురకు తెలియజేయుట పరార్థాను మానము.

ప్రత్యక్షాశ్రయియైన మూడవ ప్రమాణము ఉప మానము. మానవునకు అతిదూరస్థములగు వస్తువులను గూర్చి జిజ్ఞాసువులకు ప్రతీతి గలుగజేయుటకు ఉప మానమే మానవునకు ఆధారమయ్యెను. మానవునకు ప్రకృతిలో కాన్పించు ప్రతియద్భుతమునూ తానే స్వయముగా చూచి యనుభూతినొందుట దుర్లభము. అందుచే పరిచితమైన వేరొకవస్తువు నుదాహరించి వస్తు స్వరూప మిదమిత్థమను నభిప్రాయమును జిజ్ఞాసువునకు కలిగించుట మూలమున ఉపమానము చరితార్థము నొందుచున్నది. పోల్చువస్తువునకును పోల్చబడెడి వస్తు వునకును అన్నివిధముల సామ్యము లుండ పనిలేదు. రెండింటిలోను ద్రష్ట ఒక ప్రసిద్ధ సాధర్మ్యమును గుర్తించి తద్ద్వారమున నొకదానితో మరియొకదానిని పోల్చుచున్నాడు. గవయ మను అపరిచితమైన జంతు వునుగూర్చి జిజ్ఞాసువునకు ఒక అభిప్రాయము కలుగ జేయవలెనన్న తత్సదృశమగు వేరొక్క జంతువైన గోవు నుదహరింపవలెను. అప్పుడే గవయమన నేమో జిజ్ఞాసువునకు కొంతవైనను తెలియును. బ్రహ్మపదా ర్థము నిర్లిప్తమందురు. వాస్తవమునకు బ్రహ్మపదార్థ మన నేమో మనకు తెలియదు. నిర్లిప్తతయన నేమోగూడ మనలో చాలమందికి సుకరముగా గోచరించుటయరిది. కాని బ్రహ్మము ఆకాశమువలె నిర్లిప్తము అన్నప్పుడు ఆకాశస్వభావము మనకు తెలియును గనుక తత్స్వ భావవాచ్యమగు బ్రహ్మమన నేమో మన మనోదర్పణ మున ప్రతిబింబింప జేసికొనుట సుకరము. ప్రభంజన ములు ప్రబలముగా వీచినను, గ్రీష్మము చండా తపము కాసవచ్చినను, సుగంధభరితములగు కమ్మతెమ్మెరలు వీచినను, శారద సంపూర్ణ చంద్రికలు ప్రకృతి నానందవీచికలలో నోల లాడించినను, అది ఆకాశమున కేమి పట్టినది. తత్తదనుగత స్వస్వ భావములు ఆశ్రయించును ఆకాశ స్వభావములో మార్పునొందింపజాలవు. అట్లే జీవికి కలుగు సంయోగ వియోగములు, మానావమాన ములు, సుఖదుఃఖములు, ద్వంద్వాతీతమగు బ్రహ్మము నంటవు. ప్రత్యక్షముగా ఇంద్రియగోచర మగు నాకాశము నాధారముగా జేసికొని, అతీంద్రియ మైన యోగచక్షుస్సునకు గోచరము బ్రహ్మస్వభావ మును, ఆ రెండింటకిని గల ప్రసిద్ధ సాదృశ్యమగు నిర్లి ప్తతచే గోచరింపజేయుటచే నిది యుపమానము.

నాల్గవ ప్రమాణము ఆప్తవాక్యమందురు. దీనికి మానవుని వైయక్తికమైన అనుభవము మూలము. అనగా ఆ యనుభవము అందరి సొత్తు కాని పక్షమున వ్యక్తి తనకు గలిగిన అనుభూతిని జిజ్ఞాసువునకు కల్ల కపటములు లేక ఎరింగింపజేయును. అట్లు ఎరింగించు వాడు ఆప్తుడు—యథార్థకర్త. ఆప్తుని వాక్యము ఆప్త వాక్యము. ఆప్తవాక్యమునకు వినువ జిజ్ఞాసువునకును జ్ఞాపయితకును గల పరస్పర సంబంధముపై నాధార పడియుండును. అప్పుడీతి దుపయోగించు మాటలలో ఆకాంక్షా యోగ్యతా సన్నిధి—అను గుణత్రయ ములో కొంత లోపించినను, జిజ్ఞాసువు ప్రకరణమును బట్టి సమన్వయము చేసికొనగల్గును. మన భారతీయు లకు వేదము ఆప్తవాక్యము. దీనిని ఆగమ మనియు శాస్త్రమనియు వివిధరీతుల వ్యవహరించిరి. బహు కాలము తీవ్రోపాసనాదికముల వలన గలుగు క్లేశములను సహించి తత్త్వ దర్శనమే జీవితములో ప్రధాన లక్ష్య ముగా జేసికొనిన ఋషుల యనుభవములే గ్రంథరూప మున వెలసినవి. అందుపదిష్టములగు వాక్యములు ఆప్త వాక్యములు. ఆప్తుడు గురువు కావచ్చును.

వీనినేగాక మరి రెండింటిని మీమాంసకులు ప్రమాణములుగా నంగీకరించిరి. అందు మొదటిది అర్థాపత్తి. రెండవది అనుపలబ్ధి. పరస్పరము అసంబద్ధములుగా కనుపించు రెండు వాక్యములకు సామంజస్యమునుగూర్చి అనుక్తమైన అర్థమును సిద్ధింపజేయు జ్ఞానసాధనమును అర్థాపత్తి యందురు. కృష్ణుడు బలసియున్నాడు. కాని పవలు భోజనమే సేయడు. ఈ రెండింటికిని గల అసామంజస్యమును పోగొట్టి వానికి సంగతిని కలుగజేయు వేరొక వాక్యము అనుక్తమైనను ఊహింపవలసియున్నది. కృష్ణుడు పవలు భోజనము సేయకున్నను రాత్రమున కంఠదఘ్నముగ భుజించినాడు. కావున కృష్ణుని పీనత్వము నిరర్థకము గాక సార్థకమైనది.

రెండవ ప్రమాణము అనుపలబ్ధి; అనుపలబ్ధి యనగా ఇంద్రియములకు అనుభూతము కాకుండుట. ఇచ్చట ఘటము లేదు అను ఉదాహరణములో ఘటాభావజ్ఞానము అనుపలబ్ధి ప్రమాణమువలన సిద్ధించినది.

కాని నైయాయికులు వాని స్వతంత్ర ప్రతిపత్తి నంగీకరింపక వాని ననుమాన ప్రమాణములో నంతర్భూతములు గావించిరి. కృష్ణుడు పవలు భోజనము సేయకున్నను, అతని పీనత్వము సిద్ధము. ప్రత్యక్షమైన అతని పీనత్వము నూతగాగొని, అతడు రాత్రిమున భోజనము సేయుటను ఊహించుచున్నాము. భోజనము సేతకును పీనత్వమునకును సాహచర్య నియమమును కారణముగా గొని అట్లు భావించుట కవకాశము గలుగుచున్నది. అట్లే అనుపలబ్ధి కీయబడిన ఉదాహరణములోని ఘటాభావజ్ఞానము ఘటము దృగ్గోచరము కాకుండుటచే ననుమింపబడుచున్నది.

కావున నైయాయికుల ప్రమాణములు ప్రత్యక్షానుమానోపమాన శబ్దములు. అరణ్యకములలో 'స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యం అనుమాన శ్చతుష్టయం' అని నాల్గు ప్రమాణములు ఉదహరింపబడినవి. మనువు మొదలగు స్మృతిస్థాపకులు సయితము ప్రత్యక్షానుమానశబ్దములనే అంగీకరించిరి. బౌద్ధులు ప్రత్యక్షానుమానముల నంగీకరించిరి. వేదాంతులు, మీమాంసకులు, ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి, అను ఆరు ప్రమాణముల నంగీకరించిరి. ఏది ఎట్లున్నను నైయాయికులు మొదటి నాల్గింటిని ప్రమాణములుగా నంగీకరించిరి.

లోకమున నీ నాల్గు ప్రమాణముల వినియోగముచే వ్యవహార నిర్వహణము జరుగుచున్నది. ప్రత్యక్ష ప్రమాణము లేనిచో మానవు డొక్కయడుగైనను జగద్వ్యాపారమున పురోగమింపజాలడు. ప్రత్యక్షమే మిగిలిన ప్రమాణములకు మూలకందము. మానవుడు సత్యసందర్శనార్థమై విజ్ఞానపథమున గావించు గవేషణము ప్రత్యక్షముతో నాగిపోలేదు. అట్లయగుచో మానవవిజ్ఞానము అతి సంకుచితమై యుండెడిది. ప్రత్యక్షేతర ప్రమాణముల ప్రభావము మానవుని మనస్సుపై విశేషముగా ప్రసరించును. చిరంతనమైన సాంగత్యముచే మన మనుదినము వార్తా పత్రికలలో ప్రచురింపబడెడి వార్తలు ప్రత్యక్షముగా అననుభూతములైనను నమ్ముచున్నాము. వార్తాపత్రికలలో సత్యముపై ఆధారపడియుండు వార్తలు శబ్దప్రమాణములు. నేనింతవరకు పచ్చిక బయలులో విహరించునపుడు ఎట్టి మేఘములు కనపడలేదు. లోనికేగి శయనించు కొంత తడవుకు ఉరుముల సవ్వడి విననయ్యెను. ఉరుముల సవ్వడికిని, ఆకాశము మేఘపటలముచే నావరింపబడుటకును నడుమనుండు సాహచర్య నియమజ్ఞానమును బట్టి ఆకాశము మేఘపటల పరివృత మయ్యెనను ప్రతీతి అనుమానజన్యము. అనుమానమెట్లు ప్రత్యక్షాశ్రితమో, ఉపమానమును అట్లే ప్రత్యక్షాశ్రితము. అనుమానము సిద్ధసాధ్యములకు నడుమనుండు సాహచర్య నియమముచే సిద్ధించుచున్నది. ఉపమాన ప్రతీతి, ఉపమానోపమేయముల నడుమనుండు ప్రసిద్ధ సాధర్మ్యజ్ఞానముచే సిద్ధించుచున్నది. ఉపమాన ప్రమాణ ప్రభావము లోకమున విశేషముగ గలదు. వస్తుతః అది వాదమును సమర్థింప నశక్యమయ్యెను, కేవలము ఆత్మానుభవమును పరులకు వెల్లడించుట కుపయుక్తమగు జ్ఞానసాధనమని మాత్రమే అని విజ్ఞానులు తలంచినను లోకమున దాని ప్రభావము విశేషముగ గలదు.

కవులు తమ అభిప్రాయములను లోకముపై హత్తుకొనజేయుటకు దీనినే సాధనముగా గైకొనిరి. శబ్దప్రమాణము తత్ప్రయోక్త అధికార విశేషముపై నాధారపడియుండును. చమూపతి ఆజ్ఞ ప్రకరణ ప్రాబల్యమునుబట్టి యోధులు యుద్ధమునకు సిద్ధమగునట్లు చేయుచున్నది. అట్లే ఉపాధ్యాయుని యాదేశము, యోగి అనుభవము, మొదలగునవి అక్షరనిబద్ధములై శబ్దప్రమాణములో నంతర్భూతము లగుచున్న

వైజ్ఞానిక రంగములో పురోగతికి సయితము ఈ నాలుగు ప్రమాణములే ఆధారములు. విజ్ఞానశాస్త్రవేత్త వృక్షముక్రింద ఆసీనుడైయుండగా ఫలము పడినది. దానిని చూచుట ప్రత్యక్షము. తద్ద్వారమున ఆకర్షణశక్తిని ఊహించుట అనుమానము. అది సర్వగ్రహములకు వర్తింపజేయుట ఉపమానము. దానినే వాగ్రూపమున నిబంధించి చెప్పుట శబ్దము. న్యూటన్ చెప్పిన ధర్మములు శబ్దప్రమాణములు.

కథానిక

# * వెలుగు *

శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి

నిట్టమధ్యాహ్నం.

ఎండ తీవ్రంగా ఉంది. కాలే నేలలోంచి పొగలు లేస్తున్నాయి. కాల్చే గాలి ఉండి ఉండి వీస్తోంది. వేడిగాలికీ, ఎండ వేడికీ ఊరంతా ఉడికి పోతోంది. ఎక్కడ చూసినా తాపం భరించలేని వాళ్లే కనిపిస్తున్నారు. భరించడం తప్ప ఇంకేం చేయాలో తెలియక తపించి పోతూన్న వాళ్లే ఎక్కడ చూసినా కనిపిస్తున్నారు.

అతను ఊరిలోంచి వస్తున్నాడు. ఊరి వెలుపల నడుస్తున్నాడు.

"పోయి ఎక్కడైనా కూర్చొని ఆలోచించు కోవాలి."

అనేవి అతను మాటిమాటికీ అస్పష్టంగా అను కొంటోన్న మాటలు.

ఎండకి ఊరంతా తలవంచింది. అతనుకూడా తల కొంచెం వంచి నడుస్తున్నాడు.

తల వంచినప్పటికీ అతను పొడవుగా కనిపిస్తున్నాడు. అతను సాలప్రాంశుడు; మహాభుజుడు. వెడల్పుగా ఉండడంచేత, దూరనుంచి చూస్తే అతను బలంగా కనిపిస్తున్నాడు. కాని, దగ్గర్నుంచి చూస్తే అతన్లో బలం బాగా తగ్గినట్టు తెలుస్తుంది. ఎలా చూసినా అతను అందంగా కనిపిస్తున్నాడు.

అతను నీరసంగా ఉన్న మృగరాజులా ఉన్నాడు.

తాపీగా ఏనుగులా నడుస్తున్నాడు.

అతని కళ్లు విశాలంగా ఉన్నాయి; కాని, లోతుకుపోయేయి. ఎత్తుగా, పొడవుగా, సూదిగా ఉన్న అతని ముక్కు అతని ముఖానికి ఒక విధమైన వన్నె తెస్తోంది. అతని ప్రతి అవయవం అతనికి ఏదో విధంగా వన్నె తెస్తోంది. అతని నుదురు విశాలంగా, ఎత్తుగా ఉంది. అతని పెదవుల్లో కారుణ్యం, అతని చుబుకంలో అసాధారణమైన పట్టుదలా కనిపిస్తున్నాయి.

అతని జుత్తు కొన్ని సంవత్సరాలనుంచి ఎదుగుతోన్నట్టుగా ఉంది. అన్ని సంవత్సరాలనుంచీ ఎట్టి సంస్కారం లేక పీచుగట్టి ఉంది. ఎత్తుగా తల మధ్యకి ముడిపెట్టి ఉంది.

తలంతా అలా ఉన్నప్పటికీ అతని ముఖం మాత్రం ఎంతో నున్నగా, శుభ్రంగా అప్పటికప్పుడు గడ్డం తీయించుకొన్నట్టుగా ఉంది.

అతని ముఖంలో, శరీరంలో, తేజస్సు ఉంది, కాని, స్పష్టంగా కనిపించడంలేదు. అతను, పల్చటి మబ్బువెనక ఉండే సూర్యుడ్లా ఉన్నాడు. అతను, కడగని, తళుకుపెట్టని, భగవంతుడి బంగారు విగ్రహంలా ఉన్నాడు. ప్రకాశించవలసిన రీతిగా అతను ప్రకాశించడంలేదు. అతను పూర్తిగా మెలకువతో ఉన్నట్టులేడు. దిక్కులు మర్చిపోయినట్టు నడుస్తున్నాడు.

అతనొక సన్యాసి.

మధ్యమధ్య వీచే గాలికి అతను కట్టుకొన్న కాషాయవస్త్రం ఎగురుతోంది. అతని ఎడంచేతిలో ఉన్న కమండలంలోని నీరు అతను నడిచేప్పుడు మధ్య మధ్య తుళ్ళుతోంది. కుడిచేత్తో అతను వెడల్పాటి తామరాకు పట్టుకున్నాడు. ఆకులో అన్నం ఉంది.

వేడిగా ఉండే ఎండా గాలే కాకుండా అతణ్ణి ఇంకా ఏదో బాధిస్తోంది.

ఆలోచిస్తున్నాడు—ఆలోచిస్తున్నాడు—

వెళ్తే వెనక్కి, పోతే ముందుకు, గమ్యస్థానం చేరగలననే ధైర్యం ఉంటేనే ముందుకి వెళ్లడం, లేదా, బయల్దేరిన స్థలానికే వెనక్కిపోవడం.

ఏదో ఒకటి తేల్చుకోవాలి, ఎక్కడైనా కూర్చొని ఆలోచించుకోవాలి, ముందు ఈ ఎండని తప్పించుకొని నీడలోకి పోవాలి.

అతను ఆగి తల ఎత్తిచూసేడు.

ఎదురుగా అనతిదూరంలోనే ఉంది.

ఆహ్వానిస్తోంది అతణ్ణీ అందర్నీ కూడా.

ఎండలో తళతళా మెరుస్తోంది, గాలికి మెల మెల్లగా కదుల్తోంది. "నీలెక్క నాకేమిటి?" అన్నట్టుగా వడగాలి వీచినప్పుడే చిన్న గాలిపాట పాడుతోంది. విలాసంగా, గంభీరంగా, విశాలంగా ఉంది. చల్లగా, ఇంపుగా, హాయిగా ఉంది.

ఎత్తుగా ఆకాశాన్ని తాకుతోన్నట్టుగా ఉంది. విశాలంగా అంతటినీ ఆక్రమించేటట్టుగా ఉంది. ఆకుపచ్చగా కంటికి చల్లగా ఉంది. ఎండ బారినుండి అందర్నీ రక్షిస్తానని శపథం పట్టినట్టుగా ఉంది.

అది ఒక మర్రిచెట్టు.

ఎండలో నిల్చొని, ఎండ బారినుండి అందర్నీ రక్షిస్తానని శపథం పట్టిన మర్రిచెట్టు ఆతపతప్తుడైన సన్యాసిని రమ్మని ఆహ్వానించింది.

అతను చెట్టువైపు నడిచేడు, చెట్టునీడని చేరేడు.

నున్నగా చెక్కిన రాతిపలకలు ఎన్నో ఉన్నవి చెట్టుకింద. వాటిలో చాలా వాటిమీద మనుష్యులు కూర్చున్నారు; మనుష్యులు పడుకొన్నారు. కొంతమంది ఏవేవో ఆలోచించుకొంటున్నారు. కొంతమంది ఏదీ ఆలోచించకుండా నిద్రపోతున్నారు. గుంపులుగా కూర్చొన్నవాళ్లు మాట్లాడుకొంటున్నారు. గంజాయి తాగేవాళ్ళూ, జూదం ఆడేవాళ్ళూ, బైరాగులూ, బిచ్చగాళ్ళూ, రోగిష్టులూ కూడా కనిపిస్తున్నారు, ఆ చెట్టుకింద.

అక్కడ వారందరికీ, వచ్చిన కొత్తమనిషివల్లా ప్రశ్నల్లో కడిగేసి విడిచిపెడితేనే గాని, నిద్ర పట్టదు. చెట్టు నీడని చేరుతోన్న, చేరిన సన్యాసి, ఆ గ్రామానికి కొత్తవాడని అందరూ గ్రహించేరు. దిగ్భ్రమతో చూసేరు. గుసగుసలాడుకొన్నారు. కాని, పలకరించి, ప్రశ్నించి, అతని ఆలోచనకి అంతరాయం కలిగించడానికి ఎవ్వరూ సాహసించలేదు.

తనమీద ఎన్నో కళ్ళు వాలేయని గమనించకుండానే, తిన్నగా వెళ్ళి, చెట్టుమొదల్ని ఓ రాతిపలకమీద కూర్చున్నాడు, సన్యాసి.

దేనిమీదా దృష్టి లేకుండా కూర్చున్నాడు.

భోజనంమీద దృష్టి లేకుండా తింటున్నాడు.

భోజనం చేసేడు.

చేశాక, అతని కళ్ళల్లో మబ్బులు విడాయి. అతనికి మెలకువ వచ్చినట్లయింది.

మెలకువగా ఉన్న కళ్ళతో, ఎండవైపూ, మర్రిచెట్టు నీడవైపూ, నీడలో మనుష్యులవైపూ అతను చూసేడు. విచారరేఖల్తో మలినమయిన అతనిముఖంలో మందహాస రేఖ మెరిసింది.

అదిగో అది ఎండ! ఇదిగో ఇది నీడ!

ఆ ఎండ భరించలేక ఈ చెట్టుకిందకి వచ్చి ఈ నీడలో ఈ రాతిపలకమీద కూర్చొని ఇప్పుడే భోజనం చేసేను.

వంట్లో తేలిగ్గా, సుఖంగా ఉంది. కళ్ళకిఅంతా స్పష్టంగా కనిపిస్తోంది.

మృత్యువుని అతి సమీపంగా చూసిన ఈ నా కళ్లు ఈ జీవితాన్ని తిరిగి స్పష్టంగా, స్పష్టంగా, చూడగలుగుతున్నాయి.

సంవత్సరాల తరబడి తపస్సుచేసి జీవిత పరమార్థం కనుక్కోలేకపోయాను.

నా జీవితాన్ని మాత్రం అంతిమదశకి తీసుకువచ్చేను.

ఈదినం, ఆ పిల్ల నన్ను చూసి, సేద తీర్చి, అన్నం పెట్టి రక్షించకపోతే ఏమయ్యుండేది?

ఈసరికి అంతా అంతమయ్యుండేది.

మృత్యుగహ్వరంనుంచి నన్ను వెనక్కు లాగి రక్షించిన ఆ పిల్ల ఎవరు?

ఎవరా పిల్ల?

కాపుల పిల్ల!

పేరు?

గుర్తు రావటంలేదు.

కాని—

ఆ పిల్లది నిజంగా మంచి పుట్టుక.

ఆ పిల్ల ధన్యురాలు నిజంగా!

ధన్యురాలు ఆ పిల్ల అవును.

ధన్యుణ్ని నేనుమాత్రం కాను.

వడగాలి వెచ్చగా వీచింది. మర్రిచెట్టు గాలిపాట పాడింది. దూరంలో, ఎవరో ఎర్రటి పూడ వాటి ఆడమనిషి ఎండలో నడుచుకుపోతోంది.

"ఇతడు నిజంగా ధన్యుడు"

అని ఒకావిడ ఒక దినం అన్న మాటతోనే అంతా ఆరంభమయింది.

ఈనాడు ఓ కాపుపిల్ల నా ప్రాణం కాపాడి నన్ను ఈ జీవితపథాన ఇంకా ఉండేట్టు చేసింది.

ఓనాడు ఓ ఎర్రటి, పొడవాటి, అందమైన ఆడమనిషి నేను జీవితాన్ని త్యజించేట్టు చేసింది.

డాబామీద నిల్చొంది, అతణ్ణి చూసింది.

అన్నది "ఇతడు నిజంగా ధన్యుడు" అని.

ఆవిడ అతనికి దూరపు బంధువు. ఆవిడ అతణ్ణి దగ్గరగా ప్రేమించింది.

ఆవిడది మిసమిసలాడే యౌవనం. ఆవిడది ఉదయకాంతివంటి సౌందర్యం.

సర్వాలంకార భూషితురాలై ఆ సర్వాంగ సుందరి డాబామీద తన స్నేహితురాలితో నిల్చొంది.

ఆ దినం అతను ఎక్కణ్ణించో వస్తున్నాడు.

అతణ్ణి చూసి, అతడికి వినిపించేట్టుగా ఆవిడ తన స్నేహితురాలితో అంది.

"ఇతడికి అందం, ఆరోగ్యం, సిరి, సంపద, విజ్ఞానం, వికాసం, ధైర్యం, సాహసం, అన్నీ ఉన్నాయి. ఇతడు నిజంగా ధన్యుడు. ఇతణ్ణి కన్న తలిదండ్రులు ధన్యులు."

అన్నది,ఆ డాబామీద ముద్దుగుమ్మ,అదే డాబా మీద ఉన్న ఇంకో ముద్దుగుమ్మతో.

చెట్టుకింద సన్యాసి ముఖంలోఉండే విషాదం, ఆ దినం ఆవిడకి, మహారాజులా ఉండే ఆ యువకుడి ముఖంలో కనిపించలేదు.

అతణ్ణి హాగస్తితో ఆకర్షించాలనుకొంది. ఆకర్షించలేక పోయింది.

కాని, ఆమె మాటమాత్రం అతణ్ణి ఆకర్షించింది.

"ఇతడు నిజంగా ధన్యుడు."

నేను నిజంగా ధన్యుణ్ణా?

ధన్యత్వం అంటే సౌఖ్యంకదా!

నాకు సౌఖ్యం లేదు.

నేను ధన్యుణ్ణి కాను.

నాకేకాదు; సౌఖ్యం ఎవ్వరికీ లేదు!

సౌఖ్యం ఎవరికైనా ఎలా కలుగుతుంది?

అనే జిజ్ఞాసే ఇంతవరకూ తీసుకువచ్చింది.

ఇంకా లభించలేదు సమాధానం.

ఏదిచేస్తే సౌఖ్యం వస్తుంది?

ఏది చేయకుండాఉంటే సౌఖ్యం ఉంటుంది?

అష్టైశ్వర్యాలతో తులతూగే నాకు సౌఖ్యం ఉండేదికాదు.

మహావైభవంగా జీవించిన నాకే సౌఖ్యం లేనప్పుడు వాళ్ళందరికీ సౌఖ్యం ఎలా ఉంటుంది?!

వాళ్ళందరికీ లేదు కాబట్టే నాకూ ఉండేది కాదు సౌఖ్యం.

వాళ్ళందరూ ఎవరు?

మర్రిచెట్టు నీడని కూర్చొన్న సన్యాసికి విషాదమనే మబ్బు తెరల్లోంచి వాళ్ళందరూ కనిపిస్తూనే ఉన్నారు

వాళ్ళందరూ వాళ్ళంతా...

ఒకనాడు——

సాయంకాలం విహారానికి వెళ్ళేప్పుడు, రాజవీధినికాక ఇంకోమార్గాన్న, వెళ్ళవలసి వచ్చింది.

ఆమార్గంలో——

అక్కడ, ఇక్కడ, ఎక్కడ చూసినా,

సందులు, గొందులు, కమ్మల గుడిసెలు, మురికి మనుష్యులు;

ఘోర దారిద్ర్యం, హానురోగం, మహా మృత్యువు!

అందరు మనుష్యులూ, మనుష్యులంతా ఇలా బాధపడి చస్తూంటే చూస్తూ ఊరుకోడం ఎలా?!

అదుగో వాళ్ళందరూ అదుగో!

అదుగో, ఒక్కొక్కడూ అదుగో!

ఒకడు,

చనిపోయేవాడు!

అడుగు తీసి అడుగు పెట్టలేకుండా ఉన్నాడు. కట్టెలమోపు నెత్తిని పెట్టుకొని నడవలేక నడుస్తున్నాడు. వంగిన మానులా ఉన్నాడు. ఎండిన కట్టెలా ఉన్నాడు. శరీరంలో ఎముకలూ, నరాలూ మాత్రం కనిపిస్తున్నాయి. మాంసం రక్తంలయినా కనిపించడంలేదు. వంగిన నడుం కట్టెల బరువుకి విరిగిపోయేట్టుగా ఉంది. అతని ముఖం వాడిపోయి వాడిపోయి ఉంది; పంతాల్లేని అతడి నోరు నోరులా లేదు; జీవకళలేని కళ్ళు కళ్ళలా లేవు. అతను మనిషి మనిషిలా లేడు. అతను తొంభయ్యేళ్ల తొక్కు. అతను పనికిమాలిన చెత్తలా ఉన్నాడు. ఎండిపోయిన చెట్టులా ఉన్నాడు. ఆ చెట్టువైపు ఏ పిట్టాకూడా చూడనైనా చూడదు. అతడికి ఎవ్వరూ సహాయం చెయ్యరు. మధ్యాహ్నమంతా కట్టెలు కొట్టి కొట్టి సాయంకాలానికి కళేబరాన్ని ఇంటికి ఈడ్చేస్తున్నాడు. అతను దుర్బలుడు, అసహాయుడు. అతి వృద్ధుడు.

"లక్స్ టాయ్‌లెట్ సబ్బు
ఎంతో తెల్లనైనది, ఎంతో శుద్ధమైనది మరియు
దాని నురగ ఎంతో మెత్తగాను,
సువాసనగాను నుంటుంది"
అని నిగార్ చెప్పుచున్నది




నిగార్ ఇంకా ఈలాగున చెప్పుచున్నది:
"శుద్ధమైనటువంటియు, తెల్లనైనటువంటియు నైన లక్స్ టాయ్‌లెట్ సబ్బు నా చర్మమునకు అద్భుతమైన మార్పును తెచ్చుటను నేను కనుగొనుచున్నాను. చురుకుగా పని చేయునటువంటియు, చర్మ రంధ్రములలో లోతుగా వెళ్లి శుభ్రముచేసేటటువంటియునైన దాని నురగ నా చర్మమును సిల్కువలె మృదువుగను, రోజంతా మనోహరముగను నుంచును. మరియు అది నా ముఖమునకు ప్రకాశత్వమును ఇచ్చును."



"...అందువలననే నేను నా చర్మ
సౌందర్యమును లక్స్ టాయ్‌లెట్
సబ్బుతో రక్షించుకొంటాను!"

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు ★

LTS. 413-X52 TL.

అతను నేడో రేపో చనిపోబోయేవాడు.

ఒకడు,

చనిపోతున్నవాడు!

సాయంకాలపు ఎర్రరంగు ఆకాశం కింద, ధూళిలో నిండిన ఎర్రటివట్టి కటిక నేలమీద, దారికి పక్కగా, అందరికీ ఎదంగా, దొర్లుతున్నాడు రోగంతో, నొప్పితో. శక్తిలేని పోరాటం చేస్తున్నాడు మృత్యువుతో. ఆ కళేబరాన్ని ప్రాణం విడిచి పెడుతోంది. లోకం అంతా విడిచిపెట్టింది. వేలాదిగా మూగిన ఈగలు మాత్రం విడిచి పెట్టడం లేదతణ్ని. అతను ఆపదలో ఉన్నాడు. అతనికి బాంధవులు లేరు. ఉన్నా రారు. అతనివైపు చూడనైనా చూడకుండా పోతున్నారు అంతా...అంతా.

అతను నేడు చనిపోతున్నాడు.

ఒకడు

చనిపోయినవాడు!

వేళకి సూర్యుడు అస్తమిస్తున్నాడు. వేళ కాకుండానే అతను అస్తమించేడు. మంచంమీద అతను పడిఉన్నాడు. ఆ మంచాన్ని నలుగురు మనుష్యులు మోసుకుపోతున్నారు. అతడి తుదిప్రయాణం సాగుతోంది. అతనికోసం ఏడుస్తోన్నవాళ్లు గుండెలు బాదుకొంటూ మంచం వెనక నడుస్తున్నారు. అతను ఆసమయంలో వెళిపోతున్నాడు. ఏ సమయంలోనూ మరింక తిరిగి రాడు.

అతను చనిపోయినవాడు.

అంతా దారిద్ర్యంలో రోగంతో ఉన్నారు. దుర్బలంగా అసహాయులుగా ఉన్నారు. "ఎందుకు పుట్టించేవు భగవంతుడా!" అని ఏడుస్తున్నారు. చివరికి చస్తున్నారు.

చెట్టుకింద కూర్చొన్న సన్యాసి తన చుట్టుపక్కల కూర్చొన్నవారందరివైపూ చూసేడు.

వాళ్లంతా, ఇదిగో, ఇక్కడకూడా ఉన్నారు!

ఎక్కడికి వెళ్లినా ఉంటారు.

ఆనాటినుంచి ఈనాటివరకూ అంతటా కనిపించే వీళ్లందరికీ, ఇటువంటి వాళ్ళందరికీ సౌఖ్యం లేదు, లేదు, లేనేలేదు.

వీళ్ళందరికీ సౌఖ్యం చేకూర్చడం ఎలా?

అనే ఆలోచనే ఈ వేషంలోకి దింపింది.

సన్యాసి నిట్టూర్చేడు.

సౌఖ్యం! సౌఖ్యం! అందరికీ సౌఖ్యం!

అందుకోసం అన్నిటినీ విడిచిపెట్టి కాషాయ వస్త్రం ధరించి ఇలా రావడం జరిగింది.

అంతేకాని, జీవితానికి భయపడికాదు.

జీవితానికి భయపడి సన్యాసం పుచ్చుకొన్నవారు లేకపోలేదు. అటువంటివారిని చాలామందిని అతను చూసేడు కూడా.

తనూ ఆ విధంగానే చేసి తనని తాను మోసపుచ్చుకొంటున్నాడేమో?

అని ఆలోచించేడు, సన్యసించిన తొలిరోజుల్లోనే—కాని, జీవితానికి భయపడవలసిన పరిస్థితి ఏదీ తనకు జీవితంలో లేదు.

వ్యక్తిగతంగా తన విషయం చూసుకొన్నా, తన కుటుంబ విషయం చూసుకొన్నా, భయపడాల్సిన అవసరం ఏదీలేదు.

అతనికి అన్నీ ఉండేవి, కావలసినవన్నీ గొరకేవి.

"జీవితభారాన్ని మోయలేని దుర్బలుడితడు."

అని తనని వేలెత్తి చూపడానికి

తనకి జీవితం భారంగా ఉండేదే కాదే!

కాని, కన్న తలిదండ్రులకి, కట్టుకొన్న భార్యకి, ప్రస్తుతం కొడుక్కికూడా, తనీరీతిగా చేసినందుకు కష్టంగా, విచారంగా ఉండే ఉంటుంది.

కాని—

లోకంలో ఎందరెందరు ఎన్నిటికోసం బాధపడ్డంలేదూ? అందర్లాగానే వాళ్ళూను.

బాధనుండి అందర్నీ విముక్తిచేయడం ఎలా?

అనే బాధవల్లనే వాళ్ళని విడిచిరావడం జరిగింది.

అందరికీ ముక్తిమార్గం చూపించగలిగినడు వాళ్లకీ చూపించవచ్చు ఆదారి;

అని తనకి తాను సమాధానం చెప్పుకు వస్తున్నాడు సన్యసించినప్పటినుంచీ కూడా.

అదేరీతిగా సమాధానం చెప్పుకున్నాడు మర్రిచెట్టు నీడని కూర్చొని.

అందరూ ఒక్కసారిగా బైటపడాలని సన్యాసికి తెలుసు. ఒక మనిషి బాధపడుతూన్నప్పుడు, ఆ బాధనుండి అతను తప్పించుకోలేనందుకు, అతణ్ని తప్పించలేనందుకు, మిగత అంతాకూడా బాధపడాల్సి వస్తుంది.

కుండలో నీరుంది.

అందులో ఒక్క చుక్కలో ఒక్క విషపు చుక్క కలుస్తే నీరంతా కలుషితం అవుతుంది.

కుండలో నీళ్ళల్లా ఉన్నారు లోకంలో మనుష్యులు.

నీటిలో కలిసిన విషాన్ని చుక్కచుక్కనుంచీ పారేయాలి.

దుఃఖాన్ని మనిషి మనిషినుంచీ తొలగించి వేయాలి.

అంతవరకూ నాకు విశ్రాంతి లేదు.

ఎవ్వరితోనూ సంబంధం పెట్టుకోకుండా, తమ దుఃఖాన్ని బాపుకొని తమమట్టుకు శాంతి సంపాదించుకొన్న వాళ్లు ఉన్నారు. లేకపోలేదు.

అలా తనుకూడా చేయవచ్చు.

అలా చేసిన సన్యాసులుకూడా శాంతి సంపాదించడంచేత ప్రశాంతంగా గంభీరంగా ఉంటారు. నిర్విచారంగా, సుఖంగా తాము కనుక్కొన్న మారాన్న ఒంటరిగా నడుసారు.

అటువంటి యతిని చూశాకే తనుకూడా సన్యసించేడు.

కాని, లాభంలేదు.

వారివల్ల, వారి అనుభూతివల్ల లోకానికి లాభం లేదు.

వాళ్ళపద్ధతులు లోకానికి తెలియవు. వాళ్ళకి లోకంతో సంబంధం లేదు.

నీరు ఆవిరయినట్టుగా పైకెగసి కూర్చున్నారు. కుండలో నీటిలో ఎంత విషం కలిసినా వాళ్ళకి అక్కర్లేదు.

అవతల ఇల్లు కాలిపోయింది.

కాలిపోతోన్న ఇంట్లోంచి, పరిగెత్తి గలిగిన పెద్దమనిషి బైటకి పరిగెత్తి వచ్చేడు.

ప్రాణంనిలుపుకున్నాడు. నిట్టూర్చేడు. ప్రాణాపాయాన్ని తప్పించుకోగలిగినందుకు ఆనందంతో వణికిపోయేడు.

అంతా బాగానే ఉంది.

కాని—

కాలే ఆ ఇంటిలోపల ఉయ్యాల్లో ఉండిపోయేడు ప్రాకనైనా లేని పసిపిలడు.

లోకంలో పసిపిల్లలు కాలిపోతున్నారు. వాళ్లని అలానే విడిచిపెట్టి పెద్దమనుష్యులందరూ పైకి వెళ్లిపోతున్నారు.

అటువంటి పెద్దమనుష్యుల ప్రయోజనం వారికేం ఉంటుంది.

పసిపిల్లలు బైటపడే మార్గంముందు చూడాలి.

అందరూ బైటపడే మార్గం అందరికీ తెలియాలి.

అందుకోసమే కదా, ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ, అయిదూ, ఆరు సంవత్సరాలు గాలిమాత్రం ఆధారంగా ఘోరతపస్సు చేసినది!

ఆరేళ్ల కష్టానికి ఫలితం?

శూన్యం! శూన్యం! శూన్యం!

కాదు, కాదు, కాదు,

శూన్యం కాదు, ఫలితం కనిపించింది.

అయితే—

కావలసిన ఫలితం కాదది అది అక్కరలేనిది.

ఆరేళ్ల కష్టానికి ఫలితంగా దేహం కుషించింది. మృత్యువు ఆసన్నమయింది.

ఆ కాపుపిల్ల కాపాడి ఉండకపోతే, కబళించి వేసేది మహామృత్యువు.

వ్యాసి ముఖంలో విషాదచ్ఛాయలు దటమయేయి.

మర్రిచెట్టు ఆవల ఎండ తీక్ష్ణంగా ఉంది. వేడి విపరీతంగా ఉంది. కట్టెదుట లోకమంతా కాలిపోతూన్నట్టుగా ఉంది.

సన్యాసికి బాధగా బాసగా ఉంది. బాధతో కళ్ళు మూసుకొన్నాడు.

ఇహ లాభం లేదా?

వెనక్కి పోవడమేనా?

కొండ ఎక్కి ఎక్కి, ఇహ దిగజారి పోడమేనా?

జయించ శక్తిలేక శిఖరం చూడకుండా జారిపోడమేనా?

జయం లేదా?

జయం! జయం! జయం!

జయం లేదు.

అపజయం! అపజయం! అపజయం!

అపజయం అంది

ఇతడు పలాయితుడు; ఇతడు పరాజితుడు,

అని అంతా అనడమే కాదు; నేను కూడా అనుకోవలసివస్తోంది.

లేదు! లేదు! లాభం; లేదా లేదా?

చెట్టుకింద జూదం ఆడే గుంపంతా ఒక్కసారిగా గొల్లుమని నవ్వింది. ఎక్కడో ఓ మనిషి చేసిన ఆర్తనాదం ఎక్కణ్ణించో వినిపించింది.

సన్యాసి తన రెండు కళ్ళనీ తెరిచేడు.

పలాయితుడు! పరాజితుడు!

అతను పెదవులు బిగించేడు. కళ్ళని మెరిపించేడు. తల ఎత్తేడు.

నేను పలాయితుణ్ణి కాదు!

నేను పరాజితుణ్ణి కాకూడదు!!

లోకంలో ఆర్తనాదం వినిపించకుండా చేసే వరకూ నేను వెనక్కి వెళ్లను. అపజయాన్ని అంగీకరించను. జయం సంపాదించి తీరుతాను.

సాధించి తీరాలి!

మర్రిచెట్టు దగ్గర్నుంచి ఊళ్లోకి వెళ్లే బాట ఎండలో సుస్పష్టంగా కనిపిస్తోంది.

మనిషిని సౌఖ్యానికి తీసుకుపోయే మార్గం కూడా సుస్పష్టంగా కనుక్కోని తీరాలి.

వెనక్కి వెళ్లిన నేది ముమ్మాటి నిశ్చయం.

కాని, ముందుకి పోయే దెలా?

అనే ప్రశ్నకి సమాధానం లభించటంలేదు.

సన్యాసి మఠం వేసు కూర్చున్నాడు, మోచేతులు తొడలకి ఆన్చుకొని, చేతులు చెక్కిళ్లని చేర్చుకొని.

చేతులు చెక్కిళ్ళని చేర్చుకొని ఆశ్చర్యపోయేడు.

చెంపలు ఇంత నున్నగా ఉన్న వేల?

తల తడిమి చూసుకున్నాడు.

ఆరేళ్ల జుత్తు అలానే ఉంది.

ఆరేళ్ళ బవిరిగెడ్డం ఎక్కడకో పోయింది.

ఎలా పోయింది?

చెక్కిళ్లు మరోసారి తడుముకొంటూండగా అప్పుడు జ్ఞప్తికి వచ్చింది, అదంతా ఆ కొపుపిల్ల చేయించిన ప నేనని.

చిలిపి పిల్ల! కాని, మంచిపిల్ల!

బైట ఎండ. వంట్లో నీరసం.

ఎండలో నీరసంగా నడుస్తున్నాడు.

కళ్ళు మండిపోతున్నాయి. తల తిరుగుతోంది.

అంతే జ్ఞాపకం.

తరువాత కళ్లు తెరిచేసరికి కనిపించేయి రెండు నవ్వుతోన్న కళ్లు. కళ్ళకి చల్లగా కనిపించింది ఒక నవ్వే ముఖం.

తెల్లని చల్లని ముఖంలో నల్లని చల్లని కళ్లు.

కన్ను తెరిచి చూసేసరికి "బతికే ఉన్నాడు! బతికే ఉన్నాడు" అని కేకలు వేసింది ఆ కొపుపిల్ల, కళ్లతో నవ్వుతూ, చేతుల్తో చప్పట్లు కొడుతూ.

బతికి ఉన్నది త నేనని తెలుసుకున్నాడు.

"ఉండు ఉండు" అన్నది ఆమె.

తను అలానే ఉన్నాడు.

ముఖంమీద చల్లటి నీరు జల్లుతూ, కమ్మటి నవ్వు నవ్వింది.

తనకి తెరలు తెరలుగా తెలివి వస్తోంది.

ఆమె తనని మజ్జిగ తాగమంటోంది.

తనకి తాగాలనే ఉంది, కాని, పెదవులు పూర్తిగా విడ్డంలేదు. ఇంతలో మళ్లీ చీకట్లు క్రమ్ముకు వచ్చేయి ఒక్కసారిగా. తరువాత తెలివొచ్చినప్పటికి చుట్టూ కొద్దిగా మనుష్యు లున్నారు. నవ్వే ముఖం ఎదురుగా ఉంది.

"మళ్లీ తెలివొచ్చేలోపున ఈపనంతా చేయించి ఉంటుంది" అనుకున్నాడు సన్యాసి, చెక్కిళ్ళు నిమురుకొంటూ, పిల్లని తల్చుకొంటూ, మందహాసం చేసుకొంటూ.

"ఒక్కసారి నీ నీడ చూసుకో! ఇప్పు డెంత బావున్నావో" అని. అందుకే మాటిమాటికీ అంది తన తీసుకు వెళూ.

తెలివి వచ్చి లేచిన వెంటనేమాత్రం ఆమె ఇచ్చిన మజ్జిగ పూర్తిగా తాగ గలిగేడు

అది మజ్జిగ కాదు. మధువు! అది మధువు కాదు. అమృతం!

వళ్లు చల్లగా ఉంది. వళ్లు వేడెక్కింది. ప్రాణం లేచివచ్చింది.

మబ్బులు విడాయి. కళ్లు చూడగలిగేయి. ఆ పిలని చూసేయి.

పదహారేళ్లకి మించని వయసు, కాటికతో దిద్దిన నల్లటి చల్లటి పెద్దకళ్లు, లేతిగా లేతగా ఉన్న పెద

వులు. పొడవు ముక్కు, సూదిగడ్డం, కోలముఖం, చెదరిన జుత్తు.

ఆ పిల్ల నవ్వింది.

నవ్వినప్పుడు కనిపించినవి ఎంతాలనే ఆణి ముత్యాలు, నవ్వినప్పుడు రాలినవి నవ్వులనే పువ్వులు.

ముఖంలో సంతృప్తి, సంతోషం.

"నడవగలవా?" అంది.

నడిచి చూపించేడు.

"శాబాస్! శాబాస్! బలే! బలే!" అని ఆమె గంతులు వేసింది.

ఆణిముత్యాలు కనిపించేయి పువ్వులు రాలేయి.

ఆమె నవ్వుతోంది. గంతుతోంది. రెక్కలుంటే ఎగిరిపోయుండును.

తండ్రికి పొలంలోకి అన్నం పట్టుకువెళ్లింది. అన్నం తినేసిన తండ్రి కొంచెం మజ్జిగా మంచినీరూ మాత్రం మిగిల్చేడు.

ఇంటికి తిరిగి వస్తోంటే దార్లో కనిపించేడు పడిపోయిన సన్యాసి.

ఊరు దూరంగా ఉంది. దగ్గర్లో ఎవరూ లేరు.

"తరువాతి అంతా వచ్చేరను కో! కాని, మొట్ట మొదట నేను చూడకేపోతే, ఆ కాస్త మంచినీళ్లూ, మజ్జిగచుక్కా మిగిలి ఉండకేపోతే నువ్వే మయ్యే వాడివి?"

"చనిపోయి ఉండేవాణ్ణి."

సర్వం విడిచిపెట్టిన సన్యాసిని ప్రాణం విడిచి వెళ్లిపోయేందుకు సిద్ధపడి, చరచరా కొంతదూరం వెళ్ళింది.

అతనితో ఎట్టి సంబంధం లేని ఆపిల్ల, చక్కా పోతోన్న ప్రాణాన్ని రెక్కపట్టుకు ఆపింది.

వచ్చిన ప్రాణంతో లేచి నిలబడ్డ సన్యాసిని ఇంటికి తీసుకువెళ్ళింది. అన్నం పెట్టి తినమంది.

పెట్టిన అన్నం పట్టుకొని అతను మర్రిచెట్టు క్రిందకివచ్చేడు. భుజించేడు.

ఆమె పెట్టిన అన్నంతో కడుపు నిండుగా ఉంది. వంట్లో సుఖంగా ఉంది.

ఆ పిల్లకి నే చనిపోతే ఏం కావాలి? బతుకుతే ఏం కావాలి?

ఓ మనిషిని బతికిస్తే తనకి ఏం లాభిస్తుం దను కొంది?

నే నేమైనా ఇస్తా ననుకొందా?

సన్యసించిన వాళ్లు బూడిదకూడా ఇవ్వరని అందరూ ఎరిగిన విషయమే కదా!

సాయం చేయడం పుణ్యం అనుకొన్నదా?

పాపం, పుణ్యం, అనే మాటలే తెలిసినట్టు లేదా పిల్లకి.

దానికి ఆశించకుండా సహాయం చేసింది.

ఓ మనిషిని బతికించగలిగినందుకు సంతోషం పట్టలేక గంతులువేసింది. కిలకిల కిలాకిలా నవ్వింది.

నేను పడిఉన్న ఆ సమయంలో ఆమె గురించి ఏ కోరికాలేదు ఆమె మనసులో. ఆమెకి వేరే ఆలో చనే లేదు.

స్వార్థం మరచింది. నిష్కామంగా సంచరిం చింది, సహాయం చేసింది.

అందుకే ఆమెకి, ఆ సంతోషం! అందుకే ఆమెకి ఆ సంతృప్తి!

లోకంలో అంతటా దుఃఖం ఉంది.

దుఃఖాన్ని బాపేందుకు, స్వార్థం మరిచి తమ తమ గురించిన కోరికలన్నీ విడిచిపెట్టి మానవులంతా ఒకరికొకరు సహాయం ఎల చేసుకోరు?

ఆ పిల్లలా అందరూ ఎందుకు ఉండరు?

ఆ పిల్లలాగే అందరూ ఉండి తీరాలి!

సన్యాసి కళ్ళు మెరుస్తున్నాయి, అతని జుత్తుని వేడిగాలి కదల్చింది.

ఆ వేడిగాలి మర్రిచెట్టుని కూడా కదల్చింది.

గాలికి పాట పాడింది మర్రిచెట్టు.

పాటకి తలఎత్తి చూసేడు సన్యాసి.

తలదించి చూసేడు నీడని కూర్చొన్న మను లన్నైపు.

ఈ నోరులేని చెట్టు అందరికీ ఇంత చల్లటి నీడని ఎందుకు ఇస్తోంది?

నీడలో హాయిగా కూర్చొన్న మేమంతా ఈ చెట్టుకు నీరయినా పోయమే!

మా అందరి దగ్గర్నుంచీ ఏమీ కోరకుండా, మండు టెండని మధ్యలో ఆపి ఎందుకు మా అందరికీ గొడుగుపట్టింది మర్రిచెట్టు?

మర్రిచెట్టు ఇంకా పాడుతూనే ఉంది. అతను తిరిగి తలఎత్తి చూసేడు.

మర్రిచెట్టునీడ చల్లటి నీరులా ఉంది. నీటిలో చేపల్లా మెరిసేయి సన్యాసి కళ్లు.

నవనవలాడుతోన్న ఆకుల్లో గలగల నవ్వింది మర్రిచెట్టు, తనేదో ఘనకార్యం చేసినట్టు, ఎంతో సంతోషంతో, సంతృప్తితో.

ఈ మర్రిచెట్టుకి ఎందుకింత నవ్వు?

ఆ కాపు పిల్లకి ఎందుకంత నవ్వు?

'నాకు ఇది కావాలి, నాకు అది కావాలి'

అనేదిలేదు, దీనికీ, ఆమెకి.

నీకురించి నాచేతనైన సహాయం చేస్తాను. అందుగురించి నాకేం అక్కర్లేదు నీ దగ్గర్నుంచి అని నిష్కామంగా చేసి చూపెట్టింది ఆ కాపుపిల్ల! చేసి చూపెడుతోంది ఈ మర్రిచెట్టు!

కోరికల్ని చంపుకోవాలి. సహాయం చేయాలి.

సేవ చేయాలనే కోరికమాత్రం ఉండాలి.

కోరిక లేకుండా మాత్రం సేవ చేయాలి.

సేవ! సేవ! సేవ!

నిష్కామంగా, నిష్కామంగా, నిష్కామంగా...

మర్రిచెట్టు ఆవల ఎండ చాలా హెచ్చుగా వెలుగుతోంది.

మర్రిచెట్టుదగ్గర్నుంచి ఊళ్లోకిపోయేదారివెంబడి ఓ తెల్లటి ఆవు ఒంటరిగా మెల్లగా నడుస్తూ వస్తోంది.

చేపల్లా ఉండే సన్యాసి కళ్లు మర్రిచెట్టు నీటి నీడలో బంగారు చేపల్లా తళతళ లాడేయి; మిలమిల మెరిసేయి.

అదిగో అది వెలుగు! అదిగో అది దారి!
ఇదే ఇదే దారి! ఇదే ఇదే వెలుగు!

ఇంత స్పష్టంగా, ఎంతో స్పష్టంగా కట్టెదుట కనిపిస్తోంది. కాబట్టే ఇంతకాలం కళ్లకి కనిపించీ కూడా కనిపించలేదు.

నాకీదినం చీకట్లు విడ్డాయి. వెలుగు సుస్పష్టంగా కనిపిస్తోంది.

ఆ కాపుపిల్ల, ఈ మర్రిచెట్టు, నిజంగా ధన్యులు!
ఈ చెట్టుకి, ఆపిల్లకి నేను నిజంగా కృతజ్ఞుణ్ణి.
ఆపిల్లపేరేమిటో గుర్తు రావటం లేదు.
" పేరేదయితేనేం? మంచిపుట్టుకగలదాపిల్ల"

అనుకొన్న సన్యాసికి అప్పుడు జ్ఞప్తికి వచ్చింది ఆ పిల్ల పేరు అదేనని.

"అదే అదే ఆపిల్లపేరే అది! సుజాత! సుజాత!" అనుకొంటూ అతను లేచేడు.

ఒకదినం మధ్యాహ్నం, ఒక మర్రిచెట్టునీడలో, ఒక కాపుపిల్లపేరు స్మరిస్తూ ఒక సన్యాసి లేచి నిల్చున్నాడు.

నీడలో నిల్చొన్న ఆ సన్యాసి వెలుగు చూసేడు.

అతనికి జ్ఞానోదయమయింది. అతను బుద్ధుడయేడు.

బుద్ధుడైన ఆ సన్యాసి ఆ మధ్యాహ్నపు వెలుగులోకి నడిచేడు.

ఆ సమయంలో —
మండే సూర్యుడు మంచు కురిపించేడు.



# పర్షియన్ చిత్రకారుడు అబుల్ హసన్

శ్రీ వేలూరి రాధాకృష్ణ

భారతదేశ చరిత్రలో పేర్కొనబడిన విశిష్ట కళాకారులలో అబుల్ హసన్ నాదిర్ ఉజ్ జమాన్ ఒకరు. ఇతడు మొగల్ చక్రవర్తుల దర్బారులోని మణిదీపం.

జహంగీర్ ఆస్థానంలో విశేష గౌరవమర్యాదల నందుకొన్న వాడు. ప్రసిద్ధ పర్షియన్ కళాకారుడైన అఖ్ రజా కుమారుడు. అఖ్ రజా చరిత్ర ఏమంత తెలియకపోయినా, ముల్లామీర్ అలీవద్ద అబుల్ హసన్ కళ నభ్యసించాడని వ్రాసిఉంది. అతనివద్ద కళాభ్యాసం చేయటంమూలాన హసన్ చిత్రరచన ప్రశంసాపాత్రమయిందని కూడా పేర్కొనబడినది. అఖ్ రజా ప్రసిద్ధులైన ప్రాచీన కళాకారుల చిత్రా మళ్లా తిప్పి వ్రాయటంలో చతురత చూపెంచాడు కాని స్వకపోల కల్పితమైన రచన ఏమీ చేయలేదు. అబుల్ హసన్ సోదరుడైన మహమద్ అఖ్ ను గురించికూడా చరిత్రలో వ్రాసి ఉంది. ఇతడుకూడా జహంగీర్ ఆస్థానంలో పనిచేసి ప్రఖ్యాతి గడించిన కళాకారుడు. అబుల్ హసన్ ప్రతిభను, జహంగీర్ స్వయంగా ఇల్లా అభినందించాడు:

“ఈరోజున ‘నాదిర్ ఉజ్ జమాన్’ బిరుదును పొందిన అబుల్ హసన్ ‘జహంగీర్ నామా’కు ముఖపత్రంగా గీచిన చిత్రాన్ని నావద్దకు తెచ్చాడు. ఆ చిత్రం అతని కౌశలాన్ని వేనోళ్ల చాటుతోంది. అతనికి సకల సౌభాగ్యం కలుగుగాక. అతడు చిత్రకళలో



“వృషభరథం”—అబుల్ హసన్ వర్ణచిత్రానికి రేఖానుకరణ.

అత్యుత్తముడు. అతని కళ ఈ కాలానికి మార్గదర్శకమై

అతనిని మించినవారు గాని లేరు. ఈనాటి జ్ఞాన సకల కళాకోవిదులైన అబ్దుల్ హై, బిషన్‌దాస్, ఇద్దరూ బ్రతికియున్నట్లయితే అతనికి ఎంతో సహాయపడేవారు. అతని తండ్రి, ఆకా రజా, నేను ఇంకా రాకుమారుడుగా ఉన్న సమయంలో మా ఆస్థానంలో పనికి చేరాడు. అబుల్ హసన్ నా ఆస్థానపు ముద్దుబిడ్డ. తండ్రికీ కొడుక్కీ కళాప్రావీణ్యంలో ఎక్కడా పోలిక లేదు. ఒకవిధంగా తండ్రినిమించిన కొడుకతడు! అతని పిన్నతనంనుంచి, ఇంతటి ప్రతిభాసంపత్తిని పొందిన ఈక్షణంవరకూ గమనిస్తూ వచ్చాను. నిజంగా అతడు నాదిర్ - ఉజ్ - జమాన్ అనే బిరుదుకు తగినవాడు"...

కాని దురదృష్టవశాత్తూ అంత ప్రసిద్ధిగాంచిన అబుల్ హసన్ చిత్రాలు ఈ కాలానికి మిగిలినవి వేళ్లమీద లెక్కపెట్టవచ్చును. మొఘల్ శైలిలో రచించిన ఒక సుందరమైన ముఖచిత్రం'—అబుల్ హసన్ రచించినది, పెర్సీబ్రౌను కళాగ్రంథంలో ప్రచురింపబడింది. నవనగర్ మహారాజైన జామ్ జస్సా, చిత్రం — అబుల్ హసన్ రచించినది, కస్టెల్ - గోయెట్జ్ రచించిన కళాగ్రంథంలో ప్రచురింపబడింది. జహంగీర్ మాటల్లోనే చెప్పాలంటే: "'జామ్' గుజరాత్ రాకుమారుల్లో గొప్పవాడు. భారతదేశపురాజులలో ఉత్తమోత్తముడు. అతడేలిన దేశం జలధుల నంటింది. అతని సైన్యంలో పదాతులు ఐదు వేలు. తురగములు ఆరు వేలు! యుద్ధ సమయంలో ఒక్కమాటుగా రణరంగానికి పన్నెండు వేలసైన్యాన్ని పంప గల శక్తిగలవాడు! నేనతనిని ఒకమారు ఘనమైన రాజవేషమునిచ్చి గౌరవించాను." ఈ జామ్ జస్సా—అతడే జస్వంత్—జామ్‌నగరు నేలిన మహారాజాధిరాజు. జామ్,రంజిత్ సింగ్ పూర్వీకుడు. ఆయన ముఖచిత్రంమీద చిత్రకారుని బిరుదు 'నాదిర్-ఉజ్-జమాన్' అని వ్రాసి ఉంది. అబుల్ హసన్ రచించిన ఈ చిత్రాలకీ, అతడే రచించిన 'వృషభరథం' అనే చిత్రానికీ ఎంతో తారతమ్యం కనిపిస్తుంది. 'వృషభరథం' అనే చిత్రంలో అతడు చూపిన, కళ్ళకి హాయినిచ్చే, రంగులపొందికా, వృషభాలలో చూపిన ఆ చలాకీ, శక్తీ, శైలిలో కనబర్చిన, ప్రత్యేకమైన మేళవింపూ, వర్ణింపనలవికానివి. భారతచిత్రశైలికొంతా, ఇరానియన్ చిత్రశైలికొంతా, చీనా చిత్రశైలి మరికొంతా, మిళితంచేసి, అదొక వర్ణింప నలవికాని అద్భుతమైన రీతిని అందులో అబుల్ హసన్ పొందుపర్చాడు. మొఘల్ శైలిలో రచించిన ఏ చిత్రాలలోనూ, ఈ చిత్రంలోనున్న సౌకుమార్యం, తూలికావిన్యాసం కనిపించదు. అక్బరు కాలంలో ప్రవర్థిల్లిన కళాశైలికికూడా అతీతమైనదని చెప్పవచ్చును. అక్బరు ఆస్థాన కళాకారులు, ఇండో-పర్షియన్ మిశ్రమ శైలిలో రూపొందించిన గొప్ప అలంకారిక చిత్రాలలో కౌశలం ప్రావీణ్యాలు బహుస్వల్పం. కావ్యంలో ఉండదగిన లక్షణాలు వాటిలో లేవు అందువల్లనే అబుల్ హసన్ చిత్రాలు కావ్యాలవలె నిలిచిపోయినవి. అతడు ఒక పరిణామదశలో—అనగా ఒక కళాసంస్కృతీ సంప్రదాయం ఛిన్నాభిన్నమైపోయి, మరొక గొప్ప విశిష్టసంప్రదాయం నెలకొంటున్న సమయంలో—కళాసృష్టి సాగించాడు. అందువల్లనే, అతడు చిరంజీవిగా చరిత్రపుటల్లో నిలిచిపోయాడు.

ఈ 'వృషభరథం' అనే చిత్రం, అందరికీ కళ్లయెదుట దినదినమూ కానవచ్చే, గ్రామీణ దృశ్యం. మామూలు మాటల్లో, చెప్పాలంటే, ఈ చిత్రం పేరు 'ఎడ్లబండి' అని అనవచ్చును. కాకపోతే ఈ 'ఎడ్ల బండి' మన దక్షిణాదిన కానరాదు. ఇది కేవలం ఉత్తర హిందూస్థానంలోనే దినదినమూ కానవచ్చే దృశ్యం. ఇది మూడు శతాబ్దాల క్రితం హసన్ రచించినది! ఈనాటికీ ఈ 'ఎడ్లబండి' దృశ్యం, ఉత్తర హిందూస్థానంలో కనపడుతూనే ఉంటుంది. ఆ యెడ్లజతను చూడగానే వృషభజాతిలో ఉండే చలాకీ, శక్తీ, మనకు ద్యోతమానమవుతాయి. ఈ చిత్రంలో పర్షియన్ శైలికూడా ప్రస్ఫుటంగా కానవస్తుంది. ముఖ్యంగా ఆ వృషభాలు, తలలను ఎగరవేసి శరవేగంతో పరుగెట్టటానికి ఉంకించే ఉపకృతి గమనార్హం. ఆ కళ్ళచూపుల్లోనూ, నిక్కించిన చెవులలోనూ మహాద్భుతమైన శక్తి స్ఫురిస్తోంది. వర్ణసంకలనంలోనూ, రేఖాచిత్రణలోనూ చీనా శైలి పొందుపరుపబడింది. అందువల్ల ఈ శైలిలో ఎక్కువ భారతీయమైన శైలిలేదని చెప్పవచ్చును. ఎందుకంటే, భారతీయ కళాకారుల్లో, ప్రకృతినీ, పశుసంతానాన్నీ, ఇతర జంతువుల్నీ, మూర్తిభవింపజేసే వాస్తవికత బహు స్వల్పం. అందులో ప్రత్యేకత చూపలేదనే సంగతి నిర్వివాదాంశం. భారతీయ కళ ఆంతరంగిక శక్తులకీ, భావాలకీ ప్రాముఖ్యాన్నిచ్చింది. బాహ్యప్రపంచానికి అతి స్వల్పప్రాముఖ్యమే ఇంతవరకూ చూపబడుతూంది. అందువల్ల మనం గమనించినట్లు చీనా చిత్రకళలోనూ, జపాన్ చిత్రకళలోనూ ప్రకృతి సౌందర్యానికీ అందులో జంతు సందోహానికి ఇచ్చే ప్రాముఖ్యత ముఖ్యంగా ఎంతో కొనియాడదగినది. ఆ ప్రాముఖ్యతే, ఆ ప్రత్యేకతే, వేరే శక్తితో మరింత విశేషంగా ఈ హసన్ చిత్రంలో చూప

బడింది. హసన్ పర్షియన్ శైలినికూడ మిశ్రమం చేశాడంటేనూ ఆశ్చర్యంలేదు. చీనా శైలిని కనబర్చాడంటేనూ ఆశ్చర్యంలేదు. ఎందుకంటే, పుట్టుకతో అతడు పర్షియన్ కాబట్టీ, పర్షియన్ కళలో చీనా శైలి మాతృకగా అనాదినుంచీ ఉండిపోయింది కాబట్టను... ఈ చిత్రం, బహుముఖ వ్యాఖ్యానాలతో కొనియాడబడ్డది. ఇన్డో-పర్షియన్ చిత్రశైలిలో దీనితో సరిపోలిన చిత్రం మరిలేదని వ్యాఖ్యాతలు ప్రశంసించారు. భారతీయ, పర్షియన్ కళారీతులలో, ఈ చిత్రం అతి ప్రశంసనీయమైన ప్రత్యేకతను చూపెట్టిందన్నారు!...చిత్రానికి పైభాగాన చిత్రకారుని పేరు పర్షియన్ భాషలో వ్రాసియున్నది. 'రాకిమ్ అబుల్ హసన్' అని...అతడు 'రచయిత'గా పిలుచుకున్నాడు. 'రాకిమ్' అనగా 'రచయిత' అని అర్థం. ఎందుచేతనంటే, రచయితా, కళాకారుడూ, ఇద్దరూ తమ రచనలకి ఒకే ఒక సాధనాన్ని అనగా కుంచెను ఉపయోగిస్తారు. ఇది మనదేశంలో లేకపోవచ్చును. ఇరాన్, చీనా, జపాన్‌లలో మామూలు వ్రాతకుకూడా కుంచె నుపయోగిస్తారు. అందులో చిహ్నమాత్రంగా చిత్రరూపకంగా ఉండే, లిపి శైలిలో వ్రాత అలవాటు అయి ఇప్పటి పరిణామాన్ని పొందింది. వారి లిపిలో చిహ్నలతోకూడిన భావస్ఫురణ, ఆ తూలికా విన్యాసాలలో విదితమౌతుంది.

ఈ చిత్రంలో శైలి పర్షియన్ అయినప్పటికీ, చిత్రణకు తీసికున్న భావంమాత్రం, భారతీయమైనది. ఎద్దు మెడల్లో బంగారు మువ్వలున్నవి కాలి మణికట్లువద్ద కంకణాలు అలంకరింపబడినవి కొమ్ముల కొనల్లో, బంగారు తొడుగులున్నవి. వృషభాలంకరణలో కావలసిన విశిష్ట లక్షణాలన్నీ హసన్ వాటిలో రూపొందించాడు. ఎద్దుమీద కాడి బహు సుందరంగా చూపబడ్డది. బండిని అలంకరించటం విషయంలో ఎక్కువ పర్షియన్ పద్ధతిని విదితంగా చూపించాడు. సవారీకి వేసిన మందిరానికి చేసిన అలంకారం అంతా పర్షియన్ పద్ధతిలోనే ఉన్నది. అందులో ఎడ్లను తోలుతున్న బండివాడూ, మందిరంలో కూర్చున్న వ్యక్తీ, పూర్తిగా పర్షియనులుగానే కనిపిస్తున్నారు.

బండీ చక్రాలనూ, ఎడ్లనూ, చిత్రించిన రీతిలో ఒక విశిష్టమైన ప్రత్యేకత—ఆకాలపు మొఘుల్ శైలిలో లేనిది—ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది...

బండీచుట్టూ ఉన్న భూమి గోధుమవర్ణంలో చిత్రింపబడ్డది. మొఘుల్ శైలికి ప్రత్యేకమైన అలంకారరీతి. అక్కడక్కడ చిన్న చిన్న పూల మొక్కలూ, గడ్డిపోచలూ, ఎంతో అందంగా చిత్రించబడినవి. ఈ ప్రకృతివర్ణనవలన, ఆ ప్రదేశం, గ్రామ పరిసరమని ద్యోతకమవుతున్నది. ఆ గ్రామ పరిసరంలో, హుషారుగా ఉన్న ఎడ్లు ఒక పరుగుకి ఉద్యుక్తమైయున్నట్లూ, బండీవాడు, చలాకీగా అదిలిస్తున్నట్లూ, మొత్తంమీద మనసు ఆనందకరమైన భావస్ఫురణను కలగజేస్తున్నవి. ఈ చిత్రంమీద పర్షియన్ భాషలో, "కల్యాణ ఆశీర్వాదంవల్ల, సౌభాగ్య మందిర ద్వారము ఎల్లప్పుడూ తెరిచియుండును గాక" అని, "సర్వేశ్వరుడు తప్ప మరి యే దైవమూ లేడని గట్టిగా చెప్పగలను" అని వ్రాసియున్నది. చిత్రం వెనుకవైపున పర్షియన్‌లో కవనం వ్రాయబడియున్నది. కవి తన్ను తానే సంబోధించుకుంటూ, ప్రకృతిలోనూ, పానీయంలోనూ, సఖీ సముఖంలోనూ ఉండే మాధుర్యాన్ని, మొఘుల్ ఆస్థానంలో ఉండే విశేషాలనూ వర్ణించిన పద్యసరళి అది...

అబుల్ హసన్ రచించిన ఈ 'వృషభరథం' ఇన్డో-పర్షియన్ మిశ్రమశైలిలో మచ్చుతునకగా, సాటిలేని చిత్రంగా కొనియాడతగినది. అయితే, హసన్ చిత్రశైలిని మరి యే చిత్రకారులూ ఆ కాలంలో, అనుసరించలేదు. అందువల్లనే, అతని ప్రత్యేకత, చిరంతనంగా నిలిచిపోయింది. కొన్ని ఆధారాల ద్వారా, అబుల్ హసన్ పిన్నతనంలో భారత దేశానికి వచ్చినట్లూ, తండ్రియైన ఆఖ్ రజా కళాకౌశలాన్ని తన ప్రత్యేకాలంబనకు ఉపయోగించుకొని, తన విశిష్టశైలిని ఏర్పాటు చేసికున్నట్లూ, మనకు తెలుసుంది.



# ద్వంద్వ జగత్తు

స్వాప్తి శ్రీ

ధరణి కాఠిన్య ధన్య సౌందర్య భరము
సతము బాధించు మమ్ముల సాదరముగ;
మస్తకము పైని కంటక మకుటమూని
కడుపునిండార నవ్వి ఎక్కసకెమాడు.

పేద నిండిన సౌఖ్యంపు నీడలోన
క్రీడ పండిన భ్రామిక ఖేదమందు
అలసియుండియు ఆనందమందినాము
జీవశక్తి యుక్తులమయ్యు చిక్కినాము.

జగతి విలసిల్లుచుండు బాష్పములమాల
ఉడుగణము నభోవీథిపై నుల్లసిల్లు
ఖేదమోదాల, కష్టసౌఖ్యాదికముల
నెవ్వ డెరుగంగనగు - దేనికేదికతమొ?

దినకరునిజూచి నుంతనవ్వినది సుమము
హైమకణమును గికురించె నరుణమూర్తి
ద్వంద్వములదాటె మానసోత్సాహ విధము
సాటిలేనిది ప్రేమ సయ్యాట మాట.

మరణమూలరూపమ్ము జన్మంబెయౌను;
మరణ మెక్కుడేయౌను జన్మంబుకంటె;
జనన మరణాల మధ్య వాసంబుమాది
కన్నులే లేవవు ప్రవాసకాలమందు.

అంబరమ్మును చుంబించు నబ్ధిరాజు
అంబరమ్మున విహరించు నమృతకరుడు
నైజకిరణాల రాత్రి క్షణక్షణమ్మ
భూ నభో జలమ్ములు కాంతి పూరితములు.

కాని, పట్టపగటి కటికచీకటి కోట్లు
జనుల మనములందు నదురుకొనును;
త్రావనెత్తె వెపుడు జీవకాంతులు మాకు
తిమిర రుచిమయంబు సమయపాత్ర.

చదలుభయద సాంద్రాంబుదాచ్ఛన్నమయ్యె
గాలివానలో జగమెల్ల కడకు తేలె,
వ్యసనమేఘాలు కరగి ప్రవాహములుగ
పారినట్టులు తోచె నా ప్రకృతియెల్ల.

వృక్షశాఖలరోదించు విహగకులము
గూళ్లలో శాబకమ్ములు కులుకుచుండు;
మాన్య చైతన్యదాతయై మహితమూర్తి
పద్మబాంధవు డుదయించు ప్రాక్తటమున.

తెల్లవారెను చీకట్లు తెల్లబారె
స్పష్టసందర్శనీయ మౌపసిక రేఖ;
జగము మాయ నిండినచాయ సౌరుమీర
మనసు వచ్చిన సుఖముల మలచుకొనియె.

మొగ్గ తనలోనె తానవ్వు సిగ్గులడర
ప్రసవకన్య మస్తకము కంపనముసేయు
గంధవహసూతి శతపత్ర శాంతజేరి
చిబుకమును బూనిచుంబన శ్రేయ మొసగు.

సప్తవర్ణని రంజన సంగ్రహించి
మోహకములౌ నగ లనేకములు ధరించి
సన్న జేయుచు కనుల, తుషారబాల
పొందు వేడివెలుగు వాని పొందుకలిమి.

సుమము లోకమ్ము, మరి భ్రమరముల మేము
మాటికిని గ్రోలుచుందుము మధుకణాలు;
ప్రభ్వియైన లోకమ్ము సేవకుల మేము
జగము దేవత, మరి ఉపాసకుల మేము.

చిరరుచిర తనూశోభన శ్రీల చేత
అవనిదేవత మాకు మోహంబు గొలుపు;
నిలువబడినారము కటిబద్ధులము మేము
పెద్ద కార్యమ్ము లందీర్ప విశ్వమందు.

ఉన్నత హిమనగముకంటె నున్నతులము;
ఎపుడు లేమేము నతులమై యెచటగూడ
వారినిధి పోలె మేము గంభీరులమును
సర్వదా ధీరులమె యాచు సాగగలము.

ధరణి జీవితమ్మాను ద్వంద్వముల చేత
ధరణి సేవితమ్మేను ద్వంద్వముల చేత
ప్రణయమే లేక సర్వమ్ము వంచనమ్ము
జగము ప్రణయ మాలికదాల్చి జాగృతమ్ము.

ప్రణయమే భక్తపాళి సాధనము సుమ్ము
ప్రణయమే గృహస్థులదైన ధనము సుమ్ము
భువికి దివికిని సమతను బూసగజేయు
మహితనియమమ్ము ప్రణయనామకము సుమ్ము.

రవి జగమ్మున నెపుడు దర్శనముగనెనొ
నాడె యైనది కవిదర్శనమ్ము భువిని;
దర్శనము సర్వులకు కవి దర్శనమ్ము-
మలచి చేయును ద్వంద్వ విమర్శనమ్ము.

నిత్యమును ద్వంద్వములయందె నెగడుచుండి
వానికి నతీతుడై కవి వరలుచుండు;
నాశరహిత మద్వైత మానందపథాను,
కవి మనము రస సరస మాకందమాను.

పావనమ్ము సాహిత్యైక జీవనమ్ము
అందరకు మాకు దయసేయుమయ్య దేవ!
ద్వంద్వజగము పూచిన శుభ ప్రసవరాశి
అర్చనావిధి నందుకోవయ్య దేవ!!



# పగిలిన పచ్చికుండలు

శ్రీ నార్ల చిరంజీవి

వెస్ట్ వంతెనకు దిగువుగా కాలవొడ్డునే రోడ్డు నానుకుని ఇరవై ముప్ఫయి పాకలు వరసగా ఉన్నాయ్. పెద్ద రైలు స్టేషన్‌కి పోయే ఆ రోడ్డు వస్తూ పోయే జనంతో కిటకిటలాడుతూంటుంది. ఆ పాకల్లో వొక చిన్నపాక విడిగా కాస్త ఎడంగా ఉంది. గవిల్లో ‘సీతాలు’ చేరగిలి కూచుంది. దీపంలేని ఇబ్బంది కనిపించడంలేదు. రోడ్డుమీది ఎలక్ట్రిక్ దీపం వెలుగుచారలు ఏటవాలుగా పాకలో పడుతున్నాయి. పాకవేపు చీకటి, రోడ్డువేపు వెలుగూ సీతాలుని సగం సగం పంచుకున్నాయ్. ఎదురుగా రోడ్డవతల సినిమాహాలు. సినిమా పాటలూ, రైలు ఇంజన్ల కూతలూ రోడ్డుమీది కోలాహలం ఇవేవీ సీతాలుని కదిలించడం లేదు. ఎక్కడో దూరాలకు అలిసిపోయిన కళ్లప్పగించి దేన్నో వెతుకుతోంది.

ఎవరో తనను తాకినట్టనిపించింది. చప్పున పక్కకి చూసింది. పొరుగింటి పిన్ని; ఆవిడ అన్నపుగిన్నె పట్టుకొచ్చింది. సీతాలు మొహంవేపు పరకాయించిచూసి, గిన్నెని తడికవేపు ఉంచింది. దగ్గరగా కూచుని—“ఏమేపిల్లా!” అని ఆప్యాయంగా పిలిచింది. ఆవిడ సీతాలుని కూతురుతో సమానంగా చూసుకుంటుంది.

“ఇట్టా కూడూనీళ్లూ మానేస్తే ఏంవన్నా లాభం ఉందంటే?... దీపమన్నా వెలిగించావు కావు. అయ్యో రాతా!... లే! గుప్పెడు మెతుకులు తెచ్చాను. ముందు తిను.

అని అన్నదా ఇల్లాలు సీతాలుని బుజ్జగిస్తూ.

“ఆకలేయడం లేదు పిన్నీ.”

“ఆకల్లేదని నాకు చెబుతున్నావంటే? మరీ ఇంత చోద్యమయితే ఎట్టాగే పిల్లా? కడుపు మాడ్చుకూర్చుంటే గంగని పడ్డకాపరం గట్టున పడుతుందంటే...?”

సీతాలు ఉలుకూ పలుకూ లేకుండా కూచుంది. సీతాలు మంచీ చెడ్డా పొరుగింటి పిన్నికి తెలుసు. ఎంతో చనువూ, ఇష్టమూను. అందుకే అన్నం తెచ్చింది. తినమన్నది. ఏ రకంగానూ ఆవిడ సీతాలు చేత ఆ గుప్పెడన్నం తినిపించలేకపోయింది. ఇంతకు ముందు రెండురోజుల నించీ ఇంతే. పిన్ని విసుగుతో లేచి సీతాలుని ఒక్క కుదుపు కుదిపి—

“ఇంత మొండెత్తిపోయినదానివి బ్రతికి బట్టకడతావని నమ్మకం ఏంవిటి...?”

అని అనేసి విసురుగా వెళ్లిపోయింది. పిన్ని వెళ్లిపోతూ పెట్టిన శాపం విని సీతాలు కళ్లుమూసుకుంది. మనసులో ఏదో వికారం ఉబుకుతోంది. “నేను మొండిదాన్నా?” అని పదేపదే గొణుక్కుంది. “మొండిదాన్నే అయివుంటే ఈపాటికే నా బతుకు ఎటో ఒకటు తేలిపోయి ఉండేది.” అని సణుక్కుంటూ తనకు తానే సమాధానం చెప్పుకుంది. చావు బ్రతుకుల సంధిలో రోగి ఏవో జ్ఞాపకాల్ని ప్రలాపించిన చందంగా, సీతాలు తన బ్రతుకులోయలోని వెలుగు నీడల్ని రూపించుకుంటోంది. ఈ బస్తీ కాపరానికి రాకముందు—ఆ మారుమూల పల్లెటూళ్లో తన జీవితం ఎలా గడిచిందో తళుక్కున మెరిసింది, మనసులో.

ఆ ఊరిబయట పాకలో తన పురిటిల్లు. చెట్లూ చేమలూ, పుట్టాగట్లూ తప్ప మరో ప్రపంచం రోజులవి. పైన ఆకాశం మెరిస్తే, కింద భూదేవి నవ్వితే, వొళ్ళు పులకరించిన బ్రతుకది. బొద్దుగా పొద్దుతిరుగుడు పువ్వల్లే పరిమళం చెడని అచ్చం తెలుగుకన్నె తాను. పురుగూ పుట్రా భయం ఎరక్కుండా, ఎండా వానా తేడా తెలీకుండా ఎదిగింది. పెరిగింది. చెరుకు బోదెల్లో, వంగపాదుల్లో, తుమ్మ బీళ్లల్లో, గడ్డివాముల్లో తిరిగేది. చెట్లనీ పిట్టల్నీ కవ్వించి కవ్వించి పాడేది, ఆడేది తాను.

ఆనాటి ఆ బొద్దుతిరుగుడు పువ్వేనా, ఈనాటి తాను? ఒక్క ఐదేళ్ళ బస్తీ కాపరంలో ఎంతగా మారిపోయింది? పిల్లా పీచూ లేకపోయినా వాడిన పచ్చగన్నేరు పువ్వులాగా పాలిపోయింది!

మొదట్లో, రాములు వెంటబడి కాపరానికి వొచ్చినప్పుడు ఈ బస్తీజనం, మేడలు వాడలు చూసి విస్తుపోయింది. సంజవేళ కందిచేలో ఎగిరిపోయే రంగు రంగుల పిట్టల్లా కనిపించారీ మనుషులు. చీకటి పడే వేళ ఎలక్ట్రిక్ దీపాలు వెలిగితే కళ్ళు జిగేల్ మన్నవి. తన ఊళ్ళో అయితే చీకటిరాగానే గొంగళి ముసుగెట్టి పడుకోవలసిందే! ఈ బస్తీలో రాత్రయినా పగలయినా వొకలాగానే తోచింది. కొత్తిలోకంలోకి జారివచ్చినట్టయింది.

అదేదో సినీమాకి రాములు తనని తీసుకుపోయాడు. వీధిభాగోతం తప్ప ఏమీ ఎరగని తనకి— అంతమందిలో కూచోవడం, దీపాలారపడం, తెరమీద మనుషులు మాటాడడం...అదంతా చూస్తుంటే గుండె గుబగుబలాడిపోయింది. తెరమీద ఒక మగాడు ఆ ఆడపిల్లని "రాణీ!" అని పిలచేవాడు. ఆ పిల్లకూడా 'ఓ రాజా!' అని వొయ్యారాలు కులుకుతో పిలిచేది. సినిమా అయిపోయి ఇంటికి వొచ్చాక రాములు తనని దగ్గరకంటా బిగువుగా లాక్కుని "రాణీ" అని అచ్చింగా, అట్టాగే అన్నాడు. తనూ వొళ్ళు పులకలెత్తి అప్రయత్నంగానే 'నా వరాల రాజా!' అని అనేసి, చప్పున సిగ్గుపడింది. చిరువెచ్చని నిట్టూర్పులో ఒకరికొకరు పెట్టుకున్న ఆ క్రొత్తపేర్లని ఎన్నెన్నిసార్లు జపించారో!

ఇప్పుడీ జ్ఞాపకాలవల్ల సీతాలు కళ్లు చెమ్మగిలినయ్. ఒక్కసారి కళ్ళార్పి, మళ్లా జ్ఞాపకాల్లో పడింది.

రోజులు గడిచేకొద్దీ బస్తీలో జనం వొ మురుగువాసనలూ, కొత్త భయాలూ వొకటొకటి అనుభవంలోకి వొచ్చాయి. ఎన్ని భయాలు వెంటాడితేనేం? తన 'రాజా'ని చూసుకుని అన్ని భయాల్ని మరిచిపోయింది. అతనంటే తన కెంత ఇష్టమో చెప్పడానికి ఈ మాటలు చాలవు. ఒకసారి ఏమయిందీ? తనని పుట్టింటికి తీసుకుపోదామని తండ్రి వొచ్చాడు. తండ్రి ఎందుకు వొచ్చిందీ తనకి తెలుసు. అన్నాలు తింటూంటే అల్లునితో మాట కలిపి చెప్పాడు కూడా. పుట్టింటికి వెళ్ళాలని తనకు ఎంత ఇదిగా ఉన్నా— రాముల్ని వొదిలి వెళ్లడం జరగని పనిగా తోచింది. వొదిలిఉండడం అంటే ఇద్దరికీ పిచ్చెత్తుతుంది! తప్పదు. ఒకవేళ తనను పంపుతానంటాడేమో రాములు. మాటజారవద్దని చెబుదా మనుకుని, చప్పున గదిలోకి వెళ్లింది. పిచ్చిరాజు, చంటిపిల్లవాడిలాగా బిక్కమొగం వేసుకుని కూచున్నాడు. తనని చూడగానే "వెళ్లిపోతావా?" ఇంచుమించు ఏడ్పుగొంతు పెట్టి అన్నాడు. తానూ వలవల ఏడ్చేసింది. పుట్టింటి ప్రయాణం లేదని అర్థమయ్యేలోగా ఇద్దరి కళ్ళు ఉబ్బిపోయాయి. ఏడవడానికి ఇందులో ఏముందని అడిగితే? ఏం జవాబు ఉంది? ఊహూఁ! చెప్పడానికీ చూపడానికీ వీలుకాని జీవితపు లోతులవి. నాటికీ నేటికీ పుట్టింటి మొహమే చూళ్లేదు మరి!

అలాంటి తీయని అనుభవాలు ఇపుడు గుర్తుకు తెచ్చుకుంటోంది సీతాలు. ఆ రోజుల్లో చక్కని ఇంట్లో కాపరం ఉండేవాళ్లు. కళకళ్లాడిన రోజుల్ని తలుచుకున్నంతసేపూ సీతాలు కళ్లు మిలమిల్లాడాయి. చిరుచెమటలు పోస్తున్నాయి. వెచ్చగా నిట్టూరుస్తూ ఊపిరి బిగబట్టి 'రాణీ' అని పిలుస్తున్నట్టు తోస్తోంది. తనకి చాలా ఇష్టమైన ఆకృతి తనని తాకినట్టు భ్రమ కలిగి వొళ్లు పులకరిస్తోంది. ఎదురుగా ఉన్న ఎలక్ట్రిక్ దీపం చల్లగా చిక్కని వెలుగుముద్దగా కనిపించింది!

ఆమె భ్రమ—భ్రమ మాత్రమే కాదు; గంటిటి కష్టంగా కూచున్న అవిణ్ణి తప్పించుకోడానికి ఎంతో ప్రయత్నించి, చివరికి సాహసించి, దూరి, పాక లోపలవున్న అన్నపుగిన్నె ఖాళీ చేసి, సీతాలు భ్రమ కరిగి చూసేసరికి తోకాడించుకుంటూ ఒక నల్లకుక్క వెళ్లిపోతోంది; నాలిక తుడుచుకుంటూ, తృప్తిగా దీపస్తంభం కిందికి చేరుకుంది. తన జ్ఞాపకాల దొంతర కూలిపోయినందుకు సీతాలు వెలిగా నవ్వింది. కాళీ గిన్నెని పాక మూలకి ..., మళ్ళా కలల్లోకి పోవాలని ప్రయత్నించింది. మనోతమస్సుని చీల్చి జ్ఞాపకాల్లో పెనుగులాడాలని ప్రయత్నించింది.

రాములు ఇప్పుడెక్కడున్నాడో, ఏం చేస్తుంటాడో ఊహించడం తనకి సులభమే! అతని సంగతి ప్రతీ చిన్న విషయం తెలుసు. అతనికోసం ఏంచెయ్యాలన్నా చేస్తుంది. కాని—ఏం చేయాలో మాత్రం తనకి తెలీకుండా ఉంది. అదే తెలిస్తే ఎంత బావుణ్ణు!......ఆలోచనలన్నీ అగ్నిజ్వాలలై చుడుతున్నాయ్. రాములు ఇంటికివచ్చి నాలుగురోజులయింది. ఇదేం కొత్తకాదు. ఐనా, తానీసారి భరించలేకుండా ఉంది. దారిద్ర్యాన్నీ, కన్నీళ్ళనీ నిర్జించ

లేకపోయినా, నిర్లక్ష్యం చెయ్యగలిగింది! కాని, ఈ బ్రతుకు మానసికంగా భరించలేకుండా ఉంది. తుఫానుకి చెట్టు పట్టుజారి నేలకూలే తీగెలాగా ఈ దిగుళ్ళతో సీతాలు కూలిపడుతోంది. నిలబడాలని ప్రయత్నించినకొద్దీ ఎడాపెడా గాలివానా దెబ్బలు మొహాన్ని ఈడ్చి కొడుతున్నాయ్. లాభంలేదు. ఇహ అతన్ని తాను కలుసుకుని తీరాలి. పీడకలవంటి ఈ బ్రతుకు మారిపోవాలి.

రాములు ఎక్కడుంటాడు?

అక్కడికి నాలుగున్నరమైళ్ళదూరంలో కాలవ కట్టమీదిపాకల్లోనే ఉంటాడు. తప్పకుండా ఉండి ఉంటాడు. నడిచిపోవడంతప్ప వేరేమార్గం లేదు. రెండుగంటల నడక. ఇప్పుడే బయల్దేరితే పదింటికల్లా వెళ్ళిపోవచ్చు...ఆలస్యం ఎందుకు?

లేచి నిలుచుంది సీతాలు.

కొత్తబలం పోసుకుంటున్నట్టుంది. పాలు పోసుకుంటూన్న వరిదుబ్బులాగా తోచింది. పాకలోకి తొంగిచూసింది. ఏముంది? విరిగిన మజ్జిగలాగా వెలుగూ చీకట్లు కలిసి ఏర్పడిన పొడలు. కంచాలు మంచాలు ఏనాడో అమ్ముడు పోయాయి. ఒకటో రెండో గుప్పిళ్ళ బియ్యం ఉండాలి. తనూ, తన 'రాజా' వెన్నెలతోటగా చేసుకున్న ఆ పాక వెలుగు పొడలచాటున కుములుతూన్న ముసిలి దానిలాగా ఉంది. తడిక విసురుగా మూసేసింది. తెల్లారి అన్నం తినలేదు. కి పచ్చి మంచి నీళ్లయినా ముట్టలేదు. అసలామాటే సీతాలుకి గుర్తు రావడంలేదు.

రోడ్డున పోయేందుకు ఎందుకనో మనస్కరించ లేదు. కాలవ కట్టనేపోతే దగ్గరకూడాను. పాకల వెనక్కి వొచ్చి, వంతెన వేపు సాగారింది. కట్టకింది నించి సరంగుల పాటలు వినిపిస్తున్నాయి. ఎగువున పడవలరేవుంది. రేవు దగ్గరవుతూన్న కొద్దీ సరంగుల పాటలు జోరవుతాయి. పాకలతిన్నగా వొచ్చాక బూతుపదాలు లంకించుకుంటారు. కట్టమీద నీడల్లో పాకలతాలూకు ఆడవాళ్లు మెసులుతారు. పడవల్లోంచి సరంగులు కాయా కట్రా విసిరేస్తుంటారు. పడుచులు వొయ్యారంగా వాటని వొడిసిపట్టుకుని పాకల్లోకి చేరేస్తుంటారు. చీకటి ముసుగులో జరిగే గుద్దులాటల నించి తప్పించుకుని సీతాలు వంతెన దగ్గిరికి చేరే లోగా ఒకటీ రెండు అరిటిపళ్ళ హస్తాలు దూసుకు పోయాయి. క్రమేణా పాకల్లోని పడుచుల నవ్వులూ, పడవసరంగుల పదాలు దూరమైపోయాయి.

దోసకాయ వాటంగా ఉన్న బస్తీని ఆ కాలవ నిలువుగా చీల్చుకుపోయింది. దాని కిరుపక్కలా తెగిపడిన దోసచెక్కల్లాగా బస్తీ. బస్తీ చివరకి చేరుతూన్న సీతాలు వొకసారి వెనక్కి తిరిగి చూసింది. పాకలకెదురుగా ఉన్న సినిమాహాలుమీది పెద్ద పచ్చదీపం దబ్బపండులాగా కనిపిస్తోంది. మసక వెన్నెల్లో బూడిదగీతలాగ ఉన్న కాలవకట్ట కాలి బాటనే సీతాలు ముందుకు నడుస్తోంది. నీళ్ళల్లో చేపలు ఎగిరే చప్పుళ్ళు, తుప్పల్లో, పొదల్లో కీచు రాళ్ళ రొదలూ తప్ప మరే శబ్దం వినిపించడంలేదు. మాసిన దుప్పటి కప్పుకున్నట్టు కాళీప్రదేశం! తల వొంచుకుని సీతాలు విసురుగా నడుస్తోంది. ఒకటి రెండు గులకరాళ్ళు కాలికి తగిలి, దొర్లుకునిపోయి నీళ్ళల్లో చప్పుడుచేస్తూ మునిగిపోయాయి. ఇంకా మూడుమైళ్లు పోవాలి తాను.

మనస్సంతా పాడుబడ్డ మఠంలాగా ఉంది. మధ్యమధ్య తొలకరి మెరుపల్లే రాములు గుర్తుకొస్తు న్నాడు. తాను కూలిపడిపోయేటంత బలంగా వేగంగా వొస్తాయి ఆ జ్ఞాపకాలు. అతన్ని కలుసు కోవాలనే మనోసంకల్పం మరింత బలంగా కలిగే సరికి నిలదొక్కుకుని ముందడుగేస్తుంది. ఏమైనా... అతని జ్ఞాపకాలు కడుపునొప్పిలాగా తెరలు తెర లుగా వొచ్చి, వొళ్లు తిప్పుతోంది.

తాను ఇల్లాలు. ఇంత రాత్రివేళ కట్టుకున్న మగణ్ణి కలుసుకునేందుకు వొంటరిగా బయల్దేరి వెళు తోంది. జీవనపటంమీద విషం చిలికి నల్లబడిన మచ్చవంటి స్థితి తనది. సీతాలు యుగయుగాల సతీ త్వంతో జ్వలించే ఏ సతీమతల్లికీ తీసిపోదు. నాగరిక ప్రపంచం చూపులనించి తప్పించుకుని, తన అణు వణువులో వొదిగి మిళితమైపోయిన ఒక దౌర్భాగ్య వ్యక్తికోసం వెళుతోంది. నడివేసగిలో తగలడే కొంప నించి పెనుగాలికి లేచిన మంటలు నాలుకలుసాచి మరోకొంపని చుట్టబెడుతున్నట్టు—రాముల్ని జ్వలింప చెయ్యడానికి అగ్నిశిఖవంటి సీతాలు కాలవకట్టనపడి వెళుతోంది...

## 2

రాములు సీతాలుని పెళ్లాడకముందు ఐదారేళ్ళ ముందునుంచీ బళ్ళ కార్ఖానాలో కొలిమివద్ద సమ్మెట మనిషిగా పనిచేసేవాడు. భగభగమండే కొలిమిలో ఎర్రగా కాలి కణకణమండే ఇనపబద్దీలు తీసి మేస్త్రీ దాలిమీద మోపడం తరవాయిగా—రాములు సమ్మె టను మెరుపులాగా విసిరేవాడు. చింతనిప్పుల్లాంటి కళ్లార్చి మేస్త్రీ 'వారెవ! కొడకా!...వెయ్ దెబ్బ!'

అని హుషారిస్తూంటే, రాములు చేతిలో సమ్మెట గరిడీ కర్రలాగా చక్రం తిరిగేది! ఐదు పది దెబ్బల్లో పైలు బద్దీలాంటిది కూడా మెత్తగా మెలికలు తిరిగేది. పగలస్తమానమూ మంటల్లో ఆడి, సంజవేళ మేస్త్రీ తానూ దుకాణం దగ్గిరికి పోయేవాళ్లు. ఆదా ఎక్కువ కనక మేస్త్రీ రెండు చటాకుల సారా తాగేవాడు. తానుమాత్రం ఒక్క లోటా కల్లు మాత్రం పుచ్చుకునేవాడు. కాస్త వళ్లు చల్లబడేది. నీళ్లోసుకుని కలో గంజో కడుపున పట్టించి పడుకుంటే ప్రాణా లెటో రెక్కలువిప్పుకుని పారిపోయేవి. తెల్లకు తెల్లారిలేస్తే మళ్ళా భగభగమండే కొలిమీ, ఎర్రగా కాలిన ఇనపబద్దీలూ, 'వారెవ! కొడకా!', సమ్మెటా తానూ తయారు...

కాలవకట్టుమీది ఇసకగుట్టమీద వెల్లకిలా పడుకున్న రాములు లేచి కూచున్నాడు. సమ్మెటపట్టిన నాటి తన కండరాలు ఈనా డేమయ్యాయి? వొళ్లు చూసుకున్నాడు. ఎడం చెయ్యి సాచి కుడి చేత్తో పిసికింత మాంసం ఉందేమో చూశాడు. ఉత్తతోలు తిత్తి వేళ్లాడుతోంది. రొమ్మూ, ముఖం అరిచేత్తో రుద్దుకుని మళ్ళా ఇసకమీద పడుకుని, ఆకాశంవేపు చూశాడు. కళ్లు మూసుకుని పెదవులు బిగనొక్కుకున్నాడు. పెళ్ళిచేసుకోటం తప్పయిందా? అని అనుకుని, కాదు కాదన్నట్టు తల అడ్డంగా ఊపాడు.

పెళ్ళయిన కొత్తలో కార్ఖానాలోని మిత్రులంతా తనవెంట దుకాణానికి వొచ్చేవాళ్లు. కాదనీ లేదనీ అనలేని మనస్సు తనది. రోజుకి పదీ, పన్నెండు డబ్బులు చెల్లించవలసివచ్చేది. తను తాగుతున్నట్టూ మిత్రులకిచ్చి దుబారా అయిపోతున్నట్టూ సీతాలుకు తెలియకుండా ఎంత ఇదయ్యేవాడు! సీతాలంటే చచ్చేటంత మమకారం! అవీ ఇవీ నమిలి వాసన రాకుండా చూసుకుని ఇంటికి మరీ వెళ్లేవాడు. ఎన్నాళ్ళు దాగింది కనక!...

'తాగుతున్నావా?' సీతాలు తన నడిగిన రోజున ఎలా నసికాడో ఇప్పటికీ మరుపు రాకుండా ఉంది......ఆ రోజున మామూలు కల్లు మానేసి, పక్కనున్న వాళ్ళతో పందెంవేసి రెండు చటాకులుపైగా సారా తాగాడు. దాని తగలెయ్యా! ఆ మోతాదు కాస్తా తన పరువు తీసింది. దగ్గిరికి పోతూంటే- -సీతాలు అరిచేత్తో తననోటిని మూసి దూరంగా తోసేసింది. ఆవేళ సీతాలు పెదవులు అందలేదు.

రాములు మళ్ళా లేచి కూచున్నాడు. ఇసక లోపల దాచిన సీసా బయటికి తీశాడు. దాన్ని ముద్దు పెట్టుకున్నాడు. రుచీ పచీ లేక పేళసరిగా ఉంది ముద్దు. బిరడాతీసి రెండుగుక్కలు తాగి సీసా మళ్లా దాచేసి పడుకున్నాడు. గుప్పిళ్లతో ఇసకని పిసుకుతున్నాడు. బద్ధకంగాఉన్న కళ్ళల్లో చురుకుపుట్టింది. ఆనాటి ఘట్టాలు వొకదానివెంట వొకటి ముసురుకున్నాయి. గట్టిగా నిట్టూర్చి "అట్టా కాలం గడిచిపోయినా బాగుండేది" అని గొణుక్కున్నాడు.

కాలం అలా గడవలేదు. ఒకరోజున ఎక్కణ్ణించో నడమంతరంగా ఒక చిక్కొచ్చి పడింది. బస్తీలోనూ, చుట్టుపక్కలా కల్లూ సారాలు తాగరాదని రూలొచ్చింది ఎక్కణ్ణించి ఎందుకీ రూలొచ్చిందో ఈనాటికీ రాములికి తెలీదు. పదేళ్ల అలవాటు. కుతి పుట్టి రోజ్లన్నీ తిరిగాడు. పాత స్నేహితుల్ని పలకరించాడు. చివరికి మేస్త్రీకూడా చెప్పా పెట్టకుండా వెళ్లిపోయాడు. తిరగ్గా తిరగ్గా చివరికి అతి రహస్యస్థలంలో ఒక అరగ్లాసుడు అర్ధరూపాయికి దొరికింది. నిషా కల్పించుకుంటేనే కాని కుతి తీరలేదు.

సీతాలుకి పువ్వులు తీసుకుపోవాలి కొత్త సినిమా చూపించాలి. అన్నిటికీ డబ్బేది? ఈ పాడు తాగుడికి డబ్బు ఖర్చయితే ఎలాగ? 'ఇన్ని తిప్పలెందుకు' మానేద్దామని అనుకున్నాడు. ఎంతకష్టమైనా సరే నిగ్రహం మంచిదనుకున్నాడు...ఏం లాభం! ఆవేళ సాయంత్రం మనసుకి కళ్లెంపెట్టి రాములు ఇంటికి బయల్దేరాడు. కాస్త దూరం పోయేసరికి వెనకాలే వొచ్చి, మేస్త్రీ చేయి పుచ్చుకున్నాడు. సెగతగిలిన వెన్నలాగ వెంటసాగాడు. సరాసరి సిటీబస్ ఎక్కి, ఇక్కడే, ఈ ఇసక గుట్టల తిన్నగా లోపలివేపు పాకలదగ్గర దిగారు. బస్తీ దుకాణాలవద్దఅలజడే వుండేదికాదు. ఇక్కడచూస్తే వందల కొద్దీ జనం. పెద్ద పెళ్లో, సంతో జరిగినట్టుగా ఉంది. అందులో చాలమంది బస్తీనించి వొచ్చిన వాళ్లే. ఆవేళ ఖర్చంతా మేస్త్రీదే. పొద్దుపోయి బస్తీలో ఇంటికి చేరేసరికి తలప్రాణం తోకకివొచ్చింది. జేబు ఖాళీ. సీతాలుకి పువ్వులులేవు. ఆరాత్రి మాటలూ లేవు. ఒకటే కన్నీళ్ళు. సగం సగం మైకంతో ఆ రాత్రి ఎట్టా గడిచిందో!

అలవాటయిన ప్రాణం అటూ ఇటూగా తేలింది. పగలు సమ్మెట వేస్తున్నా, రాత్రిళ్లు సీతాలు ఎదరకూచున్నా—చేతికందని కల్లూ సారాల

మీదనే మనసు. ఇదివరకటిలాగా కూనిరాగాలు ఆనందం ఇవ్వడంలేదు. తనని చిన్నపిల్లణ్ణిచేసి సీతాలు జోలపాడుతూంటే కళ్ళు మూతలుపడడం లేదు. వెచ్చటి నిట్టూర్పులు చెంపని తాకుతూంటే మెళకువ లేదు. ఊఁహూః అంతా మారి, మనసంతా మాయదారి సారామీదే అతుక్కుంది.

తరవాత తరవాత చాలా మార్పులు వొచ్చేయి. ఎన్నిసార్లు తలుచుకుంటే ఏం లాభం? మెట్లమీంచి జారిన చెంబు, మెట్లన్నీ దాటి నేలమీదకూడా మరింత దూరం దొర్లుతుంది. తనూ అంతే. నిషా, నిషా కావాలి. తీపికల్లు చాలదు. నీళ్ళసారా పనికిరాదు. అడ్డమైన గడ్డీవేసి పులుపెక్కినది కావాలి. వొళ్ళూ మనసూ తిమ్మిరెక్కాలి. రాత్రిళ్లు ఇంటికి చాటుగా వొచ్చి ముసుగుతన్నేవాడు. ఏ అపరాత్రో సీతాలు కుమిలి కుమిలి ఏడుస్తోంటే—తనూ లేచి ఏడ్చేవాడు. కష్టాలు, దవడలు తోసుకుపోయి వికారంగా తయారయ్యాడు.

"ఎందుకిలా తాగుతావ్? నన్ను చూసయినా మానవూ?" అనేది సీతాలు. పాపం! ఎంత బిక్కమొగం వేసుకుని అడిగేది! తను నిస్సహాయంగా కళ్లప్పగించి తల వేలాడేసేవాడు. పిచ్చి సీతాలు ఇంకేం అడుగుతుంది?

ఏమయితేనేం, దొంగ సారాకోసం తన బ్రతుకు చిచ్చునపడింది. కొన్నాళ్లు రైలుమీద చిట్టడవుల్లోకి పోయి అక్కడ మస్తుగా తాగివొచ్చేవాడు. బస్తీలోనే రకరకాలుగా దొంగసారా దొరికేది. తాగుడు జోరయినకొద్దీ పనిపాటలు తగ్గి ఆదాతగ్గింది. నిషాకోసం స్పిరిట్ తాగేవాడు. చౌకగా దొరికేదదే. కడుపులో నొప్పి, కళ్ళు తిప్పు వొచ్చినా స్పిరిట్ సారా రుచి తగిలింది. రానురాను అదీ దొరకలేదు.

సమ్మెట ఎత్తే వోపిక తగ్గింది. దగ్గు...పొడిదగ్గు పుట్టింది. బొమికలు బైటపడ్డాయి. ఏ నెలకో ఒకసారి గుక్కెడు మంచి సారా, రెండు చీకులూ దొరికితే ఆరోజు పెద్దపండుగ! తతిమ్మారోజుల్లో తను తాగుతున్నది తెల్లకిర్సనాయిలూ, కుంకుడు రసం కలిసిన మరేదో పానీయం...బంగారంవంటి సంసారంలో ఇలా చిచ్చురేగింది!

ఇసకగుట్టమీంచి రాములు లేచాడు. అన్ని జ్ఞాపకాలతో కళ్లు తడిసిపోయాయి. ముక్కుల్లో చెమ్మపూరింది. "సీతాలూ! నీరాజా చచ్చిపోయాడే!" అని గొణిగాడు. ఆకాశంలో తెల్లచుక్కలు వొకటొకటే మాయమవుతున్నాయి. పడమటగా ఒక మెరుపు మెరిసింది. రాములు కళ్లార్పాడు. ఆలోచనలన్నీ తెగిపోయాయి. '...!' అని అనుకున్నాడు. ఒక్కసారిగా లేనిపోని గాంభీర్యం తెచ్చుకుని గుట్టమీద కూచున్నాడు. సీసా ఇసకలోంచి లాగాడు. తాగబోతూంటే ఆవాళ సాయంత్రం అనుకున్న ఆలోచనేదో లటాలున మెరిసింది.

నాలుగురోజులుగా బస్తీఅంతా చెడ తిరిగాడు. ఇంటికి వెళ్ళడం లేదు. ఉత్తిచేతుల్తో వెళ్ళదలుచుకోనూ లేదు. తిరిగినచోటు మళ్లా చూడకుండా తిరిగాడు. చివరికి ఏమీ లోచక రైలుస్టేషన్‌కి వెళ్ళాడు. తింటానికి ఏమీ దొరక్క ప్లాట్‌ఫారం అంతా తిరిగి చూశాడు. అడుక్కోడానికి అభిమానం అడ్డొచ్చింది. ఏదన్నా కూలిపని చెయ్యడానికి వోపిక లేదు. ఇనుపతల పుల్ల అవతల వెయ్యడానికే అలుపొస్తుంది! చివరికి పంపువద్ద ముఖం కడుక్కుని, కడుపునిండా నీళ్ళు తాగి ఒక బెంచీమీద కూచున్నాడు. కాసేపటికల్లా ఒక నిండుపాటి ప్రయాణీకుడొకాయన వచ్చి అదే బెంచీమీద కూచున్నాడు. లాల్చీ జేబులోంచి పర్సు బయటికి పొడుచుకొస్తోంది. ఆ విషయం ఆయన గమనించనేలేదు. అటూ ఇటూ మెసిలి కూచోడంతో ఆ పర్సు కాస్తా జారి బెంచీమీద పడింది. ఇంతలో బండి రావడమూ, ఆయన అదావుడిగా లేచిపోవడమూ జరిగింది. రాములు ఇదంతా చూస్తూనే ఉన్నాడు. చప్పున పర్సుతీసి దాచి, చకచకా నడిచి రోడ్డూ, పార్కూ, కాలవా అన్నీ దాటి వచ్చాడు. ఒంటరిగా కూచుని పర్సుతీసి చూశాడు. రెండొందల రూపాయలు! అబ్బా ఎంత డబ్బు!

చప్పున సీతాలూ, సంసారమూ గుర్తుకొచ్చింది. పాపం ఎంతబాధ పడుతోందో! ఏడుస్తోందో! ఈ డబ్బు ఇంటికి తీసుకుపోతే, నాలుగు నెలలపాటు హాయిగా జరిగిపోతుందికదా......కాని, రాములికి డబ్బుని, చూడగానే నాలిక పిరగలాక్కుపోయినట్టయింది. మంచి, కమ్మని సారా తాగి చాలా రోజులయింది. ఈరాత్రి ఆఖరుసారిగా మస్తుగా తాగి, తెల్లారేసరికి ఇంటో ఉంటే చాలా, చాలా బావుంటుంది.

తన మనస్సులో సీతాలూ, సారా సీసా దెబ్బలాడుకోడం రాములికి స్పష్టంగా తెలుస్తూనే వుంది. సీతాలుని నెట్టి సారాసీసా మనస్సుని ఆక్రమించింది. మంచి సారా! బస్తీలో కన్నా—పల్లెకివెళ్ళి తాగి

తేనే మంచిది హాయిగా ఉంటుంది...ఇంకేం- పకె వేపు పరిగెత్తాడు.

సరే, తర్వాత మామూలే...ఇదే గుర్తుకు వచ్చింది. రెండుగుక్కలు తాగి ఈరాత్రే ఇంటికి పోవాలనుకున్నాడు. జేబు తడిమాడు. నిండుగా ఉంది. సగానికి మిగిలిఉన్న సీసాని చూశాడు. రెప్పలు బరువెక్కుతున్నాయి. కళ్ళనించి నీళ్ళు జారుతున్నాయి. ఎందుకో తెలీదు...హుషారు దిగజారుతున్నట్టు తోచింది. అదే జరిగిందా ఏడ్పు కన్నీళ్ళా...

లేచి, బస్తీవేపు బయల్దేరాడు. పూర్తిగా చీకటి. సముద్రం వేపునించి నల్లని చిక్కనిమబ్బులు వొచ్చి ఆకాశాన్ని ఆక్రమించుకున్నాయి. మబ్బుల చాటున నక్షత్రాలు పగిలిపోతూన్న బుడగల్లాగా తోస్తున్నాయి. చలిగాలి వీస్తోంది తాచుపాములాగా కాలవ పరుగుతీస్తోంది. ఎడంచెత్తో చొక్కా కాలరు బిగించి మెలివేశాడు. మధ్యమధ్య సీసాలోంచి ఒక్కో గుక్క తాగుతున్నాడు. తాగుతూన్న కొద్దీ నరనరాల్లో జ్వాలలు రేగుతున్నై. ఎన్నడూ లేనిది ఏదో ఆరాటం వెలికి దూకుతోంది. మాంచి నిషా కాబోలనుకున్నాడు. వొళ్లు ఉబుకుతోంది. బట్టలు బిగుతుగా చిరాగ్గా ఉన్నాయ్. ఊడ తీసేస్తేనే బావుండును! కళ్ళు మెరుస్తున్నాయి వాహ్! చాలా కాలానికి నిఖార్సయిన 'మందు' గొంతులో పడింది. నెత్తురు అల్లరి పెడుతోంది. చురుగ్గా ముందుకు నడుస్తున్నాడు.

ఎంత నడిచినా తరిగినట్టే లేదు. 'వెనక్కి నడుస్తున్నానా? లేదే! అదే బస్తీలైటు కనిపిస్తుంటేనూ!' అని అనుకున్నాడు. ఎక్కడో వానకురుస్తున్నట్టుంది. తడిసిన మట్టివాసన. చీకట్లో కాలిబాట కనిపించీ కనిపించనట్టుంది. మనస్సేమీ పనిచేయడంలేదు. పాదరసంలాగా నెత్తురు ప్రతి నరంలోకి పరుగెత్తి పొంగుతోంది. ప్రతి నెత్తురుచుక్కా, కండా చలించినట్టుంది. విరిగిపడేముందు ఉధృతంగా పైకెగిరిన కడలి తరంగంలాగా లోలోపలి కోరిక ఏదో ముఖంలోకి పొంగి చెక్కిళ్ళూ, నుదురూ పెళుసెక్కాయి. చాలాకాలంగా నిద్రపోతున్న యౌవనం ఏదో మనస్సుని పట్టుకుంది. ఆటగుర్రంలాగా కదను తొక్కుతోంది. నిఖార్సయిన మందు మహాత్యం కాబోలు! అంత చల్లగాలిలోనూ మండుతూన్న కాష్టంలాగా ఉంది వొళ్లు!

మెరుపులు, మెరుపులు, ఒకదాని వెంట ఒకటి, బస్తీవేపు మబ్బుల్లేవని తోచింది. బాట వేపు చూశాడు. మెరుపు తళుక్కుమంది. ఎవరో నీడలాగా కనిపించారు. తనలాగే ఎవరో. మళ్ళా మెరుపు మెరిస్తే బావుండును. తనకేం, మహారాజా. డబ్బుంది. అందులోనూ ఆకలిగొన్న సింహంలాగా ఉంది తన పని. ఐనా, ఆ వచ్చేది ఎవరో చూడ కలిగితే...ఆడదే అయితే ... మెరుపొచ్చినప్పుడు మబ్బు చీలినట్లే మెదడు చీలిపోయింది...తటాలున మెరుపు మెరిసింది...ఇరవై గజాల్లో చీర...బస్తీనించి వొస్తోంది.

రాములు నిలిచిపోయాడు. ఆఖరుగుక్క తాగేశాడు. నెత్తురు దూకుతోంది. ఒకసారి ఆపాదమస్తకం వణికింది. భయమా? కాదు—తృష్ణ. మండిపడుతూన్న జ్వాల. కిందపెదవి కొరికాడు. చిట్లి నెత్తురు చెమర్చింది. నాలికమీద నెత్తురు రుచి...

సీసా కాలవలోకి విసిరేశాడు. ఇంతసేపూ ఉన్న ఆరాటం ఏమిటో అర్థమయింది...

ళ్లో 'థప్' మన్న చప్పుడికి సీతాలు ఉలిక్కిపడింది. నీరసంగా ఒక కల కంటోంది. అది కాస్తా చెదిరిపోయింది. తనకో బిడ్డ ఉండిఉంటే, ఎలా ఉండేదా అని ఆ కల! ఆ బిడ్డనే సర్వస్వంగా చూసుకుంటూ బ్రతికేది. తన బతుకు ఇంత పాడయ్యేది కాదుకదా! నడవలేక నడవలేక ఈడ్చుకుంటూ నడుస్తోంది. తలెత్తకుండా నడుస్తోంది. ఆఖరిసారిగా కురుస్తున్న కన్నీటిని కూడా తుడుచుకోలేకుండా ఉంది. ఆపుకోనూ లేదు...ఎవరో తనని నొక్కేస్తున్నారు.... మొదట ఏదో తగిలింది. కొండచిలువ చుట్టేసినట్టు చుట్టేస్తున్నారు. చెమటకంపు. సారాకంపు. ఇంతసేపూ ఊహిస్తూవొచ్చిన బిడ్డకూడా గిలగిల లాడుతున్నట్టుతోస్తోంది. బొమికెలు పెట పెటమంటున్నాయి. అమ్మ బాబో...ఎవరో...తనని చెరిచే ప్రయత్నం చేస్తున్నారు. 'కెవ్'మని అరిచింది. ఆ అరుపుతోనే గుండె ఆగిపోయింది...

రాములు గిలగిల్లాడే చేపని వొడిసి పట్టినట్టు చేతులు బిగిస్తున్నాడు. రొమ్ముకి నొక్కుకున్నాడు. తాచుబాము బుసలాగా చేతుల మధ్యనించి బుస వినిపించి సన్నగిలుతోంది. రాములుకు తాను తూలిపోతూన్నట్టు తోచింది. పట్టు వదల్లేదు. కింది పెదవి కొరికి

నెత్తురు చవి చూశాడు. కాళ్ళూ చేతులు మెలిక లేశాడు.

'కెవ్'మన్న కేక ఎక్కణ్ణించో నూతిలోంచి వినపడ్డట్టుగా ఉంది. ఆ గొంతు ఎక్కడో విన్నట్టే ఉంది. ఒక రాయి వచ్చి నవరగంతను కొట్టినట్టు, ఆ 'కెవ్' మన్న స్వరం ఎవరిదో గుర్తు వొచ్చింది.

'ఆఁ' అని మాత్రమే నీరసంగా అనకలిగాడు. రాములు చేతుల్లో సీతాలు మంచుముద్దయింది. మెలికలుపడ్డ కాళ్లూ చేతుల్ని వొదిలించుకోడానికి అవకాశం లేదు. ఎక్కడో ఎత్తయిన పర్వతాగ్రంనించి లోయలోకి దొర్లినటు తనకి తోచింది. ఆ దొర్లడంలో సీతాలు పాముగాటి జుట్టు రాములు మెడకి చుట్టుకుని బిగుసుకుపోయింది!...

ఒకే ఒక నిమిషం!

కాలవలో ఒకసారి 'బుడుంగు' మని చప్పుడయింది. అంతే. పాతికేళ్ళన్నా నిండని ఆ దంపతుల జీవితాల్ని మింగి కప్పనితిన్న పాములాగే కాలవ, కారు నల్లని ఆకాశంకింద గంభీరంగా పోతోంది. కట్టమీద కంకరరాళ్లమీద చిందిన నెత్తురు మడుగు మాత్రం మన అందరికోసం ఇంకా పచ్చిపచ్చిగా మెరుస్తూనే ఉంది!!



# మన

శ్రీ ఉప్పల రాజగోపాలరావు

ఆటవెలదులతోడ నీవూ
సూటిగా హృదయాలు కదిపీ
నాటకము లాడించినావూ
తేటమాటలతో

ఆశపాశములెల్లఁ ద్రెంచి
దేశమంతటఁ ద్రిమ్మరించి
ఆశువున వివరించినావూ
ఆశయము లెల్లన్

తెలుగు జిలిబిలి పలుకుతేనెల
చిలుకఁ జేసితి కవితలోపల
తెలుఁగుసతి నీనాల్క పైనను
నిలిచి నాట్యము సేయగా.

# దినదినమునకు ఇంక స్వచ్ఛమైనటువంటియు, ఇంక మనోహరమైనటువంటియునైన చర్మము






రెక్సోనాతో ఈ అ    మైన మార్పును మీరు తెచ్చుకొంటారు



రెక్సోనాయొక్క కేడిల్‌తో గూడుకొన్న నురగను మీ చర్మముమీద మెల్లగా రుద్ది తరువాత కడిగివేయండి. మీ చర్మము దినదినమునను ఇంక మృదువుగాను, ఇంక మెత్తగాను అగుటను మీరు చూస్తారు. మరియు మీరు క్రొత్త ఆకర్షణను తెచ్చుకొంటారు.



## రెక్సోనా*

### ఇది ఒక్కటే కేడిల్‌తో గూడిన సబ్బు




* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిస్టర్డ్ పేరు.

RP. 118-50 TL

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్‌వారి తరఫున ఇండియాలో తయారుచేయబడినది

# బ్రౌనుదొర జీవిత విశేషములు

## నిఘంటు నిర్మాణము

శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

బ్రౌనుదొర రచనలలో ఆంధ్ర పండిత లోకమును విశేషముగ ఆకర్షించినవి అతని నిఘంటువులు. అతనికి నైఘంటికునిగ వచ్చినంత పేరు ఇంక దేనివలనను రాలేదు. అతడు వ్రాసిన వాచకములు, వ్యాకరణము ఆంధ్ర పండితలోకమున అంత ప్రశస్తి సంపాదింపలేదు. అవి, ఆంధ్ర భాష నభ్యసింపగోరు పాశ్చాత్యులకును, ఆంగ్లము నభ్యసింపగోరు దేశీయులకును ఉపయోగపడుటకై వ్రాసినవేగాని, ఆంధ్ర పండితుల కొరకుగాదు. ఈ గ్రంథములకు నిఘంటువులకు వచ్చినంత పేరు రాకుండుటకిదియే ముఖ్య కారణము.

ఈతని నిఘంటువులు పండిత పామర రంజకములు. అకారాదిగా తెలుగునకు నిఘంటువును కూర్చుటలో అతడు మొదటివాడు కాకపోయినను, అతని నిఘంటువులు నాటికి నేటికి కూడా వైశిష్ట్యమును కలిగియున్నవే. కొన్ని విషయములలో మార్గదర్శకములే. అవి వ్యావహారిక భాషావాదులకును, గ్రాంధిక భాషావాదులకును గూడ కావలసినవే. బ్రౌనుదొర నిఘంటువులకు ముందే సుప్రసిద్ధముగనున్న నిఘంటువు, 1821 లో 'కాంబెల్' (*Campbell*) దొర ప్రచురించినది. అక్షరక్రమముగ నున్న నిఘంటువులలో ఇది ప్రథమ నిఘంటువని శ్రీ జయంతి రామయ్య పంతులు గారి అభిప్రాయము.1.

బ్రౌనుదొర నిఘంటువుల కన్న ముందే యున్న నిఘంటువులలో, జె. సి. మారిస్ (*J. C. Morris*) దొర కూర్చిన దొకటి. దీనిని కాలేజీ బోర్డువారు 1835—1839 సంవత్సరముల నడుమ ప్రచురించిరి. ఇది ఉత్తమశ్రేణికి చెందినదైనను, బ్రౌనుదొర దీని నెందులకో పేర్కొనలేదు. బ్రౌనుదొరకు ముఖ్యముగా సాయపడిన నిఘంటువులు రెండట. మొదటిది 'కాంబెల్ దొర' నిఘంటువు. రెండవది 'విల్సన్' (*Wilson*) దొర ప్రకటించిన సంస్కృత నిఘంటువు. నిఘంటు నిర్మాణవిషయమున రెండవది బాగుగ తోడ్పడినదట.

బ్రౌనుదొర పేర్కొనిన తెలుగు నిఘంటువులలో ముఖ్యమైనది, మచిలీపట్టణమునకు చెందిన మామిడి వెంకయ్యగారి యొక్క ఆంధ్రదీపిక. ఇది 1816లో పూర్తిచేయబడినదట. 1848 లో మద్రాసులో ఒక ముద్రణము జరిగినది. తెలుగు కావ్యములలో ఉపయోగింపబడిన పదములు మాత్రమే ఇందు కలవనియు, వ్యావహారిక భాష జోలికి ఇది పోలేదనియు బ్రౌనుదొర వ్రాసెను.2

ఆంధ్ర భాషార్ణవము, మరియు దానివంటివే పద్యములలోనున్న ఐదు నిఘంటువులను, అకారాదిగా కూర్చి, బ్రౌనుదొర ఉపయోగించుకొనెను. కాని ఈ నిఘంటువులలోని పదజాలమునందు క్రియలకంత ప్రాముఖ్యము లేదనియు, క్రియలే ఏ భాషకైనను ప్రాణమువంటివనియు బ్రౌనుదొర అభిప్రా

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక— భావ; మార్గశీర్షము.

2. "*The Dipica,* ఆంధ్రదీపిక. *A Dictionary of Telugu explained in Telugu written by* మామిడి వెంకయ్య *at Masulipatam. It was completed in the year 1816. A duodecimo edition of this book was printed at Madras in 1848: but is far from faithful. The Dipica gives a mere selection of the words used in Telugu poetry. The ordinary Telugu of common life is but slightly noticed.*" (*C. P. Brown's Telugu - English Dictionary ; Page VIII ; 1852 Edition.*)

యము పడెను.3 ఇవికాక, ఆంధ్రభాషాభూషణము4, ఆంధ్రనామసంగ్రహము5, కర్కంబాడి నిఘంటువు6, ఒరంగల్లు పదజాలము7—అతనికి బాగుగ ఉపయోగించినవి. ఈ కర్కంబాడి నిఘంటువు అనేకములగు నిఘంటువుల చేరికవలన ఏర్పడినది. దీనియందు; ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రనామశేషము, వేంకటేశ నిఘంటువు, సాంబ నిఘంటువు, విష్ణు ఆంధ్రము8 మొదలగువానిలోగల పదజాలమంతయు కలపిట. దీనిని బ్రౌనుదొరయే సిద్ధము చేయించెను. ఇంక, ఒరంగల్లుపదజాలము (ఒరంగల్లు దేశీయ తెలుగులు) అనునది మామిడి వెంకన్నయొక్క ఆంధ్రదీపికకు పరిశిష్ట భాగము కావచ్చుననియు, దానికర్త పేరు తెలియుట లేదుగాని, వెంకన్నయే దానినికూడ చేసియుండవచ్చుననియు బ్రౌనుదొర వ్రాసెను.

ఇవిగాక కన్నడ, 9 10 వంగ, 11 సంస్కృత 12 భాషల నిఘంటువులనుగూడ పరీక్షించి, తనకు పనికివచ్చునంతవరకు బ్రౌనుదొర వానినిగూడ వినియోగించుకొనెను. వృక్షశాస్త్రము మొదలగు శాస్త్రములకు సంబంధించిన పదముల అర్థములను వ్రాయుటకు, ఆయాశాస్త్రములకు సంబంధించిన ఆంగ్ల, సంస్కృత నిఘంటువులను పరిశీలించెను. ఉదాహరణముగ మనము 'క్వాథశాస్త్రము'13 అను వృక్షశాస్త్ర సంబంధమైన పదములుగల 'పదజాలము'ను గ్రహింపవచ్చును. ఇట్టి శాస్త్రములకు సంబంధించిన పదములు, దేశీయ సంకేతములలో కూడ కొందరికి తెలియవని బ్రౌనుదొర వ్రాసెను.14 నిఘంటువు సాధ్యమైనంతవరకు సంపూర్ణముగా నుండవలెనను అతని పట్టుదలయే ఈ కృషికి మూలము.

ఈవిధముగ వివిధభాషల నిఘంటువులనుండి, శాస్త్రములనుండి, అంతకు పూర్వమున్న ఆంధ్రభాషా నిఘంటువులనుండి పదములను కృతజ్ఞతతో గ్రహించుటయేగాక, తాను స్వయముగ మహాపండితుల

*3. "The Andhra Bhash Arnavam, a vocabulary of synonymes, in verse. This and five more similar works have been re-arranged alphabetically at my desire. All the native vocabularies are deficient in verbs whereas verbs are the most delicate and peculiar parts of the language."*

*(Ibidem ; Page VII)*

*4. "Andhra Bhasha Bhushanam* ఆంధ్రభాషాభూషణము *a vocabulary of Synonymes, in verse." (Ibidem : Page VII)*

*5. "A vocabulary written in verse"*

*(Ibidem ; Page VII)*

*6. "The* కర్కంబాడి నిఘంటు *an alphabetical glossary, framed at my desire : it contains all the words found in the* ఆంధ్రనామసంగ్రహం, *in the* ఆంధ్రనామశేషము, *in the* వెంకటేశ నిఘంటు *and in the* సాంబ నిఘంటు". *(Ibidem : Page X)*

*7. "The* ఒరంగల్లు *Orangallu Glossary : this is alphabetically arranged, and is a supplement to Mamidi Vencanna's Andhra Dipica : it is anonymous : and probably is the work of the same author. The only title is* దేశీయ తెలుగులు, *that is, local words, or dialects. But it explains many expressions used in the leading poems." (Ibidem : Page XI)*

*8. "Vishnu Andhram. A glossary' included in the Karkambadi Nighant': (Ibidem ; Page XIV)*

*9. "Kannadi English Dictionary by Reeve. (Ibidem. Page X)*

*10. Rottler's Dictionary, Tamil and English (Ibidem, Page XII)*

*11. Haughton's Bengali and English Dictionary (Ibidem. Page IX)*

*12.* శబ్దకల్పద్రుమము *by Radha Kanta Deva* (వంగలిపి) *(Ibidem. Page XII)*

*13. "The* క్వాథశాస్త్రం *A Botanical Vocabulary in Sanscrit with Telugu synonymes" (Ibidem, Page XIII)*

*14. "Some Telugu words which I have copied from the glossaries marked ABA,* (ఆంధ్రభాషార్ణవము) *or Kark:* (కర్కంబాడి) *or Q* (క్వాథశాస్త్రం) *are unknown to learned natives." (Ibidem, Page XIII)*

సాయముతో తెలుగులోని ఉద్గ్రంథములను చదివి, వానిలోని వివిధ పదముల నన్నింటిని ఎత్తి వ్రాసికొని, తన నిఘంటు నిర్మాణమునకు సామగ్రిని కూర్చుకొనెను. ఈ సందర్భమున వ్రాయుచు, విశేషముగ పరిశ్రమ జరుగని భాషకు నిఘంటువును నిర్మించునపుడు, సులభముగ తప్పుదారి త్రొక్కుట జరుగునని వ్రాసెను.[15] ఇట్లు, బ్రౌనుదొరకు 1826 లో భారతము చదువుచున్నప్పుడు కల్గిన ఒక అనుభవమును గూర్చి తెల్పుట అప్రస్తుతము కాదు. అతనికి భారతము చదువుటయందు తోడ్పడిన విద్వాంసుడు, కష్టమైన పదములకు వ్యావహారికాంధ్రముందుగాని, సంస్కృతములో గాని, హిందీలో గాని అర్థము చెప్పెడివాడట.[16] ఆ పదమునకు ఆ యర్థము బ్రౌనుదొర వ్రాసికొనెడివాడు. ఆ పదమే గ్రంథమందు మరల మరల రాగా, ఆ పండితుడు దానికి సందర్భానుసారముగా అర్థము చెప్పుచు వచ్చెడివాడట. కొంతసేపటికి, ఒకే పదమునకు పరస్పర విరోధముగల అర్థములు రాగా, బ్రౌనుదొర అతనిని "ఏమిటీ వింత?" అని ప్రశ్నించెనట! అందులకా పండితుడు, "అయ్యా, మీరిలా నేను చెప్పేదంతా వ్రాసుకొంటూ, చివరికి నన్నిలా నిలదీసి అడుగుతే నేనేమి చేస్తాను. ఒకవేళ మీ రడిగిన మాటకు నాకు అప్పుడర్థం తెలియకపోవచ్చు. లేదా సమానార్థక పదం ఏదీ అప్పటికప్పుడు తట్టకపోవచ్చు," అన్నాడట! అప్పుడు బ్రౌనుదొర నవ్వి, "మరి, మీరిలా నన్ను తప్పుదారి త్రొక్కించడం భావ్యమా" అన్నా కాని, ఈ క్రింది వాక్యము ఆ పండితుని గురించియే బ్రౌనుదొర అన్నది—అతని యొక్క సహృదయతకు తార్కాణము. "*The pandit was a sound scholar but not accustomed to construing.*"

ఈ కార్యమున తనకు సాయముచేసిన పండితులను గురించి బ్రౌనుదొర "వారికి సంస్కృత వ్యాకరణము పరిచితము. కాని, వారి మాతృభాషకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటకు వారికంత సంసిద్ధత లేదు," అని వ్రాసెను.[17] ఈ దురవస్థకు కారణము, "సంస్కృతం వస్తే, తెలుగు వచ్చినట్టే," అను దురభిప్రాయము పండితులలో, కొందరియందు ప్రబలియుండుటయే! ఇది ఇప్పుడైనను పూర్తిగా పోయినదా? ఈ అభిప్రాయము ప్రబలుటకు ముఖ్యకారణము, తెలుగు తత్సమపదబహుళముగుట.

అట్లు అనేకములగు వ్యయప్రయాసలకోర్చి, బ్రౌనుదొర తన నిఘంటువులను సిద్ధముచేసెను. ఇంగ్లీషు—తెలుగు నిఘంటువునకు సంబంధించిన ప్రణాళిక 1832 లోనే సిద్ధమయినను, అచ్చువేయుట ప్రారంభించునప్పటికి, అంతయు మరల వ్రాయవలసి వచ్చెనట.[18] 'షేక్స్పియరు' మొదలైన ఆంగ్ల ఉద్గ్రంథములను క్షుణ్ణముగ అంతకు పూర్వమే చదివి యుండుటచే, తానా పనికి సిద్ధముగనే యుంటినని అతడు వ్రాసెను.[19] తనతోటి పనివారుకూడ, తనకు ఆంగ్ల సాహిత్యమునందున్న పాండిత్యమునకు మెచ్చుకొని, తనకు 'బైబులు', 'షేక్స్పియరు', 'మిల్టను'లు నోటికి వచ్చినట్లున్నదని పలికెడివారని కూడ బ్రౌనుదొర వ్రాసెను.[20] ఈ ఇంగ్లీషు—తెలుగు నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము, ఆంగ్ల సాహిత్యము మనవారికి అందుబాటులోనికి రావలెననునది.[21] ఇట్టి సదుద్దేశముతో శ్రమించి, ఉద్దేశ సాఫల్యమును పొందెను.

*15. "He who writes a Dictionary of an unexplored language is often misled."*

*16. "My learned assistant gave the meaning in colloquial Telugu, or Sanscrit or Hindi."*

*17. "These instructors were familiar with Sanscrit Grammar, but were less ready to solve questions as to the syntax of their mother-tongue."*

*18. "...Completed the rough sketch of the English - Telugu Dictionary in 1832.... This seemed to be ready, yet in printing it I caused the whole to be rewritten..."*

*19. "I had been prepared by my previous study of Shakespeare and other English Classics."*

*20. "My fellow labourers the Brahmans, remarked that I seemed to have the Bible, Shakespeare, and Milton by heart."*

*21. "This work may render English literature accessible to all the Hindus who fill the Indian Peninsula."* (తెనుగువారికి పర్యాయపదముగ 'హిందు' పదమును బ్రౌనుదొర చాలచోట్ల వాడెను.)

ఈ ఇంగ్లీషు—తెలుగు నిఘంటువు ప్రథమ ముద్రణము, ఫిబ్రవరి 1845 లో ప్రారంభింపబడి మార్చి 1853 లో పూర్తి22 అయినదట! దీని ముఖ పత్రము లిట్లున్నవి.23

[పుట I]

బ్రౌణ్య ఇంగ్లీషు నిఘంటు

ENGLISH - TELUGU
DICTIONARY

MADRAS

Printed at the Christian Knowledge Society's Press, Church Street, Vepery.
1853

[పుట II]

WORKS PUBLISHED BY
MR. BROWN.24

[పుట III]

A DICTIONARY,
ENGLISH AND TELUGU
Explaining
The English Idioms And Phrases
In Telugu,
With the Pronunciation of
English Words.
Prepared By
**CHARLES PHILIP BROWN,**
of The Madras Civil Service,
Telugu Translator To Government,
Senior Member of the College Board, Etc.

MADRAS:
Printed At The Christian Knowledge Society's Press, Church Street, Vepery.
1852

ఈ నిఘంటువు బ్రౌనుదొరయొక్క తక్కిన నిఘంటువులవలెనే విశేష ప్రఖ్యాతిని ఆర్జించినది. దీని సాయముతో ఎందరో—బ్రౌనుదొర ఆశించినటుల—ఆంగ్లభాష నభ్యసించి ఆ సాహిత్యమును చవిజూచియుందురు. దీని ఉపయోగము కాని, విశిష్టత కాని నేటికిని తగ్గిపోలేదు. వ్యావహారిక భాష ప్రాబల్యమును పొందిన ఈ దినములలో, వ్యావహారిక భాషాపదములు విశేషముగనున్న బ్రౌనుదొర నిఘంటువులు, మన కింకను మిక్కిలి ఉపయోగకారులు, ఉపాదేయములు. పందొమ్మిదవ శతాబ్దిలోని వ్యావహారిక తెలుగు పదములను గుర్తించుట కిదియొక ఘంటాపథము.

ఈ నిఘంటువుయొక్క ద్వితీయ ముద్రణము 1895 లో జరిగినది. బ్రౌనుదొర కీర్తిశేషుడైన (1884) తరువాత పదునొకండవ సంవత్సరమున ముద్రింపబడిన దీనిని, ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషునకు అసిస్టెంటు ప్రొఫెసరయిన ఎమ్. వెంకటరత్నం, బి. ఏ; గారు సంస్కరించి, విపులీకరించి ప్రచురించిరి. దీని యందు 'బ్రౌనుదొర సాహిత్య జీవితము' (*Literary life*) ముద్రింపబడినది. ఈ వ్యాసమును మిత్రుల ప్రోత్సాహమువలన, తాను ఇండియాను విడిచి (1855 లో) పోవుటకుముందు, బ్రౌనుదొరయే వ్రాసెనట. కాని, దీనిని ప్రచారమునకై అచ్చువేయలేదు గనుక, ఈ వ్యాసములోని విషయములు బహిరంగ పరుపక 'కాలేజీబోర్డు' వారును జాగరూకత వహించిరి.25 అతడు చనిపోయిన తరువాత అచ్చువేసిన, ఈ

---

22. *"I began printing it in Feb. 1845 and it was Completed and published (one Volume. Royal Octavo, in 1300 pages) in March 1853."*

23. బ్రౌనుదొర ప్రచురించిన గ్రంథములను (అవి అన్ని గ్రంథాలయములలోను లభింపవు) చాలమందికి చూచుటకు అవకాశము లేదు గనుక, ముఖపత్రరచనయైనను, ఇట్లున్నదని అనుకొనుటకనుకూలుగా, చూపుటయైనది.

24. పై శీర్షిక క్రింద ఒక పుస్తకముల పట్టిక ఈయబడినది. వీనిలో కొన్ని, అతడు ప్రచురించినవి, కొన్ని ప్రచురింపనున్నవి.

25. *"On the eve of leaving India, their late learned colleague was induced by his friends to compile some details of his own literary life. But as this narrative was not Printed for publication, the Board do not deem it proper to make free with its contents"—D. F. Carmichael, secretary, Board of Examiners' office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in The Library of The College, 1857; Page XXIII)*

నిఘంటువు ద్వితీయ ముద్రణమున, దీనినికూడ ప్రచురించిరి. బ్రౌనుదొర సాహిత్య జీవితముపై వ్రాయువారికి ఇది అమూల్యమైన వ్యాసము. ఈ వ్యాసముండుటయే, ఈ ముద్రణముయొక్క వైశిష్ట్యము.

తెలుగు—ఇంగ్లీషు నిఘంటువుకూడ, దానితోబుట్టువగు ఇంగ్లీషు—తెలుగు నిఘంటువుతో సమానమైన ప్రాముఖ్యముగలదే. దీనిని బ్రౌనుదొర తాను తెలుగు నేర్చుకొనుచున్న దినములలో తనకు సాయముగుటకు సిద్ధము చేసికొనెనట 26 దీనిని అచ్చు వేయవలెనను సూచన 1844 వ సంవత్సర ప్రారంభముననే, వచ్చెనట. ఆ సంవత్సరము మధ్యభాగమున అచ్చుపని ప్రారంభింపబడెను. ఎన్నో మార్పులు, దిద్దుబాట్లుకూడ చేయవలసి వచ్చెనట. నూటికంటె ఎక్కువ మంది తెలుగుగ్రంథకర్తలందు ఉదాహరింపబడిరి. ప్రతి ఉదాహరణమును పరిశీలించి, నిర్ణీతస్థానములో ఉంచవలెను.27 బ్రౌనుదొర వ్రాయసగాండ్రను పెట్టి, తన పర్యవేక్షణము క్రింద పనినంతను పూర్తిచేసెను. ఉదాహరించిన భాగము లేయే గ్రంథములందలివియో సరిగా పరీక్షించి, నిఘంటువున నిలిపెను. నిరాధారములగు పదమేవియు నందు లేవు. ఇట్టి ఋజుత్వము, నిష్కర్ష లేనిచో పరిశోధకుని పనికి గౌరవముగాని, అతని కృషివలన మిగిలిన పరిశోధకులకు లాభముగాని ఉండదు. అందుచేతనే ఉత్తమ పరిశోధకుడగు బ్రౌనుదొర తన వ్రాతలకు ఋజువులను చూపించుచు వచ్చెను 28 నిఘంటువులో పేజీ ఒక్కింటికి పదిమొదలు ఇరువదివరకు తెలుగు కవుల రచనలనుండి ఉదాహరణములు కలవనియు, వాని నన్నింటిని తానే స్వయముగ గ్రహించితిననియు, తన యొద్దనున్న పండితులు, వానిని అచ్చునకు సిద్ధముచేసిరనియు ఆతడు వ్రాసెను.29 దీనిని బట్టియే, ఆతనికి ఆంధ్రభాషలో గల పాండిత్యము, ఆంధ్రసాహిత్యముతో గల పరిచయము స్వయం వ్యక్తమగుచున్నది గదా! ఈ నిఘంటువు ముఖపత్రమునకును, ఇంగ్లీషు—తెలుగు నిఘంటువున కున్న ముఖపత్రమునకును భేదమంతగా లేదు.30

ఈ రెండు నిఘంటువులును జోడుగా పెరిగినవి. రెండును ఇంచుమించుగ ఒకేసారి అచ్చొత్తింపబడినవి. ఒక నిఘంటువునకై ఎత్తి వ్రాసికొనినవి, కొన్ని ఉదాహరణలు, రెండవదానికిని ఉపయోగించెడివట. ఈ విధముగా రెండింటిని సమకాలీనముగ బ్రౌనుదొర పెంచుచువచ్చెను.31 వ్రాయసగాండ్రను పెట్టి, కంపోజిటర్లు కూర్చ గలిగినంత వేగముగను తాను వారికి పని చెప్పుచుండెడి వాడట.32

తెలుగు—ఇంగ్లీషు నిఘంటువులో బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు—హల్లులతో ప్రారంభించు పదములయొక్క స్థానమునకు సంబంధించినది. నేడు మనకున్న అకారాది నిఘంటువులలో. 'క చ ట త ప' అను వర్గక్రమమున పదములన్నియు నుండుటయు, ప్రతి వర్గమునకు అక్షరక్రమము నుప్పకుండుటయు, ప్రతి అక్షరమునకును గుణింతపు అచ్చుల క్రమమున వచ్చుచుండుటయు, మనకు తెలిసినదే. బ్రౌనుదొర

---

*26. "The piesent Dictionary was written to assist myself in learning the Telugu Language," (Telugu - English Dictionary, 1852; Page IV)*

*27. "In the begining of 1844 I recieved a proposal to print my Telugu and English Dictionary. The printing commenced in the middle of the year but I soon found that the work required revision and correction. More than one hundred Telugu authors were quoted, every quotation was to be verified, transcribed and inserted"*

*28. "In this, as in my Grammar I have endeavoured to adduce proofs of every statement."*

*29. "There are from ten to twenty quotations from Telugu authors, in each page. This part of the work was executed by my own pen; my learned and laborious assistants transcribed them for the press, but seldom supplied one from their own reading."*

30. *A Dictionary, Telugu And English, explaining, The Colloquial Style Used in Business, And the Poetical Dialect, with Explanation In English And in Telugu, 1852.* ఇదికాక మిగిలిన భాగమంతయు రెండింటికిని సమానమే.

*31. "Some quotations selected for one Dictionary will also fit for the other, and whenever I met with suitable phrases I noted them in each, thus building up both at the same time."*

*32. "I employed Brahman copyists, and supplied work as fast as the compositors could set it up."*

నిఘంటువున ఈ క్రమము పాటింపబడలేదు. ఒక వర్గములోని వివిధాక్షరములతో—అనునాసికాక్షరమును విడిచి—ప్రారంభించు పదములనంతయు, అకారాది అచ్చుల క్రమమున ఒకచోటనే ఇచ్చుట; బ్రౌనుదొర చేసిన ముఖ్యమైన మార్పు 33 ఇట్లు చేయుటవలన, నిఘంటువు నుపయోగించుకొనుట సులభమగునని బ్రౌనుదొర ఊహ. 'యరలవ' లు వేరువేరుగనే కలవు. మరల 'శ, ష, స' లను కలిపినాడు. ఈ ఏర్పాటువలన—కోత, గోత్రము, ఘోణి—మొదలగు పదములు ఒకదానితరువాత ఒకటి ఒకే శీర్షిక (కో, ఖో, గో, ఘో) క్రింద వచ్చినవి.34 అటులనే—జిగి, చిగురు, జిఘాంసుడు—మొదలగు పదములును35, శాతము, షాడబము, సాతాని మొదలగు పదములును36 వచ్చినవి. ఇతరపదములును ఇట్లనే.37

ఈ విషయమును పురస్కరించుకొని, బ్రౌనుదొర తన తెలుగు—ఇంగ్లీషు నిఘంటువు 'ఉపోద్ఘాతము'న, సుదీర్ఘముగ వ్రాసినదాని కిది అనువాదము. "ముప్పది సంవత్సరముల క్రిందట నేను తెలుగు కావ్యములు చదువుచున్నప్పుడు, 'గ' తో ప్రారంభించిన పదములు (గోరువంటివి) చాలసారులు రాగా, మా గురువుగారు నన్ను 'ఆంధ్రదీపిక'లో ఆ పదమునకై 'కోరు' క్రింద చూడుమని చెప్పుచుండిరి. 'జ' మొదటి అక్షరముగ (జెలంగు) కల పదములు 'చ' క్రింద కనబడుచుండెడివి. 'ద'తో ప్రారంభించు పదములు, వాని చిత్తమువచ్చినట్లు, 'త' తో ప్రారంభించెడివి. దోవ, తోవ38 రెండును 'రోడ్డు'నకు పదములే. 'పులి' అనగా పులి గదా! కాని సమాసములలో 'ప' అను అక్షరము 'బ' గా మారి 'బెబ్బులి' అను రూపము వచ్చుచున్నది. 'శ' తో ప్రారంభించు కొన్ని పదములు 'స' తో కూడ వ్రాయవచ్చును గదా. ఈ సంశయమునుండి నన్ను పెద్దలు కూడ విముక్తుని చేయలేదు. నేను వారి నడిగినప్పుడు, "రెండు విధములుగను వ్రాయవచ్చును" అనుచుండిరి. చివరకు, నిఘంటువు రమారమి సగమువరకు పూర్తి అయిన తరువాత, మార్పును అంగీకరించు ప్రథమాక్షరములు గల పదములను కలిపివేసి, మరల నిఘంటువును వ్రాసి, ఈ సంశయమును తొలగించి వేసితిని."

"ఇక్కడ ఒక ఉదాహరణను ఇచ్చెదను. 'దీపిక'లో 'దువాళించు'39 అను క్రియ ఒకటి కలదు. కొందరు కవులు దీనిని 'త' తో ప్రారంభింపగా, కొందరు 'ధ' తో ప్రారంభించిరి. కనుక, ఈ క్రియ నిఘంటువులో మూడుచోట్ల కనబడవలసి వచ్చును కాని, ప్రథమాక్షరములను కలుపుటవలన, శ్రమ లేకుండ అవి కనబడును. ముందుముందు, దీనిని విడదీసి చూపవలెనని ఎవరైనను అనుకొనినను అది అంత కష్టముకాదు. కాని, అట్లు చేయుటవలన భాషను నేర్చుకొనను ప్రారంభకులకు కష్టముగను తెలుగులో కొంత కృషిచేసినవారి కందరకును, నేను చేసిన మార్పులోని విలువ తెలియగలదు. పూర్వపద్ధతిలో పండితులకే సంశయము కలిగెడిది. ఇప్పుడు మార్గము సుగమమైనది."40

ఈ పద్ధతి దేశీయులైన పండితుల ఆదరాభిమానములను అంత చూరగొన్నటుల లేదు. బ్రౌనుదొర కాలమునను పండితులందరును ఆదరించి నట్లులేదని, అతని ఈ క్రింది వ్రాతలే తెలియజేయుచున్నవి. "ఈ నిఘంటువు విషయమున నాకు నా పండితుల సమ్మతి ఉన్నది. కాని కొందరు పండితులు (శాస్త్రులు) నా వర్ణక్రమ పద్ధతిని అంగీకరింపలేదు."41

బ్రౌనుదొర తరువాత, నైఘంటికులు ఈ పద్ధతిని అంతగా ఆదరింపలేదు. నిఘంటువులలో ఆతడు వ్యావహారిక పదములను ఉచ్చరించెడి రీతిగానే—చేర్చుట పండితులకు నచ్చినట్లులేదు. తరువాతి

*33.* ఖగఘ, కాఖాగాఘా, కిఖిగిఘి మొదలగునవి.

*34. Telugu - English Dictionary, 1852 - Page ; 287.*

*35. Telugu - English Dictionary, 1852 - Page ; 330.*

*36. Telugu - English Dictionary, 1852 - Page ; 1050.*

*37. "I have made an improved arrangement of the consecutive initial consonants: uniting such as in Telugu are commutable." (Ibidem, Page IV)*

*38.* తోవ, త్రోవ, దోవ *N. S. Way Road, Way or Means. (Ibidem; Page 465)*

*39.* తువాళించుట, ధువాళించుట *V. N. To leap, To dance. (Ibidem· Page 432)*

*40. Ibidem; Preface; Page IV.*

*41. "...In composing this work I have had the approbation of many learned assistants. But some (Sastris) scholars have disapproved the spelling here exhibited." (Ibidem; Page V)*

నైఘంటికులలో బ్రౌనుదొరను తీవ్రముగ విమర్శించిన వాడు శ్రీ శంకరనారాయణ. ఆతడు తన ఇంగ్లీషు—తెలుగు నిఘంటువులో,42 *'on the contrasts between English and the Indian vernaculars and a common Alphabet for the different languages of India'* అను శీర్షిక క్రింద వ్రాయుచు; బ్రౌనుదొరకు తెలుగు సంధి సూత్రములు బాగుగా తెలియవు అనుట మొదలుకొని, ఆతడు వ్యావహారిక పదములకు తన నిఘంటువులో స్థానమిచ్చి, తెలుగును పాడుచేసినా డన్నంతవరకు; విమర్శించెను. ఇటుల విమర్శించినను, బ్రౌనుదొర నిఘంటువులను ఉపయోగించుకొను విషయములో శ్రీ శంకరనారాయణ వెనుకాడినట్లు లేదు. ఈ తీవ్ర విమర్శకు కారణము, బ్రౌనుదొర వ్యావహారిక భాషకు తన నిఘంటువున అతి ప్రముఖ స్థానమిచ్చుటయే కావచ్చును. శంకరనారాయణకు కోప కారణమైన వ్యావహారిక పదములలో కొన్ని ఈ క్రింద నిచ్చుచున్నాను—అరవయ్యో *(Sixtieth)* చంద్రుణ్ణి, వొప్పుకోవడము, పద్నాలుగు, అదీ నేను.

ఏది ఎట్లున్నను, తన నిఘంటువు పండిత పామర జనోపయోగము కలదిగా నుండవలెనని ఆత డాశించెను గాని వేరు కాదు. కేవలము ఛాందసులైన పండితుల మెప్పు పొందవలెనని ఆత డెన్నడును కృషి చేయలేదు. అతడు విదేశస్థుడగుట ఇట్టి సందర్భములలో ఆతనికి ఉపకారకమయ్యెను. దేశీయ పండితులలో కొందరను పట్టి బంధించి బాధించు సంప్రదాయ శృంఖలములు ఆతని నంటలేదు. కనుకనే ఆతడు పామరులను, వారి భాషను ఈసడించలేదు. విశాలదృష్టిగల విజ్ఞాని గనుక, పండితుల ప్రతిభను గుర్తించి, వారి నెన్నడును తూలనాడలేదు. ఈ తటస్థదృష్టి, ఆతనికి కలుగుటకును; దానిని నిలుపుకొన గలుగుటకును, ఆతడు విదేశస్థుడగుట మిక్కిలి అక్కరకు వచ్చినది.

వీలున్న చోటులందెల్ల ఆతడు ప్రజలభాషకు ప్రాముఖ్య మిచ్చుచు నేయుండెను. నిజమైన విద్వాంసులు, సాహిత్యప్రియులు, తన ఉద్యమములో బాసటగా తనకు నిల్చిరని ఆతడే వ్రాసెను. సాధారణముగా పద్యకావ్యములలోను, వ్యవహారమునందును ఉపయోగింపబడు పదములు కాక, మారు మూలపదములను వాడుచు, అందులకు గర్వించుచు విఱ్ఱవీగు విద్వాంసుల నాతడు గౌరవింపలేదు.43 వారివలన నుపయోగము లేదని ఆత డెరుంగును.

తన నిఘంటువులు, సాధ్యమైనంతవరకు పూర్ణముగ (జీవద్భాషకు పరిపూర్ణ నిఘంటువు అనునది ఉండదని ఆతనికిని తెలియును) నుండుటకు చేయవలసిన కృషినంతను బ్రౌనుదొర చేసెను. కొన్ని కొన్ని పదములకు అర్థవివరణ పండితులచే చేయించియు, వారు దూరస్థులైనచో ఉత్తరములద్వారా సమాధానములు తెప్పించుకొనియు, వారి నిర్ణయములను సంపాదించి తన నిఘంటువునందు కూర్చుకొనెను. ఈ సందర్భమున ఒకటి, రెండు, ఉదాహరణలను పరిశీలింపవచ్చును.

ఆ రోజులలో మదరాసులో సుప్రసిద్ధులగు ఆంధ్రులలో ఏనుగుల వీరాస్వామయ్యగా రొకరు (1780 ప్రాంతమున వీరి జననము. 3-10-1836న మృతి) వీరు చెన్నపట్టణములో, ఇప్పటి హైకోర్టునకు పూర్వమున్న సుప్రీమ్ కోర్టులో—తెలుగు, అరవము, ఇంగ్లీషు భాషలలో 'దుబాసి'. వీరు బ్రౌనుదొరకు స్నేహితులు. వీరు 1830—'31 సంవత్సరముల నడుమ (18-5-1830 నుండి 3-9-1831 వరకు) కాశీయాత్ర చేసిరి. ఆ చరిత్ర చక్కని వ్యావహారిక భాషలో లేఖలరూపమున తమ మిత్రులగు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లె గారికి వ్రాసిరి. ఇది 'కాశీయాత్రా చరిత్ర' అను పేర ఇప్పటికి మూడుసార్లు ముద్రింప

42. *An English-Telugu Dictionary By P. Sankaranarayana Published by V. Ramaswamy Sastrulu & Sons, 1928.* ఈ ముద్రణమునకు డాక్టరు. జి. వి. సీతాపతి గారు సంపాదకులు. సంపాదకులు *Preface* లో, *"This edition of Sankaranarayana's English-Telugu Dictionary is the first edition published after the lamented death of the author..."* అని వ్రాసిరి. దీనియందు; శ్రీ శంకర నారాయణ మూలగ్రంథమునుండి, పై శీర్షికగల వ్యాసమును తీసి పునర్ముద్రించిరి.

43. *"Instead of that found in poems and used in ordinary life they (Sastris) wish us to practice a pedantic style: which is admired because conceited and far from clear. Such refinements are disregarded by men of real learning, who are therefore considered vulgar by some who are inferior in sound scholarship." (Preface: Page V - Telugu-English Dictionary, 1852)*

బడినది.44 ఈ విధముగా గ్రంథకర్తగాకూడ పేరు పొందిన వీరాస్వామయ్యగారిని, బ్రౌనుదొర తన తెలుగు—ఇంగ్లీషు నిఘంటువులో ఇంద్రాణి, పలవర, మొదలగు పదముల అర్థ వివరణమునకు ప్రమాణముగ గ్రహించిరి.

"ఇంద్రాణి—*Name of the wife of Indra; A sort of bracelet, Orangallu Glossary: 'Dowager' a Bramin widow, Enugula. 28th July 1830*"45

"పలవర—*The name of a certain tree much cultivated in the neighbourhood of Hyderabad for its fruit.* పలవర ఆకులు *its leaves, are used to manure land. See description in the Kasi Yatra, date 7th September* 1830". 46

విక్రమార్కుని కథలు (1819) పంచతంత్రము (1834) తెలుగు వ్యాకరణము (1836) మొదలగు గ్రంథములను వ్రాసిన, "చెన్నపట్టణ పాఠశాలలో ఆంధ్రభాషకు మొదటి ఉపాధ్యాయుడైన"47 శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు (1770–1836) బ్రౌనుదొరకు గురుతుల్యులు. ఆయన బ్రౌనుదొరకు కొన్ని పదముల అర్థ వివరణము చేసి, దూరమున నున్నచో, జాబుమూలముగ కూడ పంపుచున్నట్లు తెలియజేయు లేఖ నొకదానిని, ఉదాహరణగా ఇచ్చుచున్నాను.

(1827 నవంబరు 22 తేదీని శ్రీ రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు బ్రౌనుదొరకు వ్రాసిన లేఖకు నకలు)48.

"మహారాజ రాజశ్రీ బ్రా. శ్రీ. బ్రౌనుదొరవారి సముఖానకు—ఆశ్రితుడను రావిపాటి గురుమూర్తి శాస్త్రి అనేకములైన సలాములుచేసి వ్రాసుకొన్న విజ్ఞాపన పత్రిక—

తమరు అలనాక—డాబాలు అనే శబ్దములకు అర్థము వ్రాసి పంపెదమని వ్రాయించినారు. అలనాక శబ్దమునకు స్వేచ్ఛ—అనిచ్ఛ—అప్రయత్నము—అశ్రమము—కారణము—అని నానా అర్థములు వున్నవి. ఆయా స్థలములకు తగినట్లుగా చెప్పవలసినది.

డాబాలు అనేది డాబా అనేదానికి బహువచనాంతము. డాబా అనగా వెండితోగాని బంగారుతోగాని చేసిన మొలత్రాడుయొక్క బిళ్ల. ఉత్తర దేశములో బంగారుతోగాని వెండితోగాని చేసిన మొలత్రాడు నాలుగైదు వరుసలుగా చుట్టి అతికించి బిళ్లలు వేసి మొలను ధరించెదరు కద్దు. అటువంటి త్రాడు డాబా మొలత్రాడు అని చెప్పుచున్నారు.

కాలేజీవారు కోరిన 500 రూపాయల పుస్తకములవైనం నాకు తెలియపర్చలేదు. చిత్తగించవలెను. ఇదిగాక తమరు హంసవింశతిలోని కొన్ని పద్యాలకు ప్రతిపదార్థమున్ను తాత్పర్యమున్ను వ్రాసి పంపించుమని వ్రాయించినారు. కోరిన మట్టుకు వ్రాసి యిందులో విడాయించి సన్నిధానకు పంపించినాను. చిత్తగించవలెను. నేను నరుముకో గలందులకు ఆజ్ఞాపత్రిక దయచేయించవలెను. ఇవి అనేకములైన విజ్ఞాపనములు.

చెన్నపట్నం<br>1827 నవంబరు 22 తే. } రా. గురుమూర్తిశాస్త్రి.

ఈ విధముగ లేఖల మూలముగను తనకు కావలసిన శబ్దములకు అర్థవివరణము తెప్పించుకొనియు, విద్వాంసులైన తన మిత్రుల గ్రంథములనుండి ప్రమాణములను గ్రహించియు, బ్రౌనుదొర తన నిఘంటువున కొక వైశాల్యమును కల్పించుకొనెను. సమకాలికులగు పండితుల ప్రమాణములను గౌరవించి, వానికి తన నిఘంటువున స్థానమిచ్చి; సమకాలపు వారి రచనలను గౌరవించుటలో దోషములేదను సంప్రదాయము నొకదానిని నెలకొల్పెను. ఈ సత్సంప్రదాయమును, నవీన నైఘంటికులుకూడ నవలంబించుట మంచిది.

44. కాశీయాత్ర చరిత్ర. ప్రథమ ముద్రణము 1838 లో శ్రీనివాసపిళ్లెగారి బాధ్యతను జరిగినది. ద్వితీయ ముద్రణము 1869 లో 'గవర్నమెంటు వారి ఉత్తరువు'చే జరిగినది. తృతీయ ముద్రణము 1941 లో జరిగెను. తృతీయ ముద్రణభారమును శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు వహించిరి.

45. *Telugu - English Dictionary; Page 80.*

46. *Telugu - English Dictionary; Page 564.*

47. శ్రీ రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి 'తెలుగు వ్యాకరణము' ప్రథమ ముద్రణము (1836) పీఠికలోని వాక్యము. ఈ వ్యాకరణము **A. D. Campbell** దొరకు అంకిత మీయబడినది.

48. శ్రీ రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారి 'తెలుఁగు వ్యాకరణము'నకు 1951 వ సంవత్సరములో జరిగిన ముద్రణము పీఠికలో ఈ లేఖ ముద్రింపబడినది.

1855లో తాను మనదేశమును విడిచి ఇంగ్లండు వెడలిపోయినను, బ్రౌనుదొర ఈ రెండు నిఘంటువులను మరచిపోలేదు. అతనకు ఆరోగ్యము సరిగ లేకున్నను, వయస్సు మళ్లినను తన కృషిని మానలేదు. వీలుచిక్కినప్పుడెల్ల, వానిని సవరించుచునే యుండెను. క్రొత్త క్రొత్త పదములను చేర్చుచునే యుండెను. జీవద్భాషకు శాశ్వతమైన నిఘంటువను నది ఉండజాలదనియు, భాషతోబాటు నిఘంటువును, వ్యాకరణమును మార్పులను పొందుచుండవలెనను పరమసత్యము అతనికి తెలియనిదికాదు. లండనులో తనకు తీరిక దొరికినప్పుడెల్ల తన నిఘంటువులకును, వ్యాకరణమునకును అతడు చేర్పులు, మార్పులు చేయుచునే యుండెనట. దీనివలన అవి మొదటికంటె రెట్టింపు పెరిగినవని అతడు వ్రాసెను.49

బ్రౌనుదొరకు, నిఘంటువులకు క్రొత్తపదములను అందిచ్చుటలో ఒక ఫ్రెంచి—తెలుగు నిఘంటువు, మిక్కిలి ఉపయోగించెనట. దాని నాతడు 1855లో ఇంగ్లండు పోవువరకు పరిశీలించుటయే జరుగలేదట! 1700 ప్రాంతమున మనదేశమున కృషిచేసిన మిషనరీలు తమిళ—ఫ్రెంచి; తెలుగు-ఫ్రెంచి నిఘంటువులను కూర్చిరట. ఆ నిఘంటువులలో తెలుగు—ఫ్రెంచి నిఘంటువునకు *Dictionaire Telongou ou Badaga* అని పేరట. దీనిలో వ్యావహారిక భాషాపదములే విశేషముగ కలవని బ్రౌనుదొర వ్రాసెను. ఈ నిఘంటువును సిద్ధపరచిన మిషనరీలు తమ పేరులను ఇయ్యలేదట. దీనినుండి బ్రౌనుదొర వేయివరకు పదబంధములను గ్రహించెనట.50

ఇంగ్లీషు—తెలుగు; తెలుగు—ఇంగ్లీషు నిఘంటువులను కూర్చుటలో బ్రౌనుదొర మహాప్రతిభను చూపుటయేగాక; దూరదృష్టిని, హృదయవైశాల్యమును గూడ ప్రకటించెను. తన రచనలు, "ముఖ్యముగ తెలుగు నేర్చుకొనువారికి" ఉపయోగపడవలెనను ఉద్దేశముతో వ్రాసినను; వానికి విశేషవ్యాప్తి, తెలుగువారిలోకూడ వచ్చుటకు ముఖ్యకారణము, వాని పాండిత్య ప్రౌఢిమ.

దేశభాషలలో కృషిచేయు విదేశస్థులు, ఆయా భాషల సహజ ప్రకృతులను అర్థముచేసికొని కృషి చేయవలెనేగాని, ఆ భాషల ప్రకృతులనే మార్చవలెనని కృషిచేయుట వ్యర్థమని కూడ అతడు గ్రహించినాడు. ఏ భాషనైనను మార్చగలిగినవారు, నూతన పదజాలమును సృష్టించగలవారు ఆ భాషాభాషీయులైన ప్రజలేగాని అన్యులెవరును కారను చరిత్ర సత్యమును బ్రౌనుదొర ఎన్నడును మరువలేదు. తెలుగులో తానెంత కృషిచేసినను, ఎంత పాండిత్యమును సంపాదించినను, ఎన్ని గ్రంథములు రచించినను; ఆ భాష విషయమున 'బుడింగాలు' తెలుగు ప్రజలదే అను పరమ సత్యమును గుర్తించియే బ్రౌనుదొర తన కృషిని చేసెను. తన కృషి ఫలించుటకై, అతడనేకుల సలహాలను స్వీకరించెను. పండితుల భాషను పామరుల భాషను సమానముగనే గౌరవించి ఆదరించెను. అహంకారమును విడిచి ప్రజల యొద్దనుండి వారి అభిప్రాయములను గ్రహించి వానిని మన్నించెను. తన నిఘంటువుల ద్వారా తెలుగు ప్రజలకు సులభముగా అర్థముకాని, నూతన పదములను—అనావశ్యకమైనవానిని, కేవల పాండిత్య ప్రకటనకై—సృష్టించలేదు. తన 'ఎల్లలను' తాను గుర్తించి కృషిచేసినాడు గనుకనే బ్రౌనుదొర శిష్యులలో విశిష్టుడు 51

49. *"I resumed Telugu reading, merely carrying on the work when I happened to be in London and at leisure. I daily made additions in the Dictionaries, and the Grammar, which are now more than doubled."*

50. *The French Missionaries who laboured about A. D 1700 wrote a French - Tamil Dictionary and another lexicon Telugu and French...The authors have not given their names: I observe that they were indefatigable in recording Colloquial dialect alone. I never saw this work until I returned to England in 1855. It supplied more than a thousand phrases."*

51. *"...But I have avoided all fabricated words and meanings: I have never admitted a new Telugu phrase without duly warning the reader. To coin a new phrase is easy: but no foreigner has the power to give it currency. I am not one of those who fancy that we can alter or improve the languages used in India."*

*(English - Telugu Dictionary - Preface; Page - 5)*

నిఘంటువులలో ఆంగ్లము నభ్యసింపగోరు తెలుగువారికి వీలగునట్లు, మార్పుల నెన్నింటినో చేసెను. కొన్ని కొన్ని ఇంగ్లీషు పదములకు తెలుగులో అర్థమును వ్రాయుచు; అర్థము బాగుగా అగుటకు, తెలుగువారికి బాగుగా తెలిసెడి, వారి సాహిత్యము నుండియే ఉదాహరణ లిచ్చి, నిఘంటువు విశేషముగ నుపయోగకారి యగునటు చేసెను.52 చేసిన కృషివలన ఎంత ఎక్కువమంది ఉపయోగమును పొందుదురు, అని ఆలోచించి బ్రౌనుదొర గ్రంథములను రచించెనుగాని, స్వీయపాండిత్య ప్రకటనకై కాదు. ఇంగ్లీషు—తెలుగు నిఘంటువు పీఠికను మనము జాగరూకతతో పరీక్షించినయెడల, బ్రౌనుదొరకు తెలుగుభాషలో ఎంతటి నిశితమైన పాండిత్యము కలదో స్వయం వ్యక్తమగును. ఆంగ్లభాషా సంపర్కమువలన తెలుగుభాష మారుచున్నదనియు, ఈ మార్పు సహజమేయనియు; అంతకు పూర్వము ముస్లిము ప్రభుత్వకాలమునకూడ తెలుగుభాష, పాలకుల భాషనుబట్టి మార్పులను జెందినదనియు వ్రాసి తన చరిత్రదృష్టిని చూపెను. ఈ ఆంగ్లభాషా సంపర్కమువలన ఎన్నియో పదములు తెలుగులోనికి వచ్చి చేరుచున్నవనియు, పండితులు ఆంగ్లపదములను ఒల్లక, తత్సమ పదములను సృష్టించి వాడుచున్నను, ప్రజలు మాత్రము ఆంగ్లపదములనే ఉపయోగించుచున్నారనియు బ్రౌనుదొర వ్రాసెను.53 దీనినిబట్టి, బ్రౌనుదొర నాటికి, వ్యావహారిక ఆంధ్రమందు ఆంగ్ల పదములు బాగుగ స్థిరపడి నట్లెంచవచ్చును.

"ఆంగ్లభాషాపఠనము హిందువుల మనోవికాసమునకు మార్గము కాగలదు" అని వ్రాసిన బ్రౌనుదొర, తన కృషికి గల చరిత్రలోని స్థానమును పూర్తిగ గ్రహించినాడనియే చెప్పవలెను. తన కృషి సార్థకమగునుగాని వ్యర్థము కాదని గ్రహింపగలిగిన దూరదృష్టి అతనిది.

బ్రౌనుదొరయొక్క నిఘంటువులను ఎవరెట్లు విమర్శించినను, అతని నిష్కాపట్యమును, సత్యనిష్ఠను శంకించువారుండరు. ఒక యుగసంధిలో అతడు కృషి చేసి, దాని ఫలితముగ ఒక సమన్వయ ప్రధానమైన దృక్పథమును పండిత పామరులలో ప్రచారమునకు తెచ్చెను. తరువాతి నైఘంటికులు—అంగీకరించినను, అంగీకరింపకున్నను—బ్రౌనుదొరకు, అతని నిఘంటువులకు ఎంతయో, ఋణపడియున్నారు.54 కాని మన వారికి ఋణగ్రస్తులగుట తెలిసినట్లు, కృతజ్ఞతను తెలియజేయుట అంతగా తెలియదు గనుక, తరువాతి నైఘంటికులలో అనేకులు బ్రౌనుదొరను 'ఉపయో

52. *"Writing particularly to assist Hindus, I have given some minute explanations which Englishmen may deem superfluous. But to the Hindu they are advantageous. Elsewhere (as under the word Humour) I have alluded to such Telugu authors and phrases as seemed useful."*

*(English - Telugu Dictionary - Preface: Page-5).*

53. *"Under the Musulman rule, Telugu, Kannadi and Tamil were filled with Arabic words. At present these are retained and many English expressions are added......I am aware that the Hindus prefer using the English word without any translation. They have lately fabricated a few words from Sanskrit. Thus they speak of a President as Agrasanadhipati, and of a Secretary as Caryadarsi. At present the Telugu used in conversation and business is becoming more and more thickly sprinkled with English words." (Ibidem, Preface. Page-5).*

54. "శబ్దరత్నాకరమునకు బ్రౌణ్య నిఘంటువే ఆధారము"—కళాప్రపూర్ణ శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు—విమర్శనము—12-7-1939) ఈ వ్యాసము శ్రీవారి స్మారకసంచికయందు (ప్రతిభ, సంపుటి ౪) ప్రకటింపబడినది కూడ. అందు, పై వాక్యము 41 వ పేజీలో గలదు.

55. *"...was written at the request of the Society for Promoting Christian Knowledge and is printed at their expense" (Telugu-English Dictionary; Preface - Page V)*

56. "ఈ నిఘంటు నిర్మాతలు (సూర్యరాయాంధ్ర నిఘంటువు) బ్రౌణ్య నిఘంటువు ప్రమాణముగా స్వీకరించినారు. అందుకు నేను చాలా సంతోషిస్తున్నాను." శ్రీ గి॥ రామమూర్తి పంతులుగారు (శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు- విమర్శనము—ప్రతిభ, సంపుటి-4—20 వ పేజీ.)

గించుకొని', మాటాడక మిన్నకుండిరి. ఏది ఏమైనను, బ్రౌణ్యా నిఘంటువుల55 తరువాత బయలుదేరిన నిఘంటువులలో, బ్రౌణ్యము నుపయోగించుకొననిది56 లేదని చెప్పిన సత్యదూరము కాదు.

జగత్ప్రసిద్ధములైన ఈ రెండు నిఘంటువుల తరువాత చెప్పుకొనవలసిన నిఘంటువుల నింకను కొన్నింటిని బ్రౌనుదొర కూర్చెను. కృషి విషయమునను, పాండిత్య విషయమునను పైవాని కేమాత్రమును ఇవి తీసిపోవు. వీనిలో 'మిశ్రభాషా నిఘంటువు' ఒకటి, బ్రౌనుదొర ప్రతిభకు తార్కాణముగనున్నది. ఇట్టి నిఘంటువు నొకదానిని కూర్చవలెనను భావము కలుగుటలోనే అతని వైశిష్ట్యమును, భావమును క్రియగా ప్రవర్తింప జేయుటలోనే అతని ప్రతిభా ప్రాగల్భ్యమును కొనవచ్చును. దీనిలో తెనుగు, పర్షియను, ఇంగ్లీషు లిపులు మూడును వాడబడినవి; తెనుగు లిపిలో పదము, దానికి పర్షియను లిపిలో వ్రాత, ఆంగ్ల లిపిలో పర్షియను ఉచ్చారణ, ఇంగ్లీషులో అర్థము—ఇవిగాక తెలుగులో ఆ పదమునకు అర్థవివరణము. "తెలుగుభాషనుండి కాలక్రమమున ఈ అన్యభాషా పదములు తొలగించుటకు వీలుగా, ప్రతి పదమునకును పర్యాయపదముగ తెలుగుపదమును ఇచ్చితిని' 57 అని వ్రాసిన బ్రౌనుదొర తెలుగుభాషాభిమానమును ఏమని కొనియాడుదుము.

ఈ మిశ్రభాషా నిఘంటువు (*A Dictionary of the Mixed Dialects and Fareign words used in Telugu*) 1854 లో ముద్రింపబడినది 58 పీఠిక తరువాత, దీనిలో 'ఆంధ్రాక్షరము'లను గూర్చిన దీర్ఘవ్యాస మొకటి కలదు. ఆంధ్రవ్యాకరణమునకు ఇది ప్రథమవాచకముగ గ్రహింపవచ్చునని బ్రౌనుదొర వ్రాసెను. అతడు వ్రాసిన తెలుగు వ్యాకరణము రెండవ ముద్రణమునుండి ఇది కొలది మార్పులతో గ్రహింపబడినదట.59 ఈ భాగమును చదువుచున్నప్పుడు; బ్రౌనుదొరకుగల తెలుగుభాషా పాండిత్యమే గాక, అతని సమన్వయదృష్టి, మన సంఘ సంప్రదాయములనుగూర్చి అతనికిగల విజ్ఞానము మనలను ఆశ్చర్యచకితులనుగ చేయకమానదు. మన ఆచార వ్యవహారములతో, మంచి చెడ్డలతో అతనికిగల సానుభూతి మనల నాతనిని గౌరవించునట్లు చేయును.60

ఈ నిఘంటువును కూర్చుటలో అతని ముఖ్యోద్దేశము; ముస్లిముల పరిపాలనవలన, తెనుగుభాషలోనికి వచ్చిచేరిన అన్యదేశ్యములను అర్థవివరణముతో చూపుటయే. అరబ్బీ, పారసీక, ఉర్దూ భాషలోని పదములనే గాక, ఇతర భాషలనుండికూడ తెనుగులోనికి వచ్చిచేరిన పదములనుగూడ అతడు గ్రహించెను. తెనుగుభాషలోనున్న అన్యదేశ్యము(*Foreign words or loan words*) లనుగూర్చి పరిశోధన చేయువారికి ఈ నిఘంటువు రత్నాకరము.

బ్రౌనుదొర—న్యాయస్థానములలోను, వాణిజ్య కేంద్రములలోను విరివిగా వాడబడు ఈ 'మిశ్రభాష'ను; లా-లాటిన్ (*Law-Latin*) తోను, లా-ఫ్రెంచి (*Law-French*) తోను పోల్చి; వాక్య నిర్మాణ విషయములోను, కారకమునందును ఈ భాషకును 'తెనుగు'నకు పోలిక చాల తక్కువ అని చెప్పుచు—ఈ క్రింది ఉదాహరణను ఇచ్చెను. "ఈ నంబరులో డిఫెండెంటు ఒమ్మను మాచి సైను (*or* దస్కత్) చేశి వాయిదా చొప్పున కోర్టులో హాజరు అయి ఆన్సరు యియ్యకపోయినందున యిందులో యెక్సపార్టి దర్యాప్తు చేయవలెనని ప్లేంటిఫ్ ప్లీడరు మోశను చేశినాడు గనుక ఆ మోశను రికార్డులో దాఖలు (*or* ఫయిలు) చేశి అందులో దర్ఖాస్తు చేశిన చొప్పున నడిపింవెలాగున ప్రొసీడింగులో ఆర్డరు యొంటరు చేయడం అయినది."61

*57. To each word in this vocabulary I have appended a Telugu synonyme. This will aid those who wish to get rid of these foreign words.'' (Dictionary of Mixed Telugu, 1854—Preface; Page IV).*

*58. ''This Dictionary is printed at the expense of the Society for Promoting Christian knowledge.'' (Ibidem : Preface, Page IV).*

*59. ''These remarks are reprinted with some emendations, from the second Edition of the Telugu Grammer.''*

*(Ibidem—Page XXVIII)*

*60. ''The native tutors also complain that English pupils touch their mouths with their hand : and then defile books with hands thus dirtied. Hindus hold spittle in abomination. We should respect their prejudices, and treat them kindly.''*

(Ibidem - *Page X - Foot Notes*).

*61. Ibidem—Preface; Page III* (ఇవి మచిలీపట్టణము 'కోర్టు జర్నలు'నుండి సంగ్రహింపబడినవి).

ఈ నిఘంటువు తన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువునకు పరిశిష్టభాగమువంటిదనియు, సాధారణముగా ప్రజలు వాడుచున్న పదములే గాని, వాడుకలో లేని 'అన్యదేశ్యము' లిందు లేవనియు బ్రౌనుదొర, ఈ నిఘంటు పీఠికలో62 వ్రాసెను. అవసరము లేనప్పుడు మాటలలో గాని, వ్రాతలో గాని ఈ 'మిశ్రభాష' నుపయోగించుట మంచిది కాదనియు, సాధ్యమైనంత వరకు దీనిని పరిహరింపవలెననియు63 వ్రాసిన బ్రౌను దొరయొక్క ఆంధ్రభాషాభిమానమునుగూర్చి వేరుగా చెప్పవలెనా!

ఈ నిఘంటు నిర్మాణములో అతనికి బాగుగా తోడ్పడినవి (i) అతడే ఎనిమిది వాల్యూములలో సేకరించియుంచిన జాబులు; (ii) అరువది రెండు వాల్యూములలోనున్న 'స్థానిక చరిత్రలు'64. వీని సాయముతోను, తాను కోర్టు వ్యవహారములలోనున్నప్పుడు సేకరించిన 'రికార్డు'లతోను, ఈ నిఘంటువును బ్రౌనుదొర చక్కగ కూర్చెను.

ఈ పెద్ద నిఘంటువులేగాక, తాను వ్రాసిన వాచకాదులందు; చిన్న నిఘంటువులను, 'పదజాలము'లను ఎన్నింటినో బ్రౌనుదొర తెలుగు నేర్చుకొనగోరువారికి వీలుగనుండుటకై ముద్రించెను. తెలుగు భాషలో కృషిచేయ నెంచువారికి ఏ కష్టమును—తనకు మొదట కలిగినట్లు—కలుగకుండుటకై ఎంతవరకు శ్రమింపవచ్చునో అంతవరకును ఈతడు కష్టపడి పనిచేసెను. ఆ పని, ఉత్తమ గ్రంథముల రూపమును పొందినది.

ఇవిగాక, జిల్లాలలో జరుగు కార్యకలాపములకు సంబంధించిన పదజాలముగల, జిల్లా నిఘంటువు (1852) నొకదానిని బ్రౌనుదొర ప్రకటించెను. అతడు చేసిన పనులలో ఇది అత్యల్పమైనదైనను, దీని మీది విమర్శమాత్రము కఠినముగ వచ్చినది. తరువాత ఇది విల్సన్‌దొరయొక్క 'కోర్టు-రెవెన్యూ పదముల పట్టిక'లో 1855 లో విలీనమైనదట.65

బ్రౌనుదొర ఆంగ్ల నిఘంటువునకు గూడ ఒక అనుబంధమును కూర్చెను. డాక్టరు జాన్సన్‌యొక్క నిఘంటువును తీసికొని, అచ్చుకాగితముల నడుమ తెల్ల కాగితములు వేయించి సిద్ధముచేసిన ప్రతిలో, ఎన్నో క్రొత్త ప్రయోగములను—టాడ్, వెబ్స్టర్, క్రైగ్ మొదలగువారు చూపక విడిచిన వానిని—సేకరించి వ్రాసియుంచెనట.66 దీనినిబట్టి అతనికి స్వభాషయైన ఆంగ్లమున ఎంతటి పాండిత్యము కలదో వ్యక్తమగుచున్నది. అతడు మన దేశమునకే రాకయుండిన, స్వభాషకే సేవచేసి, ఆంగ్లసాహిత్యమున శాశ్వతకీర్తి నార్జించియుండెడివాడు. అతని కీర్తికి ఎక్కడైనను అడ్డములేదు. కాని, అతడిచ్చటకు రాకున్నచో మన భాషాసాహిత్యములకు, అతని ప్రతిభతో గూర్చిన సేవ లభించెడిది కాదు.

ఇంతేకాక 'ఫ్లెమింగ్', 'టిబిన్'లు కూర్చిన ఫ్రెంచి నిఘంటువునకు కూడ నూటికంటె ఎక్కువగ పదములను చేర్చెనట.67 చిన్ననాటనే అతడు నేర్చిన

---

62. "..... *forms a requisite supplement to a Dictionery of the Telugu language: and it contains only those phrases which are current among the natives.*"

(*Ibidem - Preface; Page III*)

63. "*...But in talking and writing Telugu we ought to avoid this mixed dialect.*" (*Ibidem - Preface: Page IV*).

64. *Ibidem - Preface: Page IV.*

65. "I *added a fourth volume called the Zillah Dictionary giving in the English Character all the words that occur in 'Zillah business' in* India. I *regretted this thing.* It *was the puniest of my works, and the only volume which was peevishly criticised. It was afterwards Merged in Wilson's Glossary of Judicial and Revenue Terms, 1855 ..*"

66. "*At leisure,* I *also prepared an appendix to the English Dictionary. Taking a quarto copy of Samuel Johnson's work interleaved,* I *collected a series of quotations, both ancient and modern, which even Todd, Webstor, and Craig had overlooked.*" (ఈ వ్రాతప్రతి లినకు లభింపలేదని, 'ఇంగ్లీషు-తెలుగునిఘంటువు' ద్వితీయ ముద్రణమును సంస్కరించిన ఎమ్. వెంకటరత్నం గారు వ్రాసిరి)

67. "I *furthur made some hundred additions to Fleming's and Tibbin's quarto French Dictionary.*"

'ఫ్రెంచిభాష', అతని కీవిషయమునను, 'తెలుగు-ఫ్రెంచి నిఘంటువు' నుపయోగించుకొను విషయమునను, బాగుగా తోడ్పడినది.

ఈవిధముగా బ్రౌనుదొర సర్వతోముఖ ప్రజ్ఞను చూపి, కృషి చేసెను గనుకనే, అతడు ధైర్యముగ, "నేను ఒక్కతెగకొరకే శ్రమింపలేదు"68 అని వ్రాయగలిగెను. వ్రాసినది సార్థకమునుకూడ.

భారతదేశములోని సమస్త భాషలలోను—ఇంచుమించుగ—పరిచయమున్న బ్రౌనుదొర 69, తెనుగుభాషను తన అభిమాన భాషగ స్వీకరించి కృషి చేయుట మన భాషకు జరిగిన మహోపకారము. ఇట్టి మహానుభావుని కృషిలో, కొన్ని లోపములు ఉన్నవని అనువారును లేకపోలేదు. దోషములును, లోపములును అందరకును గలవు గాని, ఇంత కృషిచేసిన ఘనత మాత్రము అందరకును లేదు. "ఏకోహి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతి." *

*68. "I did not labour for one tribe alone."*

*69. Distinguished by his attainments in nearly every other language of India, whether vernacular or classical, Mr. Brown particularly attached himself to the study of Telugu"—D F. Carmichael Secretary, Board of Examiners' Office, March 23rd, 1858. (Preface to a Catalogue Raisonnee of Oriental Manuscripts in the Library of the College, 1857.)*

* దీనిలో ఉదాహృతములైన ఇంగ్లీషు భాగములు (వేరుగా చెప్పనివి) బ్రౌనుదొర స్వయముగ వ్రాసిన వ్యాసములోనివి.



# * వసంతః *

మూలము :
శ్రీ రవీంద్రనాథ ఠాకూర్

అనువాదము :
శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి

సాహస్రం సమతీత మద్యశరదా మాద్యాన్మధో! ఫాల్గునాత్ *
యత్రత్వం మదకౌతుకీ ప్రథమతః స్వర్లోక కేళీవనే
ద్వారం దాక్షిణ ముద్విఘాట్య దివసే కస్మిన్ భువం ప్రాప్తవాన్?
ఆసీః మర్త్యకుటీర చత్వర తలేఽకస్మాచ్ఛ పీతాంబరః,

ఉత్క్షిప్తాదుత్తరీయాత్కిరసి సుమతతిం కల్పవల్లీ నికుంజాత్
వాతే వాతి ప్రకామం యువభిరనుగతం యౌవతం ద్వారభూమిమ్
ఉద్ఘాట్యాఽఽయాత్ గృహీత్వా కరతలయుగళే వేణువీణాం మదాంధం
నృత్యత్యున్మాదభంగ్యా ప్రపతిత సుమనో రేణుభిస్తాడ్యమానమ్.

మిత్ర! త్వం ప్రథమే వసంతదివసే ప్రత్యగ్ర కల్లోదయే
కాలే చాతి చిరన్తనే వసుమతీం నవ్యా మనైషీః కిల
పుష్పాణి ప్రవికాస్య తత్తకిరణ స్తోమే నిషిచ్యాధికం
మధ్యే స్వర్ణమయే మనోహరగుణే, మత్తద్విరేఫాకులే.

ప్రత్యబ్దోదయమాన యస్యవిరతం వాసంత పుష్పవ్రజాన్
నిత్యానంత మనోహరప్రతినవ ప్రస్నిగ్ధ గంధాన్ ముహుః
యైస్త్వం సమ్యగలంచకర్థ మహితప్రేమ్ణః పరాం పీఠికాం
యత్పుష్పేషు జగత్ప్రియస్య లిఖితాః ప్రాగ్విస్మృతాఖ్యాయికాః.

తద్గంధేషు జగత్ప్రియస్యమధుర స్నిగ్ధత్వ ముజ్జృంభతే
క్లాంతస్యాపి నవాఽపగచ్ఛతి నిజా మాధుర్య సంపత్ స్థిరా
తస్మా దద్య నికుంజమంజులవనాత్ వ్యాకోచ భావంగతాత్
నిశ్వాసై ర్బహిరావిరాసు రధునా యూనాం మనోవేదనాః!

---

* వంగదేశమందు ఫాల్గుణమాసమునుండియే వసంతప్రారంభము. కావున ఫాల్గుణ చైత్రములు వసన్త ఋతువు.

లఘూహాశ్చిరయామినీషు కలితా శ్చిత్రాశ్చ చిత్రవ్యథాః
గానాశ్రుస్మితహాసభావమిళితాః శ్వాసైస్సనాథీకృతాః
మాలా యా గ్రథితా త్వదర్పణధియా తస్యాః ప్రసూనావళౌ
బాష్పైః కామకథాః పృథగ్విరచితాః తన్నాయికా నాంగతాః.

పత్రేషు స్థలపద్మినీసుమతతేః సిక్తేషు బిందూత్కరైః
ప్రాలేయస్య నవచ్యుతై రనుదినం ప్రాపుఃకథాః సుస్థితిం
గాథాః యాఃకిల చుంబనైరగణితైః కంపైస్తథా విఘ్నితైః
ఉద్వేలైర్నితరాం విలాసమధురై రర్థైస్సనాథీకృతాః.

వాసంతోజ్జ్వల యామినీషు మమ యే భావాస్సమున్నిద్రితాః
ఉత్ఫుల్లోర్ధ్వతలం ప్రసస్రు రథ తాః త్వత్పుష్పరాజిర్మధో!
గూఢార్థా నన యత్క్వదేశ మితియత్ నైవాద్య విజ్ఞాయతే
సాక్షిత్వం సమవాపురత్రకతిచిత్ వల్లీ ప్రసూనాళయః.

సాజాతీ వకుళాచ చంపకలతా చంచచ్ఛలత్పల్లవా
తా మందస్మిత శుభ్రకాంతివదనా స్సామోదపుష్పవ్రజాః
ఉద్యత్కౌతుక లక్షితా చ తరుణీ సా మాధవీ మంజులా
మత్తారుణ్య కవిత్వమంజులకథా గానం వితేనుర్మధౌ.

పార్శ్వే పార్శ్వేనివీయ వ్రతతితతిరభూ న్నాదమాకర్ణయన్తీ
వేణోస్తద్రాగపూర్ణాత్ మధురమిథునహృన్నిర్మితా న్నిస్సరన్తమ్
యాతాస్తే చ ప్రకాశం విఫలిత జనతా జీవితోత్కృష్టభాగాః
వర్షేవర్షే మధౌతే కుసుమ సురభిషు ఘ్మా జలాకాశమధ్యే

చాంపేయైర్వకుళైశ్చ భావనివహాః స్రోతాస్సరన్త్యన్వహం
కాలే చాతి చిరంతనే బహుయుగే కుంజేషు కుంజేషు తే
పుష్ప్యన్త్యాకులతాంగతాః పికరుతైః కాలేవసన్తాఽద్యతే
శ్వాసే చామరవేదనా స్తరుణతారుణ్యంచ సాంధ్యాంబరే.

[శ్రీయుతులు బెజవాడ గోపాలరెడ్డిగారి సౌజన్యముతో వారి యాంధ్రానువాదమునకు సంస్కృతీకరణము—"ఊర్వశి" నుండి]

నా టి క

# ఆశ్వాసాంతం

శ్రీ మంథా వెంకట రమణారావు

ఈ సంఘటన ఏదేశంలో జరిగిందో ఆదేశానికి నిర్ణయించి ఒక పేరులేదు. యుద్ధ సమయంలో, శత్రువు అధీనంలో వుండే ఒకానొక దేశం అనుకుంటే సరిపోతుంది. ఇందలి పాత్రలు కేవలం కల్పితములు. సౌకర్యార్థం విదేశీయ పాత్రలు, వాతావరణం సృష్టించబడినై.

## : పాత్రలు :

రివరెండ్ జార్జి ఫెడరిక్‌సన్-పార్‌సన్ (చర్చిలో మత బోధకుడు)

మేరీ ఫెడరిక్‌సన్—ఫెడరిక్‌సన్ భార్య.

మేజర్ ఫ్రాంకో—శత్రు సైన్యాధికారి.

ఏన్—పని మనిషి.

## రంగము 1:

[రివరెండ్ జార్జ్ ఫెడరిక్‌సన్ ఇంట్లో విశాలమైనగది—దూలంనుండి వ్రేలాడే చాండిలియర్‌లో క్రొవ్వొత్తులువెలుగుతూఉంటాయి. ఎలక్ట్రిక్‌లైనింగు, స్విచ్‌బోర్డు కానవస్తూ ఉంటాయికాని వాటిఅవసరం ఇప్పుడులేదు. వీధివైపునున్న ద్వారపుతలుపులుమూసి గడవేసి ఉంటాయి. కిటికీలకున్న సిల్కు తెరలు దగ్గరగా లాగి ఉంటాయి. గుండ్రని బల్లచుట్టూ మిలమిలలాడే దీపపుకాంతిలో మెరుస్తూ, పాలిష్ చేయబడ్డ మహాగనీ కుర్చీలు; టేబిలుమీద లేసులతో అల్లిన తెల్లటిగుడ్డ. మధ్యన చీనా వేసులో క్రోటన్సు గుత్తి.

ప్రక్కనున్న గదిలోనికి ద్వారం తెరుచుకొని ఉంటుంది. కాని వ్రేలాడుతూఉన్న తెర మరుగు పరుస్తుం దాగదిని. ఆ ద్వారంవైపున్న గోడమూల ఒక పియానో— దానిమీద 'సైయిన్‌లెన్ స్డీలు' ఫ్రేములో ఫెడరిక్‌సన్ ఫోటో ఉంటుంది.

మేరీ ఒకకుర్చీలో కూర్చొని లేసు అల్లుకుంటూ ఉంటుంది. పనిమీద శ్రద్ధ ఉన్నట్టుగా అనుపించదు, అల్లే రీతినిబట్టి. కాలం గడచిపోవడానికి, మనస్సుని మరల్చుకోడానికి పనిచేస్తున్నట్టుంటుంది. ఒంటిమీద సాధారణమైన దుస్తులు క్రొవ్వొత్తుల కాంతిలో ఆమె ముఖం ప్రకాశవంతంగా కానరాకపోయినా, చూడగానే ఆమె సౌందర్యవతి అని ఒప్పుకుంటారు ఎవరైనా—పాతికేళ్లకు ఎక్కువ ఉండదు వయస్సు—తల క్రిందకి వంగిఉండడంవల్ల మాటిమాటికి కన్నులలో పడే ముంగురులను ఎగదోసుకుంటూ ఉంటుంది. [ఏన్ ప్రవేశిస్తుంది.]

ఏన్: అమ్మా! బాబుగారింకా రాలేదు—ఏమన్నా ఆలస్యం అవుతుందా?

మేరీ: (తలఎత్తి, ఏన్ ముఖంలోకి చూసి తల దించుకుని) ఏమో! వెళ్ళేటప్పుడు ఏమీ చెప్పలేదు.

(గోడకున్న గడియారాన్ని చూచి) ఎనిమిది కూడా కావస్తోంది!

ఏ: ఊళ్లో ఏదన్నా పనుండికాని...

మే: ఎంతపనున్నా ఈవేళకల్లా వచ్చేయవలిసింది.

ఏ: ఆ కొంపల్లోకాని బోధచేస్తూ కూర్చున్నారేమో!

మే: (కుట్టుపని ప్రక్కనిపెట్టి లేచి వాచీ వేపు చూస్తూ) ఇంత రాత్రివరకూనా!

ఏ: ఆయన మనస్సంతేనమ్మా! వాళ్లకలా బోధచేస్తూ అందులో లీనమైపోతారు. కిందటి ఆదివారం నేను చూశానుగా. నిజంగా మాట్లాడుతూ మాట్లాడుతూ మనిషి మైమరచి పోయేరు!

మే: (కుర్చీలో కూర్చుంటూ) అయితే ఆయన బోధల్ని వినే, మీరంతా ఉండిపోయేరా? ఏమే?

ఏ: (తల దించుకుంటుంది)

మే: ఏమే—మాట్లాడవ్? నిజంగా ఆయన బోధలు వినే మీరంతా ప్రాణాల్నీ గౌరవాన్నీ లక్ష్యంచెయ్యకుండా ఉండిపోయేరా?

ఏ: ఔనమ్మా!

మే: అబద్ధం చెప్పకు! మీ కెవ్వరికీ కదలడానికి ధైర్యం చాల్లేదు. నిజమేనా?

ఏ: క్షమించండమ్మా అది కానే కాదు.

మే: నిజంగానా?

ఏ: ఔనమ్మా! మొదట ఈ ఊరూ, వాడా, వదలి వెళ్ళిపోవాలనుకున్నాం. కాని బాబుగారి బోధలు విన్నాక మరి వెళ్లాలనిపించలేదు. ఆయన చెప్పింది నిజమేనమ్మా. ఈ ఇల్లూ వాకిలీ వదులుకుని ఎక్కడికి వెళ్తాం! ఇంతకన్న పెద్ద ఆపద మరో చోటా ఉంటుంది.

మే: అలా అని, ఇక్కడ ఇలా, శత్రువు ఆక్రమించిన దేశంలో, జరిగే అత్యాచారాల మధ్యన, వాటికి బలి ఔతూ ఊరుకుంటాంటే? ఎదురుకోడానికి వీలు కాకపోతే తప్పించుకో నన్నా కూడదా?

ఏ: (మౌనం)

మే: ఎన్ని కుటుంబాలు అంతా?

ఏ: సగం మంది వెళ్లిపోయేరు. వందకి పైగా ఉంటా రిప్పుడు.

మే: వందకి పైగానా!

ఏ: ఔను. ఎంతచెప్పినా వినకుండా మామామ వా [illegible]సుకుని నిన్నరాత్రి పలాయనమయేడు.

మే: మీమామా? ఎక్కడికి?

ఏ: ఎక్కడికో వాడికే తెలీదు. నేనూ మా నాన్నా ఎంతో చెప్పేం.

మే: పిల్లలు పెళ్ళీడు వాళ్ళైనా?

ఏ: (తల ఊపుతుంది, ఔనన్నట్టు)

మే: ఏన్! ఒక్కమాట చెప్తా వింటావా? బాబుగారిబోధల్ని నేను లక్ష్యపెట్టనని అనుకోకు—కాని ఆ సమయంవస్తే సాధారణ మనస్తత్వం కలవాళ్లు ఆబోధలను ఆచరణలో పెట్టడం కష్టం. నువ్వు, నీ తండ్రి కలిసి మీ మామని అనుసరించాల్సింది!

ఏ: అమ్మా!

మే: ఔను ఏన్! నీ ప్రియుడు డేవిడ్ గతి ఏమయింది?

ఏ: (కన్నులు ఒత్తుకుంటుంది)

మే: నువ్వు యౌవనవతివి! జీవితం ఇంకా చాలా ఉంది నీముందు. రేపు ఉదయం ఇద్దరు సిపాయిలచేతులలో నువ్వు పడ్డావంటే నీ జీవితం నాశనం అవుతుంది. నీ ఒక్కర్తికే కాదు—అందరికీ నే చెప్పేదిదే—వీలైనంతవరకు అవమానంనుంచీ ప్రాణాపాయంనుంచి తప్పించుకోవడం అవసరం.

ఏ: (అనుమానంగా) మరి...

మే: ఔను! నామాట—అందరికీ కలిగే ఆపదలు నాకూ దూరంగాలేవు. ఒక వందమంది సంసారాలను బోధచేసి నిలిపి ఉంచగలిగిన మనిషి నామాటల్ని లక్ష్యపెట్టి ఈఊరు వదిలి పెడతారా ఏన్!

ఏ: అక్కడికి వెళ్లి చూసిరానా అమ్మా?

మే: వద్దు! వద్దు! ఆ పనిమాత్రం చెయ్యకు. తలుపుతీసి ఈ రాత్రివేళ అవతలకి వెళ్లకు. నువ్వీ రాత్రి ఇక్కడే పడుకో.

ఏ: అనవసరంగా బెంగపడకండి! బాబుగారికేభయం లేదు.

మే: అబ్బే! అబ్బే! నాకే బెంగాలేదు.

ఏ: (ఆలోచిస్తూ మెల్లగా) నే నిక్కడే పడుక్కోవడం కాదమ్మా!

మే: (ఉలిక్కిపడి) కాదూ? ఎందుక్కాదు?

ఏ : మీకు తెలీని దేముందమ్మా - మా నాన్న వంట్లో బాగులేదు. పైగా నే వెళ్ళకపోతే ఇంట్లో వంటకాదు ఆయనికి.

మే: ఔనౌను. నాకు మతిలేదు. ఐనా యింత రాత్రయిపోయింది. ఆయనింకానీ—సాయం ఒస్తారు.

ఏ : వద్దమ్మా! మీమాటేచాలు! (ప్రక్కనున్న గదిలోకివెళ్ళి తిరిగి వస్తుంది చేతిలో ఒకపొట్లంతో)

మే : ఎప్పటివి?

ఏ : నిన్నటివమ్మా.

మే: నిన్నటివా? జబ్బు మనిషికి నిన్నటి రొట్టెలు పెడతావా? నీకేమన్నా మతుందిటే?

ఏ : (సిగ్గుపడుతూ) ఇవాళ చెయ్యలేదమ్మా. బంగాళ దుంపలు వేపుడు, మాసంకూర, చేపసూపు అయింది. అవికాక కట్‌లెట్సు, గుడ్లు ఉన్నాయి.

మే: అన్నెందుకు? ఎవడు తినను! సరే! వెళ్లు. జాగ్రత. (అధైర్యంగా) ఇంత రాత్రప్పుడు ఒంటిగా......!

ఏ: సెలవు.

[తలుపు తీసుకవెళ్ళి తిరిగి తలుపు దగ్గరగా వేస్తుంది? బయటినుంచి ఏన్‌గొంతు—'గడియ పెట్టు కోండెమ్మా!'—మేరీ గడియపెట్టదు. తలుపువేపు ఆలోచనగాచూసి దృష్టి మరల్చుకొని గదిలో పచారు చేస్తూ ఉంటుంది. కొన్ని నిముషాలలా తిరిగి, కుర్చీలో కూర్చొని అల్లిన లేసుని చూస్తూ ఉండిపోతుంది. తరువాత లేచి పియానోదగ్గరకి వె ఆలోచనగా నిల్చొని, మధ్య 'సి' మీద ప్రేలుతో కొడుతుంది. పియానోస్వరం గదినిండి, రానురాను తగ్గిపోతుంది; తలుపు తెరుచుకుంటుంది. మేరీ ఉలిక్కిపడి వెనక్కి తిరుగుతుంది. రివరెండ్ జార్జ్ ఫెడరిక్‌సన్ ప్రవేశిస్తారు. ముప్పైఏళ్ల అందమైన యువకుడు. కోల ముఖం. కళ్లు లోతుగా ఉంటాయి. వాటిలో చురుకు దనం అంతగా కనుపించదు. కాని స్థైర్యం, ఓర్మి ప్రతిబింబిస్తూ ఉంటాయి—ఎడమవైపుకు తీయబడి కళ్ళలోకి పడుతున్న పాపిడి. మనిషి పొడుగు ఐదడుగుల ఎనిమిదంగుళాలుంటుంది]

మే : (బరువు తగ్గినట్టు నిట్టూర్చి) ఓ! మీరా!

ఫె: (గది మధ్యకు వచ్చి పైనున్న కోటు విప్పుతూ) ఆలస్యం అయిందివాళ—కారణం చెప్తే, నీ కంతగా నచ్చదేమో?

మే : (ముందుకు వెళ్ళి కోటు అందుకుంటూ) నచ్చకపోవడాని కేముంది—కొత్తశిష్యులెవరైనా చేరి ఉంటారు. అంతేగా? బోధలుచేస్తూ ఉండిపో యుంటారు. అంతమాత్రానికి నేనెందుకు ఇదవాలి?

ఫె : (కుర్చీలో కూర్చుంటూ) అదేమీ కాదు. ఒక స్నేహితుణ్ణి భోజనానికి పిలిచేను.

మే : (ఆశ్చర్యంగాముఖంపెట్టి) భోజనానికా! ఇవాళా?

ఫె: ను. ఇవాళే—తొమ్మిదిటకల్లా ఒస్తానన్నాడాయన.

మే : నాకు ముందుగా తెలియచెయ్యకుండా ఎలా పిలిచారు. కళ్ళు మూసుకుంటే అన్నీ తయారయిపోతాయనుకున్నారా యేం?

ఫె: ఏదుంటే అదే తింటాడు.

మే : ఇది మరీబావుంది. స్నేహితుడ్ని కాయన్ని భోజనానికి పిలిచి చేసే మర్యాద!

[ప్రక్కగదిలోనికి వెళ్తుంది కోటు పెట్టడానికి. ఫెడరిక్‌సన్ కాలుమీద కాలు వేసుకుని కుర్చీకి చేరబడి వాచీని చూస్తూ తల రాసుకుంటాడు]

: ఇలారా. ఇంకా ఉంది విను.

మే : (గదిలోనుంచివస్తూ) వినడాని కేముంది గంటయినా టయిమివ్వండి. ఇప్పు ఏన్‌తో అన్నాను. బంగాళదుంపల వేపుడు, చేపలసూపు, గుడ్లు, మాసం ఇవన్నీ చేసానంటే ఎందుకని. పోనీండి. మంచిపనే అయింది.

ఫె : (వికసించినముఖంతో) నిజంగా! అయితే ఒక్క కాఫీచేస్తే సరిపోతుంది. అది ఐదునిముషాల పని. మరి నీకు గంట ఎందుకు? కూచో. మరి ఆ స్నేహితుడిగురించి ఇంకా వినాలని లేదాఏం?

మే : (చిరునవ్వుతో ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంటూ) వినడాని కేముంది—ఇంకో గంటకల్లా ఏ హెన్రీయో, ఏ విలియమో పరిచయంఅవుతాడుగా.

ఫె : ప్చ్! అలాంటిది కానేకాదు.

మే : మరి?

ఫె: ఇప్పు డిక్కడికి రాబోయేది మేజర్ ప్రాంకో.

మే : (త్రుళ్లిపడిలేచి) మేజర్ ఫ్రాంకో! శత్రు సైన్యాధిపతి!

ఫె : ఔను అతనే.

మే: జార్జ్! మీకు పిచ్చికాని ఎత్తిందా?

ఫె: (లేచి ఆమెను చేతులలోకి తీసుకుని కూర్చోపెడుతూ) ఎందుకలా వణికిపోతావ్. ఇప్పుడు వచ్చిన భయమేంలేదు. అతనికీ నాకూ పరిచయం నిన్ననే అయింది.

మే: (మెల్లగా) శత్రువుతో పరిచయం చేసుకోడానికి మీకేం అవసరమొచ్చింది?

ఫె: నిన్ననే ఆయన్ను కలుసుకోవడం సంభవించింది. నిన్నరాత్రి ఇంటికి తిరిగి వస్తూఉంటే దారిలో తటస్థపడ్డాడు. నన్ను ఎలానో తెలుసుకున్నాడు. "పార్సన్ ఫెడరిక్ మీరేనా" అని అడిగేడు. "ఔన"న్నాను. షికారుకని బయల్దేరేడుట. నేను ఊహించుకున్నంత మూర్ఖుడుగా లేడు మనిషి. మర్యాదనిస్తూ మాట్లాడడం నాకాశ్చర్యమనిపించింది. అతని టెంట్‌కి వెళ్ళి 'టీ' తాగేదాకా ఒప్పుకోలేదు.

మే: నిన్న ఇంత జరిగినా ఒక ముక్కన్నా నాతో చెప్పలేదే? అతడి పరిచయాన్ని వృద్ధిపొందించుకోడం నాకేమాత్రం ఇష్టంలేదు.

ఫె: నాకుమాత్రం ఇష్టం అంటావా? ఒక మనిషి మర్యాదనిచ్చి, పరిచయాన్ని కోరుతూఉంటే ఎలా కాదనడం? యుద్ధంగురించికాని, ప్రజల కష్టనిష్ఠురాలగురించి కాని ఇద్దరం ఏమీ మాట్లాడుకోలేదు. అంతా ఏదో తనగురించి చెప్పుకొచ్చేడు

మే: దీనివెనుక తప్పకుండా ఏదో ఉద్దేశం ఉండుండాలి. ఈ పల్లెలో మిగిలిన ప్రజలకంతా మీరు బోధ చేస్తున్నారని వా తెలుసు — పైగా...

ఫె: తెలుస్తే నాకేం? నేనేం తప్పుపని చెయ్యలేదే? నాకేది సరైనపని తోచిందో అది చేస్తున్నాను.

మే: మీకు సరైనది వాళ్ళకెలా సరిపోతుంది? ఇది మీకు తెలుసునా? ఏన్ ప్రియుణ్ణు డేవిడ్‌ని నడిరోడ్డుమీద కాల్పించింది ఇతనే!

ఫె: (ఆశ్చర్యపోకుండా) తెలుసు. న్ని తెలుసు. అయినా ఓర్చాలి. నువ్వే ఆలోచించు. ఇల్లూ వాకిలీ, భూమీ బుట్రా అన్నీ వదులుకొని, ఇక్కడొక శత్రువున్నాడని పోయి ఎక్కడుంటారు? ఈ శత్రువు అక్కడ లేడా? ఇవాళ కాకపోతే రేపు ఆక్రమిస్తాడా ప్రదేశాన్ని. అప్పుడు ఏ ఆధారం లేకుండా అక్కడ ఉండడం మంచిదా? ఏదో తలమీద ఒక ఉంటూ ఉన్న ఇక్కడుండడం మంచిదా?

మే: ఔను. నేనది ఒప్పుకుంటాను. కాని అది సాధ్యంకానిపని. చావన్నది ఎప్పటికన్నా ఉన్నా, దానినుంచి తప్పించుకుందామని, దాని నీడలకి దూరంగా ఉందామని ఉంటుంది ప్రతిఒక్కడికీ. అదొక్కటే కాక గౌరవంకూడా కాపాడుకోవాలని ఉంటుంది. ఈ ఇల్లూ వాకిలీ గుర్తెలా ఉంటాయి?

ఫె: అదే నుందాలోచన లేకపోవడం. అయినా నేనేమీ బలవంతం చెయ్యలేదు. నే చెప్పేది విన్నాక, ఇంకా ఎవరికన్నా వెళ్ళిపోవాలని ఉంటే వెళ్ళిపోవచ్చు కదూ?

మే: (మౌనంగా ఆలోచిస్తూ ఉంటుంది)

ఫె: నిన్న 'టీ' తాగివచ్చేను. ఇవాళ మళ్ళా ఇంటికి వచ్చేస్తూ ఉంటే ఎదురుపడ్డాడు. ఏవేవో లోకాభిరామాయణం మొదలుపెట్టి ఒకగంటవరకు అలా రోడ్డుమీద నే నిలబెట్టేసేడు. ఇంక విడిపోతామనగా అతడే అన్నాడు. 'మీ ఇంట్లో ఓసారి భోంచెయ్యాలని ఉంది. ఇవాళయితే బావుంటుంది' అని.

మే: అతనే అన్నాడా!!

ఫె: ఔను

మే: చాలా వింతగా ఉంది.

ఫె: ప్రత్యేకంగా ఏమీ ఏర్పాట్లు చెయ్యొద్దని కూడా చెప్పేడు.

మే: (లేస్తూ చిరాకుగా ముఖంపెట్టి) నిజంగా జార్జ్! ఇది ఆలోచించవల్సిన విషయమే! నాకెందుకో దిగులుగా ఉంది భయంగాకూడా ఉంది!

ఫె: ఏన్ లేదూ?

మే: లేదు. ఇప్పుడే వెళ్ళింది. దాని తండ్రికి ఒంట్లో బాగా లేదుట.

ఫె: ఔను—సాయంత్రం అక్కడి వెళ్ళేను.

మే: ఎలా ఉంది?

ఫె: ఒంట్లో సత్తువ లేదు. దానికితోడు జ్వరం. ఇవాళ కాస్త కుదుటపడింది. నువ్వేవద్దన చెయ్యాలా?

మే: నేనేం జంకుతాననుకున్నారా? ఆఫరవా ఏమీ లేదు... ఇక్కడెంత సైన్యం ఉంటుంది?

ఫె: ఈపల్లె ఒక కేంద్రం. ఇక్కడ రెండు బెటాలియన్లు. దానికి ఫ్రాంకో అధిపతి. స్వాధీనపరచుకున్నచోట మరి ఆక్రమణకి సైన్యం ఉండా

లిగా. ఇవాళ మరొక ముప్పై మైళ్ళు ముందుకు వెళ్లేరని వార్త.

మే: (నిట్టూరుస్తూ) నాకు చాలా అధైర్యంగానూ అయోమయంగానూ ఉంది. మనం మళ్ళీ స్వేచ్ఛగా ఉండేరోజులు ఎప్పుడొస్తాయా అని దిగులుగా వుంది.

ఫె: అంటిపెట్టుకుని ఉండాలి మనం. అంటిపెట్టుకుని ఉండాలి! అక్కడ మన సైన్యాలు మాత్రం ఏంచేస్తాయి. మనం ఉన్నచోటఉంటే సగం బలం; మనని ఖాయిదాలో ఉంచడానికిక్కడ చాలాబలం ఉంచాల్సొస్తుంది. అలా ప్రతిపల్లె, ప్రతిగ్రామంలోనూ మనం ఎక్కడివాళ్లమక్కడే ఉంటే మన శత్రువులకి ఎంతభారం!

మే: భారం అని తోస్తే వరసపెట్టి కాల్చేస్తారు. దానితో ఆ ఆటంకం తొలగిపోతుంది.

ఫె: వాళ్ళూ మనుష్యులే మేరీ! ఎందర్నలా కాల్చేస్తారు. అందర్నీ కాల్చేసేక ఎవరిమీద చెలాయిస్తారధికారం? మొదట కొన్ని కాల్పులు చావులు ఉంటాయి కాని అది అట్టే కాలం సాగదు. యుద్ధంలోని ముఖ్యోద్దేశం ప్రజల్ని చంపడం కాదు. రాజ్యాన్ని సేకరించడం. మనుష్యులనంతా తమ గుప్పిటలో ఇముడ్చుకోవటం, వాళ్ళమీద అధికారం చెలాయించడం. అంతేగా! మనం అంటిపెట్టుకోవాలి.

మే: నన్ను క్షమించండి. మీ బోధలన్నీ ఏవో దూరపుకొండల్లా ఉంటాయి నాకు. ఇప్పుడు పడే బాధలు ఆలోచించరేం? ప్రాణానికీ గౌరవానికీ ఏమాత్రం భద్రత ఉందిక్కడ?

[తలుపు తట్టినచప్పుడు. మేరీ ఉలిక్కిపడుతుంది. ఆమె ముఖం వివర్ణమౌతుంది.]

ఫె: (భయంలేదని ఆమెకు సన్నచేస్తూ) రావచ్చు!

[తలుపు తెరుచుకుంటుంది. మేజర్ ఫ్రాంకో ప్రవేశిస్తాడు యూనిఫారంలో. మనిషి పొడుగరి. ఆ పొడుగుమీద శరీరదారుఢ్యం చూడగానే సరిగా అగుపించదు. ఫెడరిక్ సన్ వయస్సే ఉంటుంది. సూది ముక్కు. ఆకర్షణీయమైన ముఖం. గదిలోకి ప్రవేశిస్తూ తలమీది టోపీతీసి దగ్గరగావున్న టేబిలుమీద నిర్లక్ష్యంగా విసిరేస్తాడు. పొడుగాటి నల్లని వెంట్రుకలు అల్లిబిల్లిగా కళ్లలోకి పడుతూ ఉంటాయి. —ఫెడరిక్ సన్, మేరీ లేచి నిల్చుంటారు]

ఫ్రాంకో: కొంచం ముందుగా వచ్చేను. మీకంతరాయం కలిగించలేదనుకుంటాను.

[మేరీ వింతగా అతణ్ణి చూస్తుంది]

ఫె: అలా అనుకోకండి—(కరస్పర్శచేస్తూ) మేరీ! వారు మేజర్ ఫ్రాంకో. ఈమె నా భార్య మేరీ!

ఫ్రాం: (గౌరవ సూచకంగా వంగి) మీ పరిచయం కలిగినందుకు చాలా సంతోషం.

మే: (చిరాకుగా) నాకూ సంతోషంగా ఉంది!

ఫె: (కుర్చీ చూపిస్తూ) కూర్చోండి!

ఫ్రాం: (కూర్చుంటూ) థాంక్ యూ! (ఫ్రాంకోకి ఎదురుగా టేబిలుకి అవతల ప్రక్కని మేరీ, ఫెడరిక్ సన్ కూర్చుంటారు.

[ముగ్గురూ ఒక నిమిషం మౌనం వహిస్తారు]

ఫె: మంట పెట్టనా చలి కాచుకోడానికి.

ఫ్రాం: థాంక్స్! అక్కర్లేదు. చలి ఇవాళ అంతగా లేదు. చలికాలం మొదలయి నెలాళ్ళయినా మా దేశంలో ఉన్న చలి ఇక్కడలేదు. నిజానికి నేను కప్పుకోటం లేదనే చెప్పాలి.

ఫె: ఎక్కువ చలికి అలవాటు పడడంవల్ల మీకలా అనిపిస్తుంది. ఇవాళ కొద్దిగా తగ్గిందేకాని నిన్న చలి భరించరానిదిగా ఉంది. ఏం మేరీ?

[మేరీ ఔనన్నట్టు తల ఊపుతుంది]

ఫ్రాం: (మేరీవేపు ఆమోదంగా చూస్తూ) చుట్ట కాల్చుకోవచ్చా?

మే: (తత్తరపాటుతో) నాకేం అభ్యంతరం లేదు.

ఫ్రాం: (కోటు జేబులోనుండి పొడుగాటి రెండు చుట్టలుతీసి ఒకటి ఫెడరిక్ సన్‌కి ఇవ్వబోతాడు)

ఫె: క్షమించాలి! నేను కాల్చను.

ఫ్రాం: (మూతి బిగించి, రెప్ప లెగరేసి, ఒక చుట్ట జేబులో పెట్టి రెండవది పెదవులమధ్య పెట్టుకుంటూ) మీరు పరమఛాందసుల్లా ఉన్నారే.

ఫె: ఛాందసానికేముంది లెండి; అందులో నాకట్టే ఆనందంలేదు. నేనూ ఒకప్పుడు బాగా కాల్చినవాడినే!

ఫ్రాం: (మేరీవైపు తిరిగి చిరునవ్వు నవ్వి తిరిగి ఫెడరిక్‌సన్‌ని చూస్తూ) ఔనౌను! నిజమే! ఆనందం మనుష్యులనిబట్టి మారుతూ ఉంటుంది. ఒక మహానుభావుడన్నాడు—ఆనందం వ్యసనంలో ఉంటుందని. మీరేమన్నా అనండి, ఆమాటలు తూచిన నిజాల్లా ఉంటాయి మరి. (సిగర్ లైటరుతీసి చుట్టముట్టిస్తూ) మిసెస్ ఫెడరిక్‌సన్! ఈ చుట్టలు కాల్చడంలో ఆనందం వెంటనే తెలీదు. ఏదన్నా నిలకడమీదకాని తేలదు. ఇది మొదటిరకం వర్జీనియా పొగాకు-స్పెషల్ బ్లెండు (పొగ జోరుగా లాగి గాలిలోకి వదుల్తాడు. పొగ మేరీవైపు వెళ్తుంది. ఆమె కొద్దిగా దగ్గుతుంది) క్షమించండి. పొగ మీకు పడదులా ఉంది. ఇంత మడికట్టుకునే భర్తలవల్ల వచ్చే అనర్థ కాలే ఇవి! (నవ్వుతాడు)

[మేరీ ముఖం కందగడ్డ చేసుకుంటుంది. ఫెడరిక్‌సన్ కొద్దిగా ముఖం చిన్నది చేసుకుని దృష్టి మార్చుకుంటాడు]

కష్టం కలిగిస్తే క్షమించండి. గుట్ట ఆర్పేస్తాను పోనీ!

మే: అబ్బెబ్బే! మీ ఆనందాని కాటంకం రానీయకండి!

ఫె: అబ్బెబ్బే! కాల్చుకోండి. కాల్చుకోండి!

[మేరీ లేవబోతుంది]

ఫ్రాం: డిన్నర్‌కి ఇంకా సమయముంది. తొందరలేదు కూర్చోండి. పిచ్చాపాటీ మాట్లాడుకుంటే ఎంతో కులాసాగా కాలం వెళ్ళిపోతుంది.

[హతాశురాలై మేరీ తిరిగి కుర్చీలో కూర్చుంటుంది]

అన్నట్టు అడగడం మరిచాను. రెవరెండ్ ఫెడరిక్‌సన్! మీకేమన్నా పిల్లలా?

[ఆశ్చర్యంతో మేరీ వెనుకకు తగ్గుతుంది]

ఫె: (తొణకకుండా) దయతో అడిగినందుకు కృతజ్ఞుణ్ణి ఆ భారాన్ని భగవంతుడు మాకింకా కలిగించలేదు.

ఫ్రాం: (పకపకనవ్వి) మతబోధకులు మీరే అలా అంటున్నారా? పిల్లలే మీకు భారమయ్యారా? ఏం మిసెస్ ఫెడరిక్‌సన్! భావిలో దేశరక్షకులు, వీరాధివీరులు అయ్యే కొడుకులుంటే ఎంత గర్వకారణం. శత్రువుల్ని చెండాడేందుకు తోడ్పడి ఉందురే?

మే: (అందులోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకుని ధైర్యంగా) అంత పేరాశ నాకులేదు మేజర్! కాన్సెంట్రేషన్ క్యాంపుల్లో వుండడానికి, రోడ్ల మీద కాల్పింపబడడానికి, మీ అత్యాచారాలకి ఎర అయ్యేందుకు కొడుకులు నాకవసరంలేదు.

[ఫ్రాంకో నవ్వుపోతుంది. కొద్దిగా ముఖం చికాకుపరచుకుంటాడు]

ఫె: (చిన్ననవ్వు నవ్వి) మేరీకి ఉపన్యాసాలివ్వడం అంటే సరదా మేజర్!

మే: జార్జ్!

ఫ్రాం: (నవ్వు తెచ్చుకుని) పోనీయండి ఆ సంగతులు మరెత్తొద్దు. (పియానో వేపు చూస్తూ) చాలా ఖరీదైన పియానో మిసెస్ ఫెడరిక్‌సన్! మీ అందంలానే మీవాద్యంకూడా సరళంగా, హాయిగా ఉంటుందనుకుంటాను. అది వినేభాగ్యం కలిగిస్తారా?

మే: (కోపగించుకోకుండా ఫెడరిక్‌సన్ వైపు చూస్తూ చిరునవ్వుతో) ఆ భాగ్యం నాకు లేదు!

ఫ్రాం: (ఫెడరిక్‌సన్ వైపుచూస్తూ) ఎంత ఆశాభంగం! నిజంగా! మీరు వాయిస్తారా ఫెడరిక్‌సన్! నేను కలలోనన్నా నమ్మలేను!

[ఫెడరిక్‌సన్ మేరీని చూస్తూ నవ్వుతాడు]

మే: ఆయనవాద్యం విన్నాక ఆభయం మీకుండదని హామీ యిస్తున్నాను.

ఫ్రాం: మీ సతీమణి మాటల్ని వృథా పోనివ్వకండి.

ఫె: ఎంతమాత్రం నిలబెట్టుకోగలనో అనుమానమే.

[లేచి పియానోవద్దకు వెళ్తాడు. మేరీకూడా లేస్తుంది గదిలోకి వెళ్లడానికి—ఫ్రాంకో ప్రశ్నార్థకంగా ముఖం పెడతాడు]

మే: డిన్నర్ టయిమయిందిగా?

ఫ్రాం: మీ గడియారం ముందుకు నడుస్తోంది. సరైనకాలంకన్న ముందుకి పోవాలని చూస్తున్నాయి మీ గడియారాలు! నాగడియారం కచ్చితంగా నడుస్తుంది. ఇంకా తొమ్మిది కాలేదు.

మే: (తల త్రిప్పుకుని గదిలోనికి వెళ్తూ) మా గడియారాలు ముందున్నా సరిగాలేకున్నా, వెనుక మాత్రం పడలేదు. నేను నిశ్చయంగా చెప్తున్నాను మీ గడియారం వెనుకపడి నడుస్తోంది.

[ఫ్రాంకో అయిష్టంగా ముఖంపెట్టి పియానో వైపు తిరిగిఉన్న ఫెడరిక్‌సన్‌ని చూస్తాడు. అతడి కన్నులు మేరీ వెళ్ళిన ద్వారంవైపుకు ఆత్రంగా ఉండుండి చూస్తూ ఉంటాయి]

ఫె: (పియానోముందు కుర్చీలో కూర్చొని) ఏ ట్యూన్ ఇష్టం మీకు?

ఫ్రాం: (ఉలికిపడి) ఆఁ...? ఏదైనా సరే. మీకు బాగా నచ్చినది.

[ఫెడరిక్‌సన్ మారుమాటలేకుండా వాద్యం మొదలెడతాడు. పియానో స్వరం గంభీరంగా గదంతా నిండుతుంది. మొదట పియానో స్వరాలకి శ్రద్ధచూపకుండా ద్వారంవైపు చూస్తూ ఉంటాడు ఫ్రాంకో. రాను రాను ఆ స్వరాలు అతన్ని ఆకర్షిస్తాయి. ఆఖరికి వాటిని వింటూ ద్వారంవైపు చూడడం మరిచిపోతాడు. కట్టుబడిపోయినట్లు వాటిలో కలిసిపోయి. అర్ధనిమీలిత నేత్రాలతో వింటూ ఉంటాడు. ఈనున్ని మేరీ పింగాణీ గిన్నెలలో డిన్నర్ తెచ్చి ముగ్గురికీ చడిలేకుండా సర్దుతూ ఉంటుంది. కళ్లు పూర్తిగా మూసి వింటున్న ఫ్రాంకో దీనిని గమనించడు, ఆఖరి స్వరపు మీటనొక్కి పియానోముందునుండి లేస్తాడు ఫెడరిక్‌సన్—ఒక్క నిట్టూర్పు వదిలి కన్నులు విప్పుతాడు ఫ్రాంకో—మూడు ప్లేట్లలో గ్రుడ్లు పెట్టుకొనివస్తూ మేరీకనుపిస్తుం దెదురుగా—ఇదివరకు తను కూర్చున్న కుర్చీలో నే కూర్చుంటాడు ఫెడరిక్‌సన్]

మే: (ప్లేట్లు టేబులుమీద ఉంచుతూ) నిషా చేసేవస్తువలేవీ మీ కిక్కడ దొరకవు, క్షమించాలి.

[ఫెడరిక్‌సన్ పకపక నవ్వుతాడు]

ఫ్రాం: (చిన్న నవ్వు నవ్వి) మీరు పొరబడుతున్నారు. త్రాగుడుకన్నా నిషాఇచ్చేవుంటూఉంటే!

[మేరీ తృళ్లిపడుతుంది. ఫెడరిక్‌సన్ పెదవులు నొక్కుకుంటాడు]

మాట వరసకి ఫెడరిక్‌సన్ వాద్యం!...

[మేరీ బరువు తగ్గినట్టు నిట్టూరుస్తుంది]

ధ్వని తరంగాలలో మునిగి నాడల్లే నేను మరిచిపోయానంటే ఎన్ని పైంట్లసారాయం అంతపని చెయ్యగలదు నామీద!

(మేరీ కళ్లలోకిచూసి నవ్వుతాడు. మేరీకళ్లు త్రిప్పుకుంటుంది)

ఫె: కాఫీకూడా తెచ్చి పెట్టేయ్ మేరీ! అందరం ఒక్కసారే కూర్చుందాం.

(గదిలోనికి వస్తుంది మేరీ)

ఏన్ నేను వచ్చేముందే ఇంటికి పోయింగి.

ఫ్రాం: ఏన్?

ఫె: పనిమనిషి. దానితండ్రికి ఒంట్లో స్వస్థతగాలేదు.

ఫ్రాం: మీకందరికీ అనవసరపుశ్రమ నిస్తున్నానేమో.

ఫె: అనవసరమైన దేముంది. అంతా అవసరమే. మీ రావిచారాన్ని వెలిబుచ్చనక్కర్లేదు. ఈ ప్రపంచంలో మనం ఇంకొకడికి పరిశ్రమ కలిగించకుండా ఎలా బ్రతకగలం? మాకు మీరు కలిగించిన శ్రమ అంటే లెక్కలోకి తీసుకోనక్కరలేదు. మూడు మైళ్ళు నడచి రావటంలో మీరు శ్రమ తీసుకోలేదూ?

ఫ్రాం: శ్రమతీసుకున్నందుకు ఫలితం ఆలోచించారా?

ఫె: అదే నేనూ అనేది. ఒక అతిథిని సత్కరించడంలో అంత ఆనందమూ ఉంది. పడిన శ్రమకి అది దక్కుట.

[మేరీ కాఫీ ట్రేతో ప్రవేశిస్తుంది. ట్రే, బల్లమీదవుంచి ఫెడరిక్ ప్రక్కని కూర్చుంటుందామె. అందరూ తినడం ప్రారంభిస్తారు. మొదటి భయం, బెదురు మేరీ ముఖంలోనుంచి పోయేయి. ఆమె ధైర్యంగానూ సూటిగానూ తనపని తాను చేసుకపోతోంది. అంతా మౌనంగా ఉంటారు. కొన్ని నిముషాలు గడిచాక]

డిన్నర్ విషయం తెలుస్తే మేరీ పనిమనిషిని పంపి ఉండకపోను—మనకు అనవసరంగా శ్రమ కలిగించానని మేజర్ అంటున్నారు.

మే: (చిరునవ్వుతో) శ్రమనిస్తూ అనవసరంగా కలిగించా మనటంలో అర్థంలేదు. అవి కనుతుడుపు మాటలు.

ఫ్రాం: పనిమనిషి ఉండదని తెలుస్తే ఈశ్రమే కలిగించకపోదును.

మే: మీరు వస్తున్నారని తెలిసినా ఏన్‌ని ఉంచకపోదును.

ఫె: (ఆశ్చర్యంగా మేరీవంక చూస్తాడు)

ఫ్రాం: (దెబ్బతిన్నట్టవుతాడు)

మే: దాని తండ్రికి బాగాలేదు. మన ఆనందాని కని ఒకర్ని కష్టపెట్టడం భావ్యంకాదు కూడా!

ఫ్రాం: (ముఖం ముడుచుకుని ప్రశ్నార్థకంగా చూస్తాడు)

[మేరీ తృప్తిగా చిరునవ్వు నవ్వుకుంటుంది. మరి కొన్ని నిముషాలు నిశ్శబ్దంగా గడుస్తాయి. ప్లేట్లన్నీ ఖాళీఔతాయి. ఎవరి కాఫీ వాళ్లు కలుపుకుంటూ ఉంటారు]

మే: మేజర్ ఫ్రాంకో! అతిధి ఎవరో ఏన్‌కి తెలుస్తే, ఈ ప్రపంచమంతా ఇచ్చినా ఆమె ఉండదు తెల్సునా?

[ఫెడరిక్‌సన్ ఆ సంభాషణ వద్దన్నట్టుగా ముఖం పెడతాడు]

ఫ్రాం: ఔను. నాకు తెలుసు.

మే: మీకు పూర్తిగా తెలీదు. అతిథి ఎవరైనా నేచెపితే ఒప్పుకుంటుంది ఏన్. కాని మీరు ఆమెకు తీరని ఒకలోటును, అపచారాన్ని చేసేరని ఆమె ఉద్దేశం.

ఫ్రాం: (ఆశ్చర్యపోతూ) ఆమెకా!! ఆమె పేరు నే నిప్పుడే వినడం.

మే: ఆమె ప్రియుడు డేవిడ్‌ని మీరొకనాడు నడిరోడ్డుమీద కాల్పించేరు.

ఫ్రాం: (ముఖం నల్లబారుతుంది కోపంతో) ఆసంగతు లిప్పుడు అనవసరం.

మే: పేరే వినలేదంటే చెప్తున్నాను. ఆపనికి జబాబుదారీ మీమీదుంది!

ఫె: (చికాకుగా) మేరీ! ఆసంగతులన్నీ ఇప్పుడెందుకు?

మే: ఆ సంగతులనుగురించి చర్చించడం నాకూ యిష్టంలేదు. మాట వచ్చింది కాబట్టి ఉన్నమాట చెప్పేను.

ఫ్రాం: ఇవాళ కాదు. మరోనాడు నేను మీ కిస్తాను జబాబు.

(కాఫీకప్పు టేబిలుమీద పెట్టిలేచేస్తాడు)

ఫె: మేజర్! అప్పుడే!

మే: మేజర్!

ఫ్రాం: (గడియారం చూసుకొని) ఔను. టయిమయింది! మీ ఆదరణకి చాలా కృతజ్ఞుణ్ణి. గుడ్ నైట్!

[మేరీ కళ్ళలోకి వింతగా చూసి, ఫెడరిక్‌సన్‌తో కరస్పర్శచేసి, గబిగా గది వదుల్తాడు మేజర్ ఫ్రాంకో—మేరీ, ఫెడరిక్‌సన్ ఒకరి ముఖం ఒకరు కొద్దిసేపు చూసుకుంటారు. మేరీ చిరునవ్వు నవ్వుతుంది. ఫెడరిక్‌సన్ ఆలోచిస్తూ ఉంటాడు]

## రంగము: II

[మొదటి రంగంలానే ఉంటుందంతా—కాని ఇప్పుడు పగలు—గడియారం మధ్యాహ్నం రెండు గంటలు సూచిస్తూ ఉంటుంది—మేరీ అల్లుకుంటూ ఉంటుంది—తలుపు తెరుచుకుంటుంది ఒక్కసారిగా—మేజర్ ఫ్రాంకో ప్రవేశిస్తాడు—మేరీ వెనుదిరిగి చూసి, చివాల్న లేచి, భయంతో కేక వెయ్యబోయిన దల్లా సంబాళించుకుని ఆశ్చర్యంగా]

మే: మేజర్ ఫ్రాంకో!

ఫ్రాం: (ముందుకువస్తూ) ఔను. రివరెండ్ ఫెడరిక్‌సన్ ఇంట్లో లేరని మీరు చెప్పనవరంలేదు. ఆయన లేరని తెలిసే నేనొచ్చాను.

మే: (మరింత ఆశ్చర్యపోయి భయంతో) మేజర్!

ఫ్రాం: (గది మధ్యకువచ్చి టేబులుకు చేరబడి) మీరు మొన్న నడిగిన ప్రశ్నకి జవాబివ్వడాని కొచ్చాను నేను.

మే: (సర్దుకొని మూలనున్న పియానోవద్దకు వెళ్తూ) ఓ! జార్జికూడా ఉంటే బావుంటుంది.

ఫ్రాం: నాకు తెలుసు ఆయన అవసరంలేదని. అందుకే అయన లేనిసమయం చూసుకువచ్చాను.

మే: మీ జవాబు వినడానికి ఆయనకీ సమానమైన హక్కుంది. అయన లేనప్పుడు నేను వినలేను. క్షమించండి!

ఫ్రాం: (నవ్వి) నేను లక్ష్యపెడుతున్నది ఆయన్నికాదు. మొన్న నేను విందుకువచ్చింది, ఆయన చెలిమిని సంపాదించుకోడానికే ననుకున్నారా!

మే: (భయంతో ముఖం తెల్లగా అవగా) మేజర్! ఆ సంగతులన్నీ ఇప్పుడు మాట్లాడకండి దయఉంచి ఇక్కడనుంచి బయటకి వెళ్ళిపోండి!

ఫ్రాం: (ఆమెను సమీపిస్తూ) మీరే అడిగేరు కదూ సంజాయిషీ?

మే: ఔను! కాని ఇప్పుడు సమయం కాదు. దయఉంచి.

ఫ్రాం: వద్దు! వద్దు! అంత ప్రాధేయ పడకండి. (గొంతు తగ్గించి) మొన్న నెందుకువచ్చానో తెల్సునా విందుకి. మిమ్మల్ని చూసేందుకే.

మే: (కేక వెయ్యబోయినదల్లా, మేజర్, ఫ్రాంకో ముఖంలోనికి చూసి భయంతో వణుకుతూ వెనుకకు తగ్గుతుంది)

ఫ్రాం: మీగురించి విన్నాను ఇదివరకు. పరిచయం కలిగించుకున్నాను మొన్న!

మే: (అంత భయంలోనూ ఏదో తెలిసినట్టు ముఖం పెట్టి) అందుకే మీ అంతటికి మీరు ఆహ్వానింప చేసుకున్నారు!

ఫ్రాం: తప్పకుండా! దానికి వేరే కారణమేముంది!

మే: (ఏ జవాబు ఇవ్వడానికీ తోచదు. ఆఖరికి ధైర్యం చిక్కబట్టి) నేను మీకు భయపడతాననుకొని నన్ను బెదిరించలేరు! నాకు జార్జ్ దగ్గరతప్ప ఎవరి దగ్గరా భయంలేదు.

ఫ్రాం: అదే నాక్కావల్సింది! జార్జంటే మీ కంత ప్రేమా?

మే: అనవసరంగా మాట్లాడుతున్నారు!

ఫ్రాం: మీ ఆయనే మొన్న అన్నారు. అనవసరమైనదంటూ లేదని!

మే: (ప్రాధేయతగా ముఖం పెట్టి) మిమ్మల్ని బ్రతిమిలాడుకుంటున్నాను. ఇప్పటి కిక్కడ్నించి వెళ్ళండి!

ఫ్రాం: డేవిడ్ చావుకి జవాబుదారీ నామీదుందన్నారు! (చేతులు కట్టుకొని తిన్నగా నిలబడుతూ) డేవిడ్నే కాదు; పార్సన్ ఫెడరిక్సన్ని కూడా రేపు నడిరోడ్డుమీద కాల్పించగలను.

మే: (పిచ్చిదానిలా) మేజర్!

ఫ్రాం: డేవిడ్ కి ఒక ప్రియురాలుందని మాకు తెల్సుకోనవసరం లేదు. ఆ ప్రియురాలు అతనికోసం ప్రాణాన్నా త్యాగం చెయ్యగలదని కాని, అతని చావు వల్ల ఆమెజీవితానికి తీరనిలోటు కలుగుతుందని కాని మా కవసరంలేదు. మా దొకటే గురి. ఒకటే ఆశయం. దాని కడ్డొచ్చిన వాళ్ళల్లా పురుగుల్లా కాలిపోతారు. యుద్ధమంటే ఏమిటో తెల్సునా మీకు.

మే: (నోరు తెరుచుకుని వింతగా చూస్తూ ఉంటుంది ఫ్రాంకోని)

ఫ్రాం: మా సైనికులున్నారు. నేనున్నాను. ఈ యుద్ధంలో నేను చచ్చిపోతే లెక్క చేసేవారెక్కడ లేరు. ఒక సైనికుడు పోతాడు. ఒక మరపనికి రాకుండా పోతుంది. కాని, కొన్ని వందల మైళ్ళ దూరంలో నాకోసం కొందరు కన్నీళ్ళు కారుస్తారని ఎవ్వరూ గుర్తించరు అవసరంలేదు కూడా. ఇది మీకు తెలుసునా? ఫెడరిక్సన్ మాకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నాడు. అది నాకు తెలుసు. రేపు నాలుగు రోడ్లమధ్యా మసి చేయగలను అతడ్ని!

మే: (చెవులు రెండూ మూసుకొని వెర్రిగా అరుస్తుంది)

ఫ్రాం: అప్పుడు ఫెడరిక్సన్ ఒక ప్రవాహానికి అడ్డుగా ఉన్న ఒక పురుగు—ఊడ్చుకుపోతాడు. ప్రాణంగా అతడ్ని ప్రేమించే ఒక అందమైన భార్య ఉందని, ఆమెకి తీవ్రమైన బాధని కలిగిస్తున్నామని అనుకోం—కొందరు జీవులకి కలిగే బాధని లెక్కలోకి తీసుకుని ఒక ఆశయాన్ని త్యజించలేం. అదే నా జవాబుదారీ.

మే: (భయపడుతూ) అంతేనా? ఇంక చాల్లెండి. నన్నొంటిగా ఉండనీయండి. మీకు పుణ్యముంటుంది!

ఫ్రాం: (దగ్గరగా వెళ్తూ) మేరీ!

[మేరీ త్రుళ్ళిపడి వెర్రిదాన్లా చూస్తుంది మేజర్ ఫ్రాంకోనీ, ఆ సంబోధనని ఎలా ఎదుర్కోవడమో తెలియక తికమక పడుతుంది]

ఇంక మరోలా పిలవడం నా కిష్టంలేదు. (గొంతు తగ్గించి) ఒకే ఒకమాట అడుగుతున్నాను సూటిగా. ఇలాటి విషయాల్లో ఇంకోలా మాట్లాడే రీతి నాకు తెలీదు నీ అందానికి నేను లొంగిపోయేను.

మే: ఇదేమిటిదంతా! ఓరి దేముడా! ఏన్! ఏన్!

(గదివైపు పరుగెత్తబోతుంది. కాని, ఫ్రాంకో అడ్డంగా ఉంటాడు)

ఫ్రాం: మనసు పాడుచేసుకోవద్దు. బలవంతం ఏమీ లేదు. స్థిమితంగా విను.

మే: (వెర్రిదాన్లా) ఏన్! ఏన్!

ఫ్రాం : ఏన్ ఉన్నప్పుడు వచ్చేటంత తెలివి తక్కువపని చేస్తాననుకున్నావా?

మే : ఏన్ లేదూ? ఓరి భగవంతుడా! ఏం చెయ్యాలి మిప్పుడు?

ఫ్రాం : నాకిక వ్యవధి లేదు. వెళ్లాలి. స్థిమితంగా విను. రెండేమాటలు. నేను నీకు వశుణ్ణవుతున్నాను. తృణీకరిస్తావా?

మే : (వణుకుతూ పియానో వైపు ముఖం పెట్టి) ఇలాటి పరిస్థితి వస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. ప్రాణాలని పోగొట్టుకుంటాను కాని ఈ అవమానాన్ని భరించలేను!

ఫ్రాం: (చిన్న నవ్వుతో) అదంత గొప్ప సంగతి కాదు—పురుగుల్లా ఎగిరిపోతారు, ఏనుగుల లాటి వాళ్ళు యుద్ధంలో—బ్రతకడమే కష్టం అనిపిస్తుంది నాకు. (ఊరుకొని) ఈ సంగతి అతి రహస్యంగా ఉంటుంది. అందుకే ఏన్ లేని...

మే: నీచుడా! ద్రోహీ!

ఫ్రాం: నడిరోడ్డుమీద స్వర్గాని కెగిరిపోయే రెవరెండ్ ఫ్రెడరిక్ సన్ జీవితానికి జవాబుదారీ నీమీద ఉంటుంది ఇంక.

మే: (కళ్లు పెద్దవిచేసి) ఆఁ! జార్జ్ జీవితమా!!

ఫ్రాం: (ఆమెను సమీపిస్తూ మెల్లిగా) ఔను!

[మేరీ ప్రతిమలా నిలబడి శూన్యంగా చూస్తూ ఉంటుంది. ఫ్రాంకో ఆమెను సమీపించి ఆమె చేతి వేళ్ళను పట్టుకొని వాటిని ముద్దు పెట్టుకుంటాడు. మేరీ ఇది గమనించనట్టే ఉండిపోతుంది. ఫ్రాంకో వెనుకకి నడిచి, వంగి, చిరునవ్వు నవ్వి గది వదుల్తాడు. మేరీ కళ్ళవెంబడి నీరు ధారలుకట్టి పారుతూ ఉంటుంది, రెవరెండ్ జార్జ్ ఫ్రెడరిక్ సన్ ప్రవేశిస్తాడు—చిరునవ్వుతో ప్రవేశించిన వాడల్లా మేరీని చూసి ఆశ్చర్యపోతాడు—భర్తని చూసి మేరీ కంగారుగా కళ్ళు తుడుచుకుంటుంది.]

ఫ్రె: (మేరీని సమీపిస్తూ) మేరీ! కళ్లంట నీళ్లేమిటి? అలా నిల్చుండి పోయేవేం?

మే: (నవ్వడానికి ప్రయత్నిస్తూ) ఏంలేదు! ఏన్ తలపుకొచ్చినపుడల్లా వెర్రిదాన్లా అయిపోతాను దాని ప్రియుడు, డేవిడ్!

ఫ్రె: ఓ! అవన్నీ అస్తమానం ఎందుకు మనసులోకి తెచ్చుకుంటావ్. అవన్నీ జరిగిపోయేయి. (ఆమెను దగ్గరగా తీసుకుని కన్నీరు తుడుస్తూ) అవును పాపం! విచారకరమైన సంగతే. నాకూ ఒక్కొక్కప్పుడు ఆవేశం పొంగి పారుతుంది. కాని ఓర్చాలి! ఓర్చాలి!

మే: (వింతగా భర్తముఖంలోకి చూసి వెంటనే తలదించుకొని) ఓర్పు!

ఫ్రె: ఔను మేరీ! ఓర్పు!

[ఇద్దరూ కొద్దిక్షణాలు మౌనంగా ఉంటారు. మేరీ ఫ్రెడరిక్ సన్ భుజానికి తలనానుస్తుంది. ఫ్రెడరిక్ సన్ పియానోకి చేరబడతాడు].

మేరీ! నీ కిక్కడుండడం ఇష్టం లేదుకదూ?

మే : ఇష్టంలేకపోవడమా?—మీరు లేకుండా నే నేక్కడుండగలను?

ఫ్రె : నేనుకూడా వస్తే వెళ్ళిపోవాలని ఉంది—ఏం?

మే : ఎందుకలా అడుగుతారు. అది జరిగేపనా జార్జ్!

ఫ్రె : కాదు మేరీ! కాదు! ఈ ఊరు వదలడానికి నే నాఖరువాడిని. ఒక శత్రుసైనికుడన్నా ఉన్నంత కాలం నే నిక్కడ ఉండవల్సిందే. తరవాత సంగతి దేవు డెరుగును.

మే : (నిట్టూరుస్తుంది)

ఫ్రె : (ఆమె తల నిమురుతూ మెల్లగా) మేరీ! ఇష్టంలేనివాళ్ళని ఉండమనటం నా మతం కాదు. సంగతులు బోధపరుస్తాను. అంతే నా పూచీ!

మే : (ఊరుకొని ఆలోచిస్తూ ఉంటుంది)

ఫ్రె : నేనొకమాట చెప్తాను. నీకీ వాతావరణంలో ఉండడం ఇష్టంలేదని నాకు తెలుసు. ఒక్క పని చెయ్యరాదూ. మీ పినతల్లిదగ్గరికి వెళ్లు—మార్పు కోసం—అదింకా ఆక్రమణ క్రిందకి రాలేదు. రెండు వందలమైళ్ళే అనుకో. ఈ సరిహద్దుదాటి పోయావంటే రైళ్లు, మామూలు ప్రయాణీకులూనూ! అంతా మామూలే!

మే : నేను మిమ్మల్ని వదిలి వెళ్లను! అదెప్పటికీ జరగదు!!

దారిలో నీకేభయం లేకుండా మేజర్ ఫ్రాంకో సహాయపడతాడు.

మే : (త్రుళ్లిపడి) మేజర్ ఫ్రాంకో!

ఫె: ఔను. శత్రుపక్షంవాడైనా ఫ్రాంకో నెమ్మదైన మనిషి. డేవిడ్‌ని కాల్పించినవాడు అతడు కాడుటఅసలు. ఏదోపొరపాటు జరిగిందంటున్నారు.

మే: (పరిశీలనగా ఫెడరిక్‌సన్‌ని చూసి, టేబులునైపు నడుస్తుంది తల దించుకొని).

ఫె: నీకు మనసు బాగాలేదులా ఉంది. అనవసరమైనవాటిని గురించి ఆలోచిస్తూ ఎందుకు మనసు క్రుంగదీసుకుంటావ్? టీ తాగుదాం ఉండు. కొంత శాంతి దొరకొచ్చు నీకు.

మే: (టేబులుముందు ఒక కుర్చీలో కూలబడి) నాకేమీ ఒద్దు. ఏమీ తీసుకోవాలని లేదు.

ఫె: నామాట విను. నాకోసం!

మే: ఒద్దు! బలవంత పెట్టకండి.

ఫె: (వెళ్లి ఆమె ప్రక్క కుర్చీలో కూర్చుంటాడు. మౌనంగా ఇద్దరూ ఆలోచిస్తూ ఉంటారు. గడియారం అరగంట కొడుతుంది మూడున్నర గంటలు సూచిస్తూ. ఏన్ వీధిలోనుండి ప్రవేశిస్తుంది. మేరీ తల ఎత్తి ఏదో ప్రశ్నించబోతుంది. కాని ఫెడరిక్‌సన్ ఆమెకన్న ముందు ప్రశ్నిస్తాడు.)

ఏన్! ఇప్పు డెలా ఉంది?

ఏ: నిద్రపోయాడు బాబూ! అరగంటకింద నిజంగా భయంవేసింది. ఊపిరికోసం కొట్టుకపోయేడు.

ఫె: ఫరవాలేదులే ఇంక. మీ తండ్రి ఆరోగ్యం కోసం ప్రార్థిస్తాను!

ఏ: తమ ఋణం తీర్చుకోలేను బాబూ!

[ఆ మాటలంటూ ఆమె ప్రక్క గదిలోని వెళ్తుంది.]

మే: జార్జ్! నాకొక సందేహం ఉంది.

ఫె: తప్పకుండా చెప్పు మేరీ. నివారించడానికి ప్రయత్నిస్తాను.

మే: అబ్బే! అంత గొప్పసందేహం ఏమీ కాదులెండి!

ఫె: గొప్పదయినా కాకపోయినా సందేహమంటూ మనస్సులో ఉంటే చీడపురుగులా మనిషిని తినేస్తుంది.

మే: (టేబులు మీద గోటితో గీస్తూ తలవంచుకొని) జార్జ్! ఒక ప్రియమైన వస్తువుని కాపాడుకోనేందుకు... కాదు, అలా కాదు ఒక నిస్సహాయుణ్ణి నిర్దోషిని అనుకోండి, కాపాడేందుకు ఒక పాపంచేస్తే ఏమన్నా తప్పుందా? (ఆమె ముఖం ఎర్రబారుతుంది. ఆఖరి పదాలు నీరసంగా వెలువడతాయి) పాపం అంటే ఒకరికి హింసఉండదు. ఏం జార్జ్?

[ఫెడరిక్‌సన్ ఆలోచిస్తూ ఉంటాడు]

ఒద్దులెండి! ఇప్పుడు చెప్పనక్కరలేదు. ఊత్తినే అడిగేను. పిచ్చిసందేహం. అక్కరలేదు. అంతగా ఆలోచించకండి.

ఫె: నాకు శ్రమనిస్తున్నానని బాధపడబోకు! నువ్వెంత ఒద్దన్నా నీకు జవాబుకావాలని నాకు తెలుసు.

మే: (మౌనం వహిస్తుంది)

ఫె: సంఘనియమాలకి విరుద్ధమయిన పనులు పాపకార్యాలని, అనుగుణ్యంగా ఉన్నవి పుణ్యకార్యాలని అంటారు. సంఘం అంటే మానవ సమాజం. ఒకరికి సహాయపడడానికైనా సరే నువ్వు పాపంచేస్తే, అది తప్పక్రిందే ఒస్తుంది. ఎందుకంటే ఆ వ్యక్తికి మేలుచేసి నువ్వు సంపాదించే పుణ్యం కన్న నీ పాపమే సంఘదృష్టిని ఆకర్షిస్తుంది. పాపపుణ్యాలు దేశాన్నిబట్టి, ఆచారాల్నిబట్టి మారుతూ ఉంటాయి. కాని, మేరీ! ఎంత ఆలోచించినా ఆలాటిపని తప్పు అని నా మనస్సు ఒప్పుకోలేకుండా ఉంది!

మే: (కొద్దిగా ముఖం వికసించగా) నిజమా జార్జ్!

[ఔనన్నట్టు తల ఊపుతాడు ఫెడరిక్‌సన్ మేరీ గాలికి ఎగిరే కిటికీ కర్టెన్ సందా దూరంగా కానవస్తున్న కొండల్ని చూస్తూ ఉంటుంది]

## రంగము: III

[అంతా మొదటి రంగంలానే ఉంటుంది. రాత్రి 8–30 గం॥ సమయం. గదిలో ఫెడరిక్‌సన్, మేజర్ ఫ్రాంకో, మేరీ ఉంటారు—మేజర్ ఫ్రాంకోకి, ఫెడరిక్‌సన్‌కి మధ్యని మేరీ కూర్చుంటుంది. ఆమె మనస్సు స్థిమితంగా లేదని ముఖం చాటుతోంది—డిన్నర్ అప్పుడే పూర్తయిందని కాఫీ ప్లేట్లు చాటుతున్నాయి—కాఫీ కలుపుకుంటూ ఉంటారు ముగ్గురూ]

ఫ్రాం: ఈరాత్రే నేను నా బెటాలియన్లతో ఈఊరు వదలాలి!

ఫె: ఈరాత్రే! రేపో ఎప్పుడో అనుకుంటున్నాను. ఈ రాత్రప్పుడు!

ఫ్రాం: బ్రిగేడియర్ ఫాక్స్‌కి ఇక్కడి అధికారం పూర్తిగా అప్పచెప్పాను. వందమైళ్ళు ఈ రాత్రే వెళ్ళాలి. అక్కడా నాపోస్టు రేపు ఉదయం నుంచీ.

ఫె: నాలుగు నెలలయింది కదూ?

ఫ్రాం: నేనీ ఊరువచ్చి? ఔను.

ఫె: కొద్దికాలంలో నే వెళ్ళిపోతున్నారు. (ఆలోచనగా) మీ సైన్యాలు వెనకకి తగ్గుతున్నా యనుకుంటాను!

ఫ్రాం: (ఆశ్చర్యపడి, చికాకును మరుగుపరుస్తూ) అది పొరపాటు! ఒక్క సైనికుడి బొందెలో ప్రాణం ఉన్నా అలా జరగదు. ముందుకి! ఇంకా ముందుకి! అదే మా

ఫె: దేశభక్తి మీ ప్రతి రక్తకణంలోనూ ఉంది మేజర్!

ఫ్రాం: ఎగతాళి చెయ్యనక్కరలేదు. నిజంగా ఉంది!

ఫె: ఎగతాళి అని ఎందు కనుకుంటారు? నేనెవరినీ ఎగతాళి చెయ్యను. సాధ్యమైనంతవరకు ఒకరికి కష్టం కలిగించను. నిజానికి మీరంటే నాకొక విధమైన ఆదరణ ఉంది. శత్రుపక్షంలోనివారైనా, మీ పట్టుదల, కార్యదీక్ష, మంచితనం, నన్నాకర్షించాయి.

[ఫ్రాంకో, ముఖం ఎర్రబడగా తల దించుకుంటాడు — మేరీ, భర్తముఖంలోనికి ఆశ్చర్యంగా చూస్తుంది.]

ఫ్రాం: అంత ప్రశంస అనవసరం కాని, ఏదెలాఉన్నా నా పనిలో మాత్రం నన్నెవరూ వేలెత్తి చూపించలేరు.

ఫె: నిజం మేజర్ నిజం! కాని ఇన్నాళ్ళకి కొన్నిమాటలు మీతో ముఖాముఖి మాట్లాడడానికి బుద్ధిపుట్టింది. మీరు వెనకకి తగ్గుతున్నారని నాకు తెలుసు! నామాటలు వినండి. మేమంతా పట్టుపట్టి ఇక్కడె ఉన్నాం! ఉంటున్నాం! కనీసం ఒక వంద కుటుంబాలనైనా ఉంచగలిగాను! ఒప్పు! ఉన్నచోటే ఉండటం! మీ బలిమి తగ్గేవరకు.

ఫ్రాం: (తనని తాను లొంగదీసుకుంటూ) మీ ఊహలు చాలా వున్నాయి. వాటిలో నిజం కొంత లేకపోలేదు. కాని మేం తగ్గడం సున్నా. మీ వంద కుటుంబాలూ మాకేం నష్టం చెయ్యలేవు. ఇక్కడికొచ్చే ప్రతిమేజరు, బ్రిగేడియరు, ఒక్కొక్క ఫ్రాంకో!

[మేరీ ఊపిరాగినట్టయి అలజడిని మరుగు పరుస్తుంది]

ఫె: పోనీయండి. సంగతి మార్చేద్దాం. మిత్రులుగా విడిపోదాం.

ఫ్రాం: (అయిష్టంగా) తప్పకుండా!

: మేరీ, మాట్లాడకుండా అలా కూర్చున్నావేం? రోజూ, పిచ్చాపాటీ చెప్పుకోడానికి, ఇక్కడ కళగా ఉండడానికీ సహాయపడే ఒక మనిషి వెళ్ళిపోతున్నా, -మీలో ఆఖరి సైనికుడుకూడా వెళ్ళిపోవడమే నాఉద్దేశమైనా నాకెందుకో విచారంగానే ఉంది మేజర్ — మేరీ!

మేరీ: (నీరసంగా) ఔను జార్జ్!

ఫ్రాం: మీ సాహచర్యం పోగొట్టుకోడం, నాకూ విచారంగానే ఉంది. (మేరీవేపు క్రీగంట చూస్తాడు) ఇది తప్పనిసరి. కాని ఫాక్స్‌కూడా నాలాటివాడే. నే నెలా ఉండేవాడినో అతడూ అలానే ఉంటాడు. రేపట్నించి, నాకుబదులు అతను మీకు సన్నిహితుడుగా ఉంటాడు.

ఫె: స్నేహం కుదరడం కష్టం! కుదిరాక విడిపోడం కష్టం. మాదేశానికీ మీదేశానికీ సంధి జరిగినప్పుడు, దేముడు మేలుచేస్తే అది త్వరలోనే జరుగుతుంది, మన స్నేహం మరింత బలపడుతుంది!

ఫ్రాం: (మేరీవైపు తిరిగి చిరునవ్వు తెచ్చు మిసెస్ ఫెడరిక్‌సన్, బ్రిగేడియర్ ఫాక్స్‌ని మీ భర్తకి ప్రొద్దుట పరిచయం చేశాను. రేపు మిమ్మల్ని కలుసుకుంటాడు.

[మేరీ ముఖంలో రక్తంలేకుండా పోతుంది]

ఫె: మనిషి నెమ్మదయినవాడులా నే కనుపించాడు. అతడ్ని రేపు డిన్నర్‌కి ఆహ్వానించాను ఏం మేరీ?

మే: (తేరుకొని) ఊఁ-

ఫ్రాం: (గడియారం చూసుకొని ఒక్కసారిగా లేస్తాడు)

ఫె: అప్పుడే!

ఫ్రాం: ఔను. టయిమయింది. వందమైళ్ళు వెళ్ళాలి. ఉదయం ఆరుగంటలకి చార్జి తీసుకోవాలి. దారి బాగాలేదు. లారీలు అక్కడక్కడ లోయ్యాలి కూడా!

[ఫెడరిక్సన్, మేరీ లేస్తారు]

ఫె: ఉండండి! కోటువేసుక వస్తాను, మీ క్యాంపువరకు మీతో.

ఫ్రాం: ఎందు కనవసరపు శ్రమ మీకు!

ఫె: శ్రమ అంటే నేనొప్పుకోను. ఒకరినొకరు కష్టపెట్టకుండా ఉండలేరని మీకోసారి చెప్పేను. ఐనా నా ఇష్టమొచ్చిన దే నేనొస్తున్నాను.

ఫ్రాం: (నవ్వుతూ) నా ఇష్టంకూడా ఉండాలిగా.

[ఫెడరిక్సన్ వినిపించుకోకుండా ప్రక్కగది లోనికి వెళ్తాడు. ఫ్రాంకో మేరీని సమీపించి ఆమెను కౌగిట ఇముడ్చుకోబోతాడు. మేరీ వెనుకకు తగ్గుతుంది. ఫ్రాంకో తెల్లబోతాడు]

ఫ్రాం: ఇదేమిటి? మేరీ! ఆఖరి ముద్దు!!

మే: (మాటల్ని నొక్కుతూ) ఎంత తెలివిలేనిదాన్నయాను—మరొక ఫ్రాంకో! మరొక పశువు!

[ఫ్రాంకో ముఖం నల్లబడుతుంది. ఆశ్చర్యంగా ఆమెను చూస్తూ ఉంటాడు.]

లేపు ఫాక్స్! ఎళ్ళండి వుల్ఫ్! ప్రతివాడూ ఒక్కొక్క ఫ్రాంకో! ఒక్కొక్క పశువు!

ఫ్రాం: (మెల్లగా) మేరీ! ఏమిటా మాటలు!

మే: ఓర్మి! జార్జ్ చెప్పేరు! ఓర్మి! (నిరసనగా నవ్వి) ఎంత ఉంది నాలో!!

[కోటు వేసుకుని ఫెడరిక్సన్ తిరిగి వస్తాడు. ఫ్రాంకో సర్దుకుని వెనుకకి అడుగులు వేస్తాడు.]

ఫ్రాం: మీ భార్యవద్ద సెలవు తీసుకుంటున్నాను. ఆవిడ చాలా విచారిస్తున్నారు.

ఫె: (చిన్న నవ్వునవ్వి) ఒక స్నేహితుణ్ణి పోగొట్టుకున్నాక మేరీ కొన్నినాళ్ళవరకు స్థిమితపడలేదు.

ఫ్రాం: గుడ్ బై మిసెస్ ఫెడరిక్సన్!

[గిరుక్కున తిరిగి, ఫెడరిక్సన్తో కలిసి గది వదుల్తాడు.]

* * * *

గదంతా చీకటయి, తిరిగి వెలుగివుతుంది, ఒక అరగంట గడిచిపోయినట్లు సూచనగా—

[మేరీ టేబులుమీద తల ఆన్చి, చేతులు దాని మీదనే ఆన్చి కుర్చీలో కూర్చొని, నిద్రపోయినట్లు ఉంటుంది. ఆమె కొక గజం దూరాన్న కాఫీ కప్పు క్రింద మూసిఉన్న ఒక కవరుంటుంది. ఏస్ ప్రవేశిస్తుంది వీధిలోనుంచి]

ఏన్: (మేరీ దగ్గరకువెళ్ళి) అమ్మగారూ! (ఆమె ముఖం ఆతురతను వెలిబుచ్చుతుంది. మేరీ ఒంటిమీద చెయ్యివేసి సున్నితంగా ఆమెను కుదుపుతూ) అమ్మగారూ, అమ్మగారూ!! (మేరీలో ఏమాత్రం చలనంలేదు ఏన్ ముఖం భయంతో నల్లబడుతుంది. ఈసారి గట్టిగా కుదుపుతూ) అమ్మగారూ! అమ్మగారూ!!

[మేరీ మాట్లాడదు. ఏన్ భయంతో వీధి ద్వారంవైపు పరుగెడుతుంది—ఫెడెరిక్‌సన్ అప్పుడే తలుపుతోసుకొని ప్రవేశిస్తాడు; ఏన్‌దగ్గరగా]

బాబూ! అమ్మగారు మాట్లాడటంలేదు. ఎంత లేపినా కదలటంలేదు!

ఫె: ఆ!!!

[నోరు మాటలేకుండా, పరుగున మేరీని సమీపించి ఆమెను కుదుపుతాడు]

మేరీ! మేరీ!

[భయం ఆవహించగా, వెర్రివాడిలా ఆమెను కుదుపుతాడు]

మేరీ, డియర్!

[ఆమె చెయ్యి అందుకొని నాడిచూసి అలానే కుర్చీలో కూలబడతాడు]

ఏన్! ఏన్! అయిపోయింది. అయిపోయిందంతా!

ఏన్: అలా అనకండి బాబూ. అలాఅనకండి ఏమయింది. సరీగా చెప్పండి.

ఫె: ఇంకేమున్నాలి ఏన్! మేరీ ఇంకలేదు—ఇంక మేరీ నాకులేదు. ఏమిటిదంతా! ఇప్పుడిప్పుడు మాట్లాడింది. ఇప్పటికిప్పుడు తిరిగి వచ్చేలోపల ఓరి భగవంతుడా!

[కప్పుక్రిందవున్న కవరుమీద అతని దృష్టి పడుతుంది. వెంటనే దాన్ని చివాల్నతీసి చింపి, నాలుగు పుటల ఉత్తరం బయటికి తీస్తాడు. పుట తరువాత పుట తిరిగి పోతాయి. అతని ముఖం ఆశ్చర్యం, కోపం, విచారం, అలా ఎన్నో మార్పులుపొందుతుంది--ఆఖరికి ఉత్తరం టేబిలుమీద పడేసి నిర్జీవ ప్రతిమలా ఉండిపోతాడు. ఏన్ ఫెడరిక్‌సన్ తీరుచూసి భయపడుతుంది.]

ఏ: బాబూ! బాబుగారూ!!

ఫె: (నీరసంగా) బ్రతికేఉన్నాను. భయపడకు ఏన్! నాకు చావు ఎంత దూరానాకూడా కనబడదు. భయపడకు!

ఏ: ఏమిటి బాబూ మీరలా ఉన్నారు! అమ్మగారు!

ఫె: (ఒక్కసారి లేచి పెద్దగొంతుతో) ఏన్!

ఏ: (తృళ్లిపడి) బాబూ!

ఫె: ఇంక వెళ్లు ఇక్కడ్నించి. ఇప్పుడే వెళ్లు నామాటలు వినకండి. ఇక చెవిని పెట్టకండి. మతిలేని వాణ్ని నేను. వెళ్లు. వెళ్ళండి! అంతా వెళ్ళండి! పెళ్లాం పిల్లల్ని వెంటపెట్టుకుని. ఊరూ వాడా వదిలి వెళ్ళండి! ఓర్చకండి! నా మాటలు వినకండి. నేను వెర్రివాడ్ని. వెళ్ళండి.

ఏ: బాబు!

ఫె: (గట్టిగా) వెళ్లవేం? వెళ్లు. ఏన్! వెళ్ళూ! (గర్జిస్తాడు. ఏన్ భయపడి వీధిలోనికి పరుగెడుతుంది.

[దూరంగా మిలటరీ బ్యాండుశబ్దం వినవస్తూ ఉంటుంది. మేరీ దేహాన్ని చూస్తూ ఫెడెరిక్‌సన్ అలా నిల్చుండిపోతాడు. అతడి కన్నులు నీటితో నిండిఉంటాయి.]





# కలగూరగ ప

## లిన్ యూటాంగ్

"ఆదర్శ పురుషుడు" అంటే ఏ దోష లేశమూ లేని స్వచ్ఛందతా సంపూర్ణుడని కాదు అర్థం. యుక్తాయుక్త వివేచన చేయగల సహృదయుడని మాత్రమే అవగతం చేసుకోవాలి"—ఇది 'ఆదర్శపురుషుడు' అనే పదానికి లిన్ యూటాంగ్ చేసిన నిర్వచనం. ఈ నిర్వచనం అక్షరశః ఆయనకే వర్తించుతుంది. "గొప్పతనం" అంటే సాంఘిక జీవితంలో పైపైకి ఎగబ్రాకటమేనని అర్థం చెప్పుకుంటే ఈ విషయంలో ఆయన కేవలం తెలివిమాలిన అమాయకుడనవలసి వస్తుంది. గొప్పవాడుగా గుర్తించబడాలనే తాపత్రయం ఆయనకు యేకోశానా లేదు. ఏదో ఒక కార్యాన్ని సాధించి దాన్ని చూసి మురిసిపోకుంటూ, నిద్రమత్తు జీవితంలో మునిగిపోవటమంటే ఆయనకు హడలు; జీవితంలో ఏ మార్పూ లేకుండా యాంత్రిక ప్రవర్తనలోకి దిగజారిపోవటమంటే, అంతకంటే చిరాకు; ఆయన అభిప్రాయంలో "నాగరకత" అంటే, అద్భుత విషయాలను కనుక్కోవటంగాదు. అట్టి విషయాలను కనుక్కోవాలని మానవునిలో వుండే ఆవేశాన్నే ఆయన నాగరకతగా పరిగణించాడు.

మనసువిప్పి పకపకా నవ్వగలగటం నీచులైన వారికి సాధ్యమయేదిగాదు. ఇది క్షమాగుణానికీ, మానవత్వానికీ, నిరాడంబర సౌశీల్యానికీ చిహ్నమైన గుణం. ఇది లిన్ యూటాంగ్‌కు తండ్రినుంచి సంక్రమించిన వారసత్వం. ఆయన పకపకా నవ్వుతూ వుంటే ఏవో మధురాతి మధురములైన వసంత సౌరభాలు వీచుతున్నట్టు చుట్టూ వున్నవారి హృదయాలు ఆనందమయము లౌతాయి. 'మానవమాత్రుడుగా సహజంగా బ్రతకటం అది నా పాలిటి స్వర్గం' అన్నాడు.

లిన్ యూటాంగ్ దక్షిణచైనా ఫూకియన్ రాష్ట్రంలోని ఒక అందమైన నగరంలో జన్మించాడు. తన తలిదండ్రులను గురించీ ముత్తవతల్లిని గురించి ఇలా వ్రాశాడు.

'మాది రైతువంశం. మా నాయనమ్మ కష్టజీవి; సహజంగా దేహదార్ఢ్యంగల స్త్రీ. ఏ వెదురువాసమో చేతికి దొరికిందంటే డజనుమంది మగాళ్ళను పొలిమేర దాటేవరకూ తరిమివేసే సత్తాగలది. మా నాన్న కొంతకాలం, మిఠాయి సరుకులు [illegible] వేసుకుని ఊరూరా తిరిగి విక్రయించేవాడు. భుజస్కంధాలమీద భారం మోయటం ఆయనకు బాగా అనుభవం. బిడ్డలను చుట్టూ కూర్చోబెట్టుకుని వారిలో ఉదారతను వికసింపజేయటానికి దయారహితులైన యజమానివద్ద తాను బడ్డ పన్నములను కథలు కథలుగా వర్ణించి చెబుతూ వుండేవాడు. మా తల్లి చాలా అమాయకురాలు; కేవలం ఒక చిన్న మతబోధకుని భార్య అయివున్నాకూడా ఆమెను గ్రామంలో వున్న పెద్దా చిన్నా చాలా గౌరవంగా చూసేవారు.'

లిన్ తండ్రి ఒక ప్రెస్బిటేరియన్ మతబోధకుడు. చాలా దూరదృష్టిగలవాడు. ఆయనలో అనంతమైన విజ్ఞానతృష్ణ వుండేది. దేశదేశాలనుంచీ అనేక గ్రంథాలను తెప్పించి చదువుతూ వుండేవాడు. అలా చదువుతూవుంటే నవనవోజ్వలమైన ఒక నూత్న జగత్తు ఆయనకు దృగ్గోచరమైంది. ఆ దివ్యదర్శనాన్ని తన సంతానానికి కూడా కలుగజేయటానికి ఆయన తనకుగల సర్వస్వాన్నీ వెచ్చించాడు. స్వల్పమైన తన జీవితంలో మిగల్చ గలిగిన ప్రతి దమ్మిడీ షాంఘై విశ్వవిద్యాలయంలో చదువుతున్న తన కుమారునికి పంపుతూ వుండేవాడు.

లిన్ షాంఘైలో డిగ్రీ సంపాదించి కొంత కాలం, ట్సింగ్‌హా విశ్వవిద్యాలయంలో ఆంగ్ల భాషా బోధకుడుగా పనిచేశాడు. 1919 లో వివాహం జరిగింది. అనంతరం, ఉన్నత విద్యాభ్యాసంకోసం,

భార్యతో సహా అమెరికా వెళ్లాడు. 1920 నాటికి హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో యం. ఏ. డిగ్రీ సంపాదించాడు. మరుసంవత్సరం చీనా దేశస్థులైన కార్మికులకు వ్రాయనూ చదువనూ నేర్పుతూ ఫ్రాన్సులో గడిపాడు. అనంతరం చైనాకు తిరిగి వచ్చి పెకింగ్ విశ్వవిద్యాలయంలో ఆంగ్లభాషా శాఖలో ప్రొఫెసరుగా పనిచేశాడు. ఈ విశ్వవిద్యాలయంలో మూడు సంవత్సరాలు ఉజ్జ్వలమైన జీవితాన్ని గడిపాడు. 1926 వచ్చేసరికి మేఘాలు ఆవరించినై. లిన్ యూటాంగ్ పేరు దేశద్రోహుల జాబితాలోకి యెక్కింది. నగరంనుంచి పరారీ అయి కొంతకాలం అజ్ఞాత జీవిగా బ్రతికాడు. ఆరోజుల్లో జరిగిన కొట్లాటలలో గూండాలు ఆయన్ను ముక్కు బద్దలుకొట్టారు. ఆ ముక్కు రాజకీయ గుండాల చేతుల్లో ఆయన అనుభవించిన బాధలకు ఒక శాశ్వత చిహ్నంగా అలా వుండిపోయింది

ఈ అజ్ఞాతపథంనుంచి లిన్, హోనాయ్ విశ్వవిద్యాలయంలో ప్రథానాచార్యుడు (డీన్)గా తేలాడు. ఈ ఉద్యోగానంతరం కొద్దికాలంపాటు హాంకౌ ప్రభుత్వ విదేశాంగశాఖలో రాజకీయోద్యోగ జీవితాన్నికూడా చవిచూచాడు. అది ఆయన అభిరుచికి యేమాత్రం నచ్చలేదు. షాంఘైలో మకాం పెట్టి నిరంతర రచనా కార్యక్రమంలో జీవితం గడపటానికి కృతనిశ్చయుడై 1927 లో షాంఘైకి మకాం మార్చాడు. ఎత్తినకలం దింపకుండా ఎనిమిది సంవత్సరాలు వాఙ్మయ వ్యాసంగంలో గడిపాడు. 'చోటా విమర్శకుడు' అనే పేరుతో 'చైనా క్రిటిక్' అనే ఆంగ్ల వారపత్రికలో ప్రత్యేక శీర్షికను నిర్వహించేవాడు. ఈ విమర్శలతో ఆంగ్ల రచయితగా ఆయన పేరు విఖ్యాతికి వచ్చింది. తానే స్వయంగా మరి మూడు పత్రికలను స్థాపించి సంపాదకత్వ బాధ్యతను నిర్వహించుతూ వుండేవాడు. అనతికాలంలో ఈ మూడు పత్రికలూ కూడా మంచి పలుకుబడిని సంపాదించుకున్నయ్. 'ఎనలెక్ట్సు' అనేది హాస్యరస ప్రధానమైన పక్షపత్రిక. రెండవది ఎడిసన్ 'స్పెక్టేటరు' లాటింది. మూడవది విజ్ఞానవేత్తలకంటే, సామాన్య పౌరుడికి ఎక్కువ ఉపయోగకారిగా వుండే పత్రిక. "చోటా విమర్శకుడు" శీర్షికలో వచ్చిన రచనలలో ఒక దానిలో లిన్ తన్నుగురించి తాను ఇలా వ్రాశాడు:

నైతికాదికాలలో, నేనూ నలుగురితోపాటు సద్బుద్ధి గలవాణ్ణే; దేవుడికి, నాతల్లికి నాపట్లవున్న ప్రేమలో సగం ప్రేమవున్నా, నన్ను నరకానికి పంపడు. నాకే స్వర్గానికి పోయే! ఆస్కారం లేకపోతే, ఈ జగత్తుకు అధోగతే.

1935 లో లిన్ "నా దేశం నాప్రజా" అనే ఉద్గ్రంథాన్ని ప్రచురించాడు. ఆ గ్రంథాన్ని అంత నిర్మొగమాటమైన ధోరణిలో రచించినందుకు ఆయన్ను చాలామంది విమర్శించారు.

1936లో ఆయన అమెరికా వెళ్లాడు. అక్కడవుండి 'బ్రతుకు ప్రాధాన్యం' అనే గ్రంథాన్ని రచించాడు. ఆ గ్రంథంతో ఆయనకు అంతర్జాతీయ విఖ్యాతి లభించింది. పెరల్ బక్ ఈ గ్రంథాన్ని ప్రశంసించుతూ 'లిన్‌యూటాంగ్ చీనా వేదాంత సంపదనంతా కాచి సారం పిండి అందించాడు' అన్నది. లిన్ 1938 వరకూ అమెరికాలో వున్నాడు. అనంతరం ఒక సంవత్సరం ఫ్రాన్సులో గడిపాడు. 1939 లో తిరిగి అమెరికాకు వచ్చాడు. వచ్చీ రావటమే 'మోమెంట్ ఇన్ పెకింగ్' అనే రచనను ప్రకటించాడు. ఈ నవలలో లిన్‌యూటాంగ్ రచనావైభవం పరాకాష్ఠ నందుకున్నది. ఈ నవలనూ, వెనువెంటనే ప్రకటింపబడిన 'లీఫ్ ఇన్ ది స్టారమ్' అనే నవలనూ రెండింటినీ చదివితే, మానవహృదయం

నిర్మలమై కరుణావిలమౌతుంది. ఇది 'టాల్‌స్టాయ్ రచించిన 'వార్ అండ్ పీస్' అనే నవలతో తుల దూగగల మహానిర్మాణమని అబ్జర్వర్ పత్రిక అభినుతించింది. 1940 లో కొద్దికాలం చైనాలోవుండి తిరిగి అమెరికావచ్చాడు. అనంతరం వరసని 'బిట్వీన్ టియర్స్ అండ్ లాఫ్టర్' 'విత్ లౌ అండ్ ఐరనీ' అనే గ్రంథాలు ప్రకటింపబడినై. ఈ రెండవగ్రంథం చదివితే లిన్ "వాస్తవ దృక్పథంగల ఆదర్శవాదిగా మనకు కనుపించుతాడు. తాను చైనాలో చూచి వచ్చిన విషయాలను 'విజిల్ అఫ్ ఎ నేషన్' అనే గ్రంథంలో వివరించాడు.

1944 లో లిన్ భారతదేశానికి వచ్చాడు. ఆయనకు భారతదేశంలో అనేకమంది పెద్దల పరిచయం కలిగింది. కాని మిగతా అందరికంటే, డాక్టర్ రాధాకృష్ణన్ ఆయనకు మహాపురుషుడుగా గోచరించాడు. తన వ్యక్తిత్వానికీ శ్రీ రాధాకృష్ణన్ వ్యక్తిత్వానికి అత్యంత సన్నిహితమైన సామీప్యత యేదో వున్నట్టు ఆయనకు తోచింది. డాక్టర్ లిన్ ఐక్యరాజ్యసమితి విజ్ఞానమండలిలో చేరిన తరువాత, ఆయనకు రాధాకృష్ణన్‌తో మరింత సన్నిహితత్వం యేర్పడి ఆయనపట్లవున్న గౌరవం మరింత ఇనుమడించింది. ఆయన ఐక్యరాజ్యసమితిలో సంవత్సరం కంటే ఎక్కువకాలం పనిచేయలేదు. అనంతర దశలో లిన్ తన కాలాన్నంతా గ్రంథరచనలోనే గడిపాడు. 'చైనా విజ్ఞానం,' 'భారతీయ విజ్ఞానం,' 'అమెరికా విజ్ఞానం,' కన్‌ఫ్యూసియస్ విజ్ఞానం,' 'లాత్సేవిజ్ఞానం' ఇత్యాదయః అనేక గ్రంథాలు రచించాడు. భారతీయ విజ్ఞానం అనే గ్రంథంలో లిన్ 'సీతా మహాసాధ్వికి' జోహారు లర్పించాడు.

'అమెరికా విజ్ఞానం' అనే గ్రంథంలో లిన్ ఇలా వ్రాశాడు.

'ప్రత్యేకంగా ఏ సిద్ధాంతమన్నా నాకు విద్వేషమేమీ లేదు. సిద్ధాంతాల మొండి బానిసత్వం అంటే నాకుఅసహ్యం. మతానికి దేనికైనా సిద్ధాంతాలే ప్రాణమని ప్రతిమతంవారూ చెబుతారు. అంటే 'మతం' అనగానే వివేచనకు శత్రువని మనం అనుకోవలసి వస్తుంది. సృష్టిలోవుండే పరమసత్యాన్నంతా పొట్లం గట్టి దాచివుంచామనీ, వ్యక్తిగతంగా దాని యుక్తాయుక్తతను పరిశీలించుకోవలసిన అవసరం యే ప్రాణికీ లేదనీ అంటారు. మతాలు సిద్ధాంతాలను ఉడుంపట్టుపట్టి కూర్చున్నయ్... ఇందులో రాజీ అవసరం."

[ఆర్యన్ పాత్ పత్రికకు కృతజ్ఞత]

# గృహరాజసౌధము

ఫిబ్రవరినెల భారతి పత్రికలో ప్రాచీన రాజ సౌధములనుగురించిన వ్యాస మొకటి శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు వ్రాసినది చదివితిని. గృహ రాజసౌధ నిర్మాణమునుగురించి యింతవరకు కొండ వీటికైఫీతు, దండకవెలలనుబట్టి సాధారణముగా పండితులందరు నది పెదకోమటి వేమారెడ్డి కాలములోనే గట్టింపబడినట్లు విశ్వసించుచు శ్రీనాథుని గాథను గూడ నిజమనియే తలచుట ఆచారమైపోయినది. కాని యిటీవల వెలువడిన కొమరగిరిరెడ్డి భూపాలుని కొమరగిరివరం శాసనమునుబట్టి యది కొమరగిరి రెడ్డియే కట్టించినట్లు నిశ్చితమైనది. ఈ శాసన మిది వరలో రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి వారి ఆంగ్ల త్రైమాసపత్రిక సంపుటము XI. 3 & 4 సంచికలో ప్రచురితమైనది.

"కొండవీడు రితిఖ్యాతా
పురేస్థిత్వా కులాగతే
కుమారగిరి భూపోయం
చిరమ్ భూమి మపాలయత్ 11—17.
లీలాగృహం కనకరత్నచయై రనేకైః
ప్రాసాదమున్నత శిఖర గృహరాజ సంజ్ఞామ్
క్రీడాసరాం సిచ
విధాయ వసంతరాయ
కేళీరధానసి సహా రమతప్రియాభిః 11—18

ఈ తామ్రశాసనము శాలివాహన శకము 1330 సం॥లో లిఖించబడినది. కావున పై శ్లోకములనుబట్టి కొమరగిరిరెడ్డి భూపాలుడే గృహరాజ సౌధము నిర్మించెననియు, కొండవీడుకైఫీతు, దండకవిలెలలోని విషయాలు ప్రమాణములు కావనియు తెలియుచున్నది—పెదకోమటి వేమారెడ్డికాలములో గూడ నది ప్రఖ్యాతిగానుండి వాడుకలో నుండి యుండును.

శ్రీ కొత్త భావయ్యా చౌదరి.

# ప్రత్యవమర్శనము

## నా గొడవ

[ఖండకావ్య సంపుటి]

కాళోజి నారాయణరావు. ప్రతులకు: దేశోద్ధారక గ్రంథమాల. సర్వోదయ ప్రెస్. మహాకాళి వీధి. సికింద్రాబాదు. వెల: రూపాయన్నర.

ఈ కవి రచనలో అంతటా ఒక విశిష్టమైన ప్రత్యేక వ్యక్తిత్వం సుస్పష్టంగా కనిపిస్తున్నది. భాషలోను, పలుకుబడిలోను, భావాల్లోను నలుగురూ పోయే దారిలోపోయే కవులీనాడు చాలామంది కనిపిస్తారు. కాని కాళోజీ దారి వేరు. ఈయన వ్రాసిన 'నా గొడవ' పఠించినప్పుడు మన మొక వినూతనమైన అనుభూతి ప్రపంచంలోకి వెళ్ళిపోతాము.

ఈ కవి సత్యాన్వేషకుడు. తనకు తోచిన సత్యం సూటిగా గుండెలకు దూసుకుపోయేటట్లు చెప్పగల నిజాయితీ ఈయనలో అడుగడుగునా ప్రత్యక్షమౌతూంటుంది. అయితే ఆ సత్యప్రకటనలో ఉండే తహతహ ఒక్కొక్కప్పుడు అతిగా వెళ్ళిపోయి, ఈయన కవిత కొన్నికొన్ని చోట్ల కాప్షీ పుస్తకాల ఒరవడుల ధోరణిలోకి దిగజారిపోతూంటుంది. వ్యత్యాసాలు అనే ఖండకావ్యంలో ఈ ధోరణి చూడవచ్చును.

"అన్నపురాసులు ఒకచోట
ఆకలి మంటలు ఒకచోట
హంసతూలిక లొకచోట
అలసిన దేహా లొకచోట
సంపదలన్నీ ఒకచోట
గంపెడు బలగం బొకచోట
వాసన నూనియ లొకచోట
మాసిన తల లిం కొకచోట"

అని ఈ కావ్యం ఇలాగే సాగిపోతుంది.

కాని కొన్ని కొన్ని ఖండకృతుల్లోను, ఘట్టాల్లోను మనకీ కవిసూక్తులు ఒక ద్రష్టసూక్తుల్లా వినిపిస్తాయి. ఈ 'మహామహా మేధావులు' అనే ఖండకృతి దీనికి తార్కాణంగా తీసుకోవచ్చును!

"స్వార్థామృత సిద్ధికోరకు
ప్రపంచ సముద్రం మధ్య
ప్రజామందరం మట్టు
పథకాల పాముచుట్టి
మహామహా మేధావులు
మథనం చేయుచునుందురు—
ఒకే ఒక ప్రపంచ నినాదం
ఒక్కొక్కని దొక్కొక్క ప్రపంచం
'సర్వే జనా స్సుఖినోభవంతు' లక్ష్యం
స్వార్థం! స్పర్థ! ఈర్ష్యలు ప్రత్యక్షం!"

ఈ 'అలజడి కొన్నాళ్లు' అనే ఖండకృతిలోని ఈ క్రింది వాక్యాలుకూడా ఇలాంటివే! వీటిలో సున్నితమైన అపహాస్యము, నిశితమైన సత్యదృష్టీ ప్రత్యేకంగా గమనించ తగినవి:.

దున్నేవానిదె భూమి
అన్నవాడే పురోగామి
ఉండేవానిదె ఇల్లు
అంటే నే మాట చెల్లు
అమ్మేవానిదె సరుకు!
అనందె సాగదు బ్రదుకు!
తోలేవానిదె బండి!
ఇదికూడ నిజము సుమండి!
కోసినవానిదె పంట
అనకుంటె రాదా తంట!
లేపినవానిదె మూట
అంటే మాత్రము చేటా!
ఈ అలజడి కొన్నాళ్లు
కొత్తదేవర తిరునాళ్ళు!
మళ్ళీ అదే పాతకత!
కాళోజీ కేల వెత!"

ఇలాగ వ్యంగ్యధోరణిలో అధునాతన రాజకీయ నినాదాలు వెక్కిరించే ధోరణితోపాటు నేటి సంఘంలో అన్యాయాలు తూర్పారబట్టే నిశితమైన సాంఘిక ధర్మ దృక్పథంకూడా ఈయన కవితలో ఎక్కువే!

ఈయనలోగల సత్యాన్వేషణ దృష్టి, సంకుచితమైన రాజకీయ నినాదాలకు, తాత్కాలికమైన అలజడులకు అతీతమై కాలావధులు దాటిన సూక్తి ధోరణిలో వినబడుతూంటుంది.

కాళోజీ ఒకవిధంగా వేమనకవి ధోరణికి చెందిన వాడని అనవచ్చును. వేమనలోగల గుణాలు, దోషాలు కూడా ఈయనలో కనిపిస్తాయి.

ఈ కవిలో ఉజ్జ్వలమైన భావనగాని, వేమన కవి కున్నంత ప్రవక్తృ గభీరతగాని లేకపోవచ్చును.

కాని ఈ కవిలోగల నిజాయితీ, స్వతంత్ర భణితి, పలుకుబడిలోనూ, భావవ్యక్తీకరణలోను గల ప్రత్యేకల పరిశీలిస్తే ఈయన అనునాసులలో తప్పకుండా జ్ఞాపకం ఉంచుకోదగిన కవేసుమా అనిపిస్తుంది.

కాళోజీ 'నా గొడవ' నేటికాలపు కవితా పరిణతి అవగాహన చేసుకోదలిచిన భావుకులందరు తప్పకుండా చదవవలసిన ఖండకావ్య సంపుటి.

---

## పరిశోధన

సారస్వత ద్వైమాసపత్రిక: సంపాదకులు శ్రీ తిరుమల రామచంద్ర: ప్రాప్తిస్థానం: భాషాసేవక సమితి, 2/583 పైక్రాఫ్ట్సురోడ్డు, తిరువళిక్కేణి మద్రాసు - 5. వెల పన్నెండు అణాలు.

ఇది సాహిత్యరంగంలో సమగ్రమైన పరిశోధన జరగాలనే పరమ ప్రయోజనాన్ని దృష్టిలో వుంచుకుని ప్రారంభింపబడిన పత్రిక. ఈకృషిలో నిర్వాహకులు కృతకృత్యులు కాగలరని ఆశించుచున్నాం. సంపాదకులు తమ 'మనవి మాటల'లో తొలివాక్యంగా, 'సాహిత్యమే ఛాందసంగా కనిపించే రోజుల్లో, పరిశోధన పరమ ఛాందసంగా కనుపించవచ్చును' అని సెలవిచ్చారు. సాహిత్యం ఛాందసంగా కనిపించటమే గాదు, పరమ ఛాందస ధోరణిలో నడుస్తోంది. సృజనాత్మకములైన రచనల విషయమే గాదు నేటి పరిశోధనా కార్యక్రమం కూడా చాలా వరకు అదేధోరణిలో వున్నది. ఈ విషయాన్ని గుర్తించగలరని ఆశించుచున్నాం. సాహిత్యం ఛాందసంగా వున్నదని ఎవరేనా అంటే వారిని నిందించి లాభం లేదు. ఛాందస ధోరణులనుంచి మరల్చి సాహిత్యాన్నీ, పరిశోధనా కార్యక్రమాన్నీ కూడా ఋజుమార్గానికిమలచవలసినబాధ్యతనుసాహిత్య రంగానికి బాధ్యతనువహిం మతున్న వారు గుర్తించవలసి వుంటుంది. సాహిత్యరంగానికి ప్రజాదృష్టి లేక పోవటం ఈ అనర్థాలన్నిటికీ మూలకారణం. ప్రజాక్షేమం పరమప్రయోజనంగా 'పరిశోధన' సాగితే దానికి నిస్సందేహంగా ప్రజాదరణ లభించి తీరుతుంది. ఇందుకు సంపాదకులు 'మనవి మాటల'లో సెలవిచ్చిన రీతి భయం అక్కరలేదు. సాహసోపేతులై సూక్ష్మ దృక్పథంతో ముందుకు సాగవచ్చు. ఈ ప్రథమ సంపుటిలో ప్రముఖులైన సాహిత్యకారులు వ్రాసిన అమూల్యములైన వ్యాసాలు కొన్నివున్నయ్. ముఖ్యంగా శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి 'ఆంధ్ర భాష; దక్షిణాపథ సంస్కృతి' అన్న వ్యాసం కనువిప్పు కలిగింది. 'పరిశోధన' దిగ్విజయంగా సాగి తెలుగుజాతికి ఇతోధికమైన సేవ చేయగలదని ఆశిస్తున్నాం.

## మాలికా రామాయణం

షట్కవి ప్రణీతము; రచయితలు: శ్రీయుతులు ఆకుండి వెంకటశాస్త్రి, శ్రీ పంతుల లక్ష్మీనారాయణ శాస్త్రి, దేవగుప్తాపు వెంకటరమణ కవిగారు, శ్రీ చింతలపూడి సన్యాసిరావు, శ్రీ గూలా పేరన్నకవి, శ్రీ ఉపాధ్యాక నారాయణమూర్తిగార్లు. కౌముదీ పరిషత్ ప్రచురణ: ప్రాప్తిస్థానం: బ్రహ్మశ్రీ ఉపాధ్యాక నారాయణమూర్తిగారు, వకీలు, పార్వతీపురం శ్రీకాకుళం జిల్లా; వెల రెండురూపాయిలు.

పై రచయితలార్వురూ ఆరుకాండలు ఘటించినారు. బాలకాండ యావత్తూ చంపకమాల; అయోధ్యాకాండ శార్దూలమాలిక; అరణ్యకాండ శార్దూలమాలిక; కిష్కింధాకాండ ఉత్పలమాల; సుందరకాండ ఉత్పలమాల; యుద్ధకాండ మత్తేభమాల. ఈ రచనలో ఇంతమంది రచయితలు పాల్గొనినా ఆ మూలాగ్రము ఒక ప్రవాహమువలెనున్నది. యుద్ధకాండమునులో శ్రీ ఆకుండి నారాయణమూర్తి గారు ఒక విలక్షణమైన నూతనమార్గము నవలంబించిరి. మోక్షార్థియై, పరాశక్తి స్వరూపిణియైన సీతామహాదేవిని సన్నిధియందుంచుకొని పరమాత్మ స్వరూపుడగు రామచంద్రుని సాధించుటకు రావణుడుచేసిన మహాయోగమే రామరావణసంగ్రామము యొక్క పరమార్థమును భావమును ధ్వనిరూపమున అంతర్వాహినిగా ప్రతిపాదించుచూ కథను నడిపినారు. ఈ కారణమున ఈ మహాకావ్యమునకు మరింత పవిత్రత సిద్ధించినది. ఈ గ్రంథము ఆంధ్రప్రజల ఆదరాభిమానముల నందుకొనగలదని ఆశించుచున్నాము.

---

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

## సిద్ధముగానున్నది.



# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

**R-L-STEVENSON**



మూలం:

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్



అనువాదం:

దాసు వామనరావు



డాక్టర్ జెకిల్ ఎండ్ మిస్టర్ హైడ్ **(Dr Jekyl And Mr Hyde)**

"మనిషిలో మనిషి" గ్రంథరూపంలో వెలువడినది

ప్రతులు కావలసినవారు తెప్పించుకొనుడు.

ప్రతి వెల రూ. **1-4-0**

## ఆంధ్ర గ్రంథమాల

తంబుచెట్టి వీధి, : : మద్రాసు 1.






ధరలంతయు ఎక్కువగానున్న ఈ రోజులలో ఎక్కడక్కడ మిగల్చగలనో అక్కడక్కడ మిగల్చడానికి చూస్తుంటాను. మొన్న మా ఆయన ఈలా అన్నారు: "నేను ఈవాళ ఇంటి సామానులను కొనుక్కొని వస్తాను." నేను సరే అన్నాను. ఆయన బజారునుండి ఒక 10 పౌనుల డాల్డా వనస్పతి డబ్బాను కొనుక్కొని వచ్చుటను చూడగానే నాకు కోపము వచ్చింది. నేను డబ్బు ఎక్కువ ఖర్చుకాకుండనుండేటందుకై మూతలు తెరువబడిన డబ్బాలోనుండు క్రొవ్వుపదార్థమును కొనుక్కొని వచ్చేదాన్ని. మా ఆయన ఒకేసారి 10 పౌనుల డాల్డా వనస్పతి డబ్బాను తెచ్చారు.

అయితే ఆయన చేసింది సరియే. ఆయన ఈలా అన్నారు: "మనకు ప్రపంచములో అన్నిటికంటే ముఖ్యమైన దేమిటంటే మన పిల్లల ఆరోగ్యమును జాగ్రత్తతో కాపాడుటయే. మూతలు తెరువబడిన డబ్బాలలో అమ్మబడినచో మిక్కిలి ఖరీదైనటువంటియు, ఉన్నతమైనటువంటియునైన క్రొవ్వుపదార్థములుకూడ కల్తీ చేయబడవచ్చును. మరియు అవి మలినముతోగూడిన చేతులతో ముట్టుకొనబడుటవలననో లేక ఈగలు వలననో చెడిపోయి యుండును. ఈ ప్రమాదములు రాకుండా నుండుటకై సురక్షితమైన మార్గమేదంటే సీలుచేయబడిన డబ్బాలోనుండు క్రొవ్వుపదార్థమును కొనుటయే."

ఎన్నో క్రొవ్వుపదార్థములున్నాయి. డాల్డా వనస్పతిని మాత్రమే కొనడానికి కారణమేమని నేను అడుగగా దానికి ఆయనవద్ద జవాబు సిద్ధముగా నుండినది.

"డాల్డా వనస్పతిలో వాడబడు పదార్థములన్నియు పరీక్షచేయబడి అత్యుత్తమమైనవిగా నుండును. డాల్డా వనస్పతిలో ఇప్పుడు విటమినులు ఏ, డి కూడయున్నవి. అది 10 పౌనులు, 5 పౌనులు, 2 పౌనులు మరియు 1 పౌను డబ్బాలలో అమ్మబడును. ఈ డబ్బాలు గాలికూడ చొరుటకు వీలులేకుండ సీలు చేయబడియుండును. మరియు అది ఎల్లప్పుడు శుద్ధముగాను, క్రొత్తగాను నుండును. అది అన్నివిధ వంటలకు దివ్యమైనది."

"మనము భుజించేవాటినంతటిని జాగ్రత్తతో ఎన్నుకోవాలిగదా" అని ఆయన ముగించారు. ఎంత నిజమో! అప్పటినుండి సీలుచేయబడిన డబ్బాలోనుండు డాల్డా వనస్పతిని మాత్రమే నేను కొనుచున్నాను. మీరుకూడ అలాగునే చేయండి!

మీ ప్రతిదిన ఆహారములో క్రొవ్వుపదార్థముండాలా?
ఉచిత సలహాకు ఈవేళే క్రింది అడ్రసుకు వ్రాయండి:

ది డాల్డా అడ్వైసరీ
పోస్ట్‌బాక్సు నంబరు 353,
బొంబాయి 1



చెట్టుతోనున్న
డబ్బాకై చూడండి

# డాల్డా వనస్ప

వంటకు దివ్యమైనది—ఖర్చు తక్కువ

HVM. 211-X52 TL